అపరాధ పరిశోధన అనుబంధం—153

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందిస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## లై డిటెక్టర్

రచన: వసుంధర

## నకిలీ సంపద

రచన: భీమవరపు పురుషోత్తం

## పులి పంజాలు

రచన: సుంకరి రాంప్రసాద్

## రాక్షస ప్రేమ

రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

అన్వేషణ - మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—153
సెప్టెంబరు, 1986
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్‌రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీటు, మద్రాసు-1.

# లై డిటెక్టర్

## వసుంధర

మొబైల్ వ్యాను—ఒక పక్కగా ఆపి అందులోంచి దిగాడు డిటెక్టివ్ కిల్లర్.

బయట ఎండ మండిపోతోంది.

కిల్లర్‌కి కడుపులో నకనకలాడుతోంది.

వీధిలో జనం అట్టేలేరు.

అతడు టైము చూసుకున్నాడు. టైము రెండుగంటలు.

చకచకా అడుగులు వేశాడతడు.

రోడ్డుకు అటూ యిటూకూడా హోటళ్ళున్నాయి.

కిల్లర్ పేర్లు చదువుతూ పోతున్నాడు.

చివరికి దొరికింది—అతడికి కావలసిన హోటలు.

ఆ హోటలు ప్రత్యేకత యేమీ లేదు—ఏసీ కావడం తప్ప!

కిల్లర్ హోటల్లో అడుగుపెట్టాడు—అద్దాల తలుపులు తీసుకుని.

లోపల చల్లని గాలి....

# 4

ఒక్క సారి స్వర్గంలో అడుగు పెట్టినట్లనిపించిందతడికి!

హోటల్ బాగా రష్‌గా వుంది.

లోపల చాలా గదులున్నాయి.

ఒక్కసారి వందమందికి భోజనం పెట్టడానికి సదుపాయాలున్నాయక్కడ!

కానీ బయట వేడిగా వుండడంవల్ల—లోపలకు వచ్చే జనం ఓ పట్టాన బయటకు వెళ్ళడంలేదు.

భోజనం కోసం కిల్లర్ అరగంటసేపు ఎదురుచూడాల్సి వచ్చింది. అయినా అందుకతడు విచారించలేదు.

లోపల హాయిగా వుంది.

భోజనం తాపీగా, తృప్తిగా చేశాడు కిల్లర్.

వంటకూడా రుచిగా వుంది.

"బిల్లెంతైనా ఫరవాలేదు—చాలా మంచి భోజనం" అనుకున్నాడు కిల్లర్.

క్లీనర్ వచ్చి అతడి ముందున్న మీల్సు ప్లేటు తీసుకుని వెళ్ళిపోయాడు.

సర్వరు బిల్లుతీసుకొని వస్తాడని ఎదురుచూస్తున్నాడు కిల్లర్.

అతడు లేస్తాడని మరో వ్యక్తి ఆత్రుతగా యెదురు చూస్తున్నాడు.

అతడి అసహనాన్ని, ఆకలినీ అర్థంచేసుకుని కిల్లర్ తనే లేచి నిలబడ్డాడు.

అతడు కూర్చున్నాడు.

కిల్లర్ హోటల్లోకి వచ్చేపోయే జనాన్ని చూస్తున్నాడు. బయటి ఎండనీ లోపలి చల్లదనాన్నీ సరిపోల్చి చూసుకుంటున్నాడు.

అలా ఎంతసేపు నిలబడ్డాడో అతడికే తెలియదు.

ఈలోగా అతడి స్థానంలో కూర్చున్న వ్యక్తికి భోజనం కూడా అయిపోయింది. అతడు బిల్లందుకుని వెళ్ళిపోతూ— "ఏమిటి సార్! మళ్ళీ భోంచేస్తారా?" అన్నాడు.

కిల్లర్ ఉలిక్కిపడ్డాడు.

అతడు వెళ్ళిపోయాడు.

అవును—సర్వర్ తనకింకా బిల్లివ్వలేదు. అడక్కుండానే బిల్లిస్తాడని తను చూస్తూన్నాడు. ఇంకా ఇవ్వలేదేం?

ఈ రష్‌లో సర్వర్ తన గురించి మర్చిపోయాడా?

తను భోజనానికి నిలబడ్డాడని అతడనుకున్నాడేమో?

సర్వర్ టేబిల్ దగ్గరకు రాగానే కిల్లర్ అతణ్ని పలకరించి—"నువ్వు నాకింకా బిల్లివ్వలేదు-" అన్నాడు.

సర్వర్ నవ్వి—"మీ పేమెంటైపోయింది సార్!" అన్నాడు.

"అదెలా సాధ్యం?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యంగా.

సర్వర్ అతడికి దూరంగా వేలుపెట్టి చూపించాడు.

అక్కడో సోఫా వుంది. అందులో ఇద్దరు మగాళ్ళు కూర్చుని వున్నారు.

"ఆ పొడుగు చేతుల చొక్కా-ఆయన మీ బిల్లు పే చేశారు—" అన్నాడు సర్వర్.

కిల్లర్ అతడినే చూశాడు.

వయసు నలభైలో వుండవచ్చు. మనిషి హుందాగా వున్నాడు. తననే చూస్తున్నాడు.

"అతడెవరో నాకు తెలియదు—" అన్నాడు కిల్లర్.

"నాకూ తెలియదు సర్ —" అన్నాడు సర్వర్.

"అలాంటప్పుడు నాకెందుకు చెప్పలేదు?"

"ఆయన మీకు చెప్పొద్దన్నారు సార్! మిమ్మల్ని

డిస్టర్బ్ చెయ్యొద్దన్నారు. ప్రత్యేకించి మీరడిగితే తప్ప పలకరించి ఏమీ చెప్పొద్దన్నారు. నాకు పదిరూపాయలు టిప్పిచ్చారు కూడా!"

కిల్లర్‌కి సర్వర్తో దెబ్బలాడాలనుకున్నాడు. కానీ ఇందులో అతిడి తప్పేముంది?

"సరేలే—" అని కిల్లర్ సోఫా దగ్గరకు వెళ్ళాడు.

పొడుగు చేతుల చొక్కా వ్యక్తి చటుక్కున లేచి నిలబడి—"మీకోసమే చూస్తున్నాను. మీతో నాకు పని వుంది—" అన్నాడు.

"నేనెవరో మీకు తెలుసా?" అన్నాడు కిల్లర్.

"తెలియదు—" అన్నాడు.

"తెలియని వ్యక్తితో మీకేం పని?"

"అన్నీ వివరంగా చెబుతాను. నాతో బయల్దేరి రండి—" హడావుడిగా అన్నాడతడు.

"ఎక్కడికి?"

"ప్లీజ్—ఇక్కడేమీ అడగొద్దు—"

కిల్లర్ మాట్లాడకుండా అతడితో బయటకు నడిచాడు.

ఆ వ్యక్తి ఎవరు? తన బిల్లెందుకు పే చేశాడు? అతడికి తనతో వున్న పనేమిటి?

ఆలోచన తీవ్రతలో కిల్లర్‌కి బయట ఎండ తెలియలేదు.

ఆ వ్యక్తి ఓ రిక్షాను కేకేసి మాట్లాడాడు.

ఇద్దరూ రిక్షా ఎక్కారు.

"ఇప్పుడు కూడా నన్నేమీ అడక్కండి. సరిగ్గా పది నిమిషాల్లో రిక్షా దిగుతాం మనం—" అన్నాడా వ్యక్తి.

కిల్లర్ మాట్లాడలేదు.

పదినిమిషాల తర్వాత ఇద్దరూ రిక్షా దిగారు.

ఆ వ్యక్తి రిక్షా అతడికి డబ్బిచ్చాడు.

అతడు కిల్లర్ చేయి పట్టుకుని తనతో నడవమన్నట్లు ముందుకి నడిచాడు.

ఇద్దరూ ఓ సందులోకి వెళ్ళారు.

"నా పేరు విల్సన్!" అన్నాడతడు నడుస్తూనే.

"ఊఁ" అన్నాడు కిల్లర్.

"నేనిప్పుడు చాలా ప్రమాదంలో వున్నాను...."

"ఊఁ."

"నన్ను మీరే రక్షించాలి—"

"నేనా?"

"అవును—మీరే!"

కిల్లర్ ఆశ్చర్యంగా—"నేనెవరో మీకు తెలుసు కదూ!" అన్నాడు.

"తెలియదు. హోటల్లో మిమ్మల్ని చూశాను. మీ ముఖంలో ఒక వింత తేజస్సు. మీ మీసాల్లో ఓ ప్రత్యేకత....నిజం చెప్పొద్దూ....మీ మీసాల్లో నాకు రక్షణ కన్పడింది...."

కిల్లర్ తెల్లబోయి అతడి వంక చూశాడు.

అతడు దృఢంగా వున్నాడు. ఎత్తుగా వున్నాడు.

"మీరు నాకంటే బలంగా వున్నారు-" అన్నాడు కిల్లర్.

"బలం మనిషికి బలాన్నివ్వదు—" అన్నాడు విల్సన్.

"అంటే?"

"ఒక వ్యక్తి నన్ను చంపుతానని బెదిరిస్తున్నాడు. అతణ్ని నేను తప్పించుకుని తిరుగుతున్నాను. కానీ యెన్నాళ్ళో తప్పించుకోలేను...."

"ఎవరతడు? మిమ్మల్నెందుకు బెదిరిస్తున్నాడు?"

అన్నాడు కిల్లర్.

"నేను నారాయణా ఇంజనీరింగ్ వర్క్స్‌లో పని చేస్తున్నాను. మా కంపెనీ పెట్రోలింజన్ని డీసెలింజనుగా మార్చడానికో కొత్త డిజైన్ రూపొందించింది. అది చాలా రహస్యం. ఆ రహస్యం సంపాదించి తనకివ్వమని ఓ వ్యక్తి నా వెంటబడ్డాడు. సంపాదిస్తే డబ్బిస్తాట— యాభై వేలు. లేకుంటే ప్రాణం తీస్తాట! అది నావల్ల కాదంటే నమ్మడు....అతడికి భయపడి నేను తాత్కాలికంగా నా మకాం కూడా మార్చేశాను...."

"ఇందుకు నేనేం చేయాలి?"

"మీరతణ్ని పట్టుకొని పోలీసులకప్పగించాలి...."

"ఆ పని మీరే చేయొచ్చుగా!"

"నాకా దమ్ముల్లేవు...."

"నాకున్నాయని యెలాగనుకున్నారు?"

"మీ మీసాలు చూడగానే నాకలాగనిపించింది. నా అంచనా తప్పకూడదు...."

"ఇందులో నాకేమైనా ప్రయోజనముంటుందా?"

"నేను మీకు రెండు వేల రూపాయలిచ్చుకుంటాను.."

అన్నాడు విల్సన్.

"సరే—ఇప్పుడేం చేయాలి?"

"ఇద్దరం మా యింటికి వెడదాం—అది నా అసలిల్లు కాదు ప్రస్తుతం నేను రహస్యంగా వుంటున్న యిల్లు. అక్కడే నా భార్య కూడా వుంది. ఇద్దరంకలిసి అక్కడ కాసేపు చర్చించుదాం. మీరెలా చెబితే అలా చేస్తాను నేను...."

అంతా విచిత్రంగా అనిపించింది కిల్లర్‌కి.

"అతడినెలా కలుస్తాం?" అన్నాడతడు.

"అతడంటే—నన్ను బెదిరించే వ్యక్తేనా—? వాడు నన్నీరోజు పార్కులో కలుసుకుంటానన్నాడు. ఈ రోజు మనమిద్దరం కలిసి వెడదాం.... వాడు మీ మీసాలు చూడగానే కథ కొత్త మలుపు తిరుగుతుంది" అన్నాడు విల్సన్.

"మీ నమ్మకమంతా నా మీసాలమీదే ఉన్నట్లుంది ..."

"అవును...." అని—"ఇదే ప్రస్తుతం నా ఇల్లు—" అన్నాడతడు.

కిల్లర్ ఆగాడు.

ఆ వీధిలో యిళ్ళన్నీ విసిరేసినట్లున్నాయి.

అలాంటి వాటిలోని బంగళా వెంకింటి ముందు తామిద్దరూ నిలబడి వున్నారు.

వీధిలో జనం లేరు.

ఇంటిముందు మెట్లున్నాయి.

"రండి!" అంటూ మెట్లెక్కాడు విల్సన్.

కిల్లర్ అతడి ననుసరించాడు.

విల్సన్ గుమ్మం ముందాగి కాలింగ్ బెల్ ప్రెస్ చేశాడు.

రెండు నిముషాల్లో తలుపు తెరుచుకుంది. సుమారు ముప్పైఅయిదేళ్ళ యువతి వుంది గుమ్మానికవతల.

ఆమె ముఖంలో ఆశ్చర్యముంది.

"మీరు రేపు వస్తారనుకున్నాను—" అందామె.

విల్సన్ నవ్వాడు.

ఆమె తప్పుకుని ఇద్దరికీ దారిచ్చింది.

విల్సన్ కిల్లర్‌ని ముందు వెళ్ళనిచ్చి తను తలుపు వేశాడు.

"మనం ఆ గదిలో మాట్లాడుకుందాం!" అన్నాడతడు

కిల్లర్‌తో.

కిల్లర్ అతను సూచించిన విధంగా పక్కగదిలోకి వెళ్ళాడు.

గదితలుపులు బార్లా తెరిచి వున్నాయి. గదిలో సోఫాసెట్టుంది.

కిల్లర్‌కి గదిలో మరింకే విశేషమూ కనబడలేదు.

అతడు సోఫావరకూ వెళ్ళి వెనక్కి తిరిగాడు.

గది తలుపులు బార్లా తెరిచి వున్న విషయం తెలుస్తోంది కానీ అతడికి గది బయట ఏం జరుగుతున్నదీ కనపడడంలేదు.

విల్సన్ ఇంకా గదిలోకి రాలేదు.

బహుశా భార్యతో మాట్లాడుతున్నాడేమో!

కిల్లర్ ఆలోచిస్తుండగానే కెవ్వుమన్న గొంతు వినబడింది.

అది ఆర్తనాదం ....

ప్రాణభయంతో సర్వశక్తులూ క్రోడీకరించుకున్న మనిషి గొంతునుండి వెలువడిన నాదమది!

ఆ గొంతు స్త్రీది!

కిల్లర్ పరుగున గుమ్మం దగ్గరకు వెళ్ళాడు.

అతను గుమ్మం దాటేలోగా పైనుంచి యేదో చప్పుడయింది.

కిల్లర్ తెల్లబోయాడు.

గుమ్మానికి అడ్డంగా కటకటాలు!

అంటే ఈ యిల్లు సామాన్యమైనది కాదు....

బోనులో చిక్కిన పులిలా కిల్లర్ గుమ్మం దగ్గర ఆగిపోయాడు.

గుమ్మం అవతల ఏం జరుగుతున్నదీ అతడు చూస్తు

న్నాడు.

విల్సన్ భార్య గోడకానుకుని వుంది. విల్సన్ ఆమెకు సమీపంలో వున్నాడు. ఒక చేత్తో అతడామె కోటిని గట్టిగా మూశాడు. అతడి రెండో చేతిలో కత్తి వుంది.

ఆమె గిలగిల తన్నుకుంటోంది.

"ఏయ్ విల్సన్! ఏమిటిది?" అరిచాడు కిల్లర్.

విల్సన్ కిల్లర్ మాటలు పట్టించుకోలేదు భార్యను క్రూరంగా చూస్తున్నాడతను. "ఈ వయసులో నీకు వళ్ళు కొవ్వెక్కింది. నీ ప్రవర్తనను నేను క్షమించను. నన్నెవ్వరూ అనుమానించలేని విధంగా యేర్పాట్లు చేసుకున్నాను. చావు...."

మరుక్షణంలో కత్తి ఆమె గుండెల్లో దిగబడింది.

చివ్వున చిమ్మింది రక్తం.

జరిగిందానికి కిల్లర్ ప్రాన్పడిపోయాడు.

ఎంత సాహసికైనా వళ్ళు జలదరించే దృశ్యమది!

హత్య....కోల్డు బ్లడెడ్ మర్డర్!

విల్సన్ ఒక్క నిమిషం ఆమెనలాగే పొదివిపట్టుకున్నాడు తర్వాత వదలి పెట్టాడు. ఆమె నేలమీదకు జారిపోయింది.

కొద్ది క్షణాల్లో జీవమున్న మనిషి శవంగా మారిపోయింది.

అప్పుడు విల్సన్ కిల్లర్ వంక తిరిగాడు.

కిల్లర్ యేదో అనాలనుకున్నాడు. కానీ అతడికి స్పృహాతప్పుతోంది.

ఏం జరుగుతోందో కిల్లర్ కి అర్ధంకావాలేదు. ముక్కుకి వాసనేమీ తెలియడంలేదు. కానీ కళ్ళు మూతలు పడిపోతున్నాయి.

కిల్లర్ కటకటాలు పట్టుకొని తన్ను తానదుపు చేసు కుందుకు ప్రయత్నిస్తూ కిందకు జారిపోతున్నాడు.

ఎవరో తలుపులు దబదబ బాదుతున్న చప్పుడతడికి వినిపించింది.

ఆ తర్వాతింకేమీ తెలియదు.

## 2

ఓ గంటలో మెలకువ వచ్చింది కిల్లర్ కి.

కళ్ళు నులుముకొని చూసుకున్నాడతడు.

ఎవరో తలుపులు దబదబ బాదుతున్నారు. అందుకే అతడికి మెలకువ వచ్చింది.

కిల్లర్ కంతా మసకమసకగా వుంది.

మెదడింకా సరిగా పని చేయడం లేదు.

చప్పుడు వింటున్నా లేవాలనిపించడం లేదు.

అతడు చూస్తూండగా తలుపులు బద్దలై ముందుకు పడ్డాయి.

కిల్లర్ కి మత్తు విడిపోయింది.

చటుక్కున లేచి నిలబడ్డాడతడు.

ఈలోగా ఇద్దరు పోలీసులు కిల్లర్ని సమీపించారు.

"ఏం జరిగింది?" అన్నాడు కిల్లర్.

అప్పటికి మరికొందరు పోలీసులు, జనం లోపలికి వచ్చారు.

"ఆగండి—లోపలకు రాకండి — ఇక్కడ హత్య జరిగింది...." అంటూ అరిచాడు ఇన్ స్పెక్టర్.

హత్య అన్నమాటతో కిల్లర్ కి చాలా విషయాలు గుర్తుకొచ్చాయి.

హత్య తన కళ్ళముందే జరిగింది.

ఇన్ స్పెక్టర్ కిల్లర్ని సమీపించి - "యూ అరండర

రస్ట్-" అన్నాడు.

కిల్లర్ కంతా అయోమయంగా వుంది.

"అవును—గదిలో హత్య జరిగింది. నేను హంతకుణ్ణి కళ్ళారా చూశాను—" అన్నాడు.

"అవును— నేనూ చూశాను—" అన్నాడు ఇన్ స్పెక్టర్ నవ్వి.

"అదెలా సాధ్యం—హత్య జరిగినప్పుడు మీ రిక్కడ లేరే?" అన్నాడు కిల్లర్.

"హత్య చేసి నువ్వింకా ఇక్కడే వుండిపోయావుగా" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"నేను హత్య చేయడమా?" అన్నాడు కిల్లర్.

"ప్రశ్నలు తర్వాత.... నాతో పద...." అన్నాడు ఇన్ స్పెక్టర్.

"మీతో వస్తాను, కానీ నేరస్థుడిగా కాదు...." అన్నాడు కిల్లర్.

"గదిలో శవముంది. శవం గుండెల్లో కత్తి వుంది. రక్తం గదినిండా చిమ్మింది. ఆ చిమ్మిన రక్తం నీ బట్టల మీద కూడా వుంది. శవం పక్కనే నువ్వు వున్నావు.... నువ్వు నేరస్థుడివి కాదు, అవునా?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

కిల్లర్ తెల్లబోయి తన్ను తాను చూసుకున్నాడు.

తన చొక్కానిండా రక్తం....

అంతేకాదు....ఆ చొక్కా తనది కాదు....

చొక్కాయేకాదు ...పాంటుకూడా తనదికాదు.

"మోసం!" అనుకున్నాడతడు.

విల్సన్ చాలా తెలివిగా తన్ని హత్యకేసులో ఇరికించాడు.

బహుశా కత్తి మీద వేలిముద్రలుకూడా తనవే అయుంటాయి.

తను స్పృహ తప్పివున్న సమయంలో అతడు తన నెత్తురంటిన బట్టలు కదిపి వుంటాడు.

"ఏమంటావు మిస్టర్!' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కిల్లర్ తలవంచుకున్నాడు.

ఈలోగా ఫోటోగ్రాఫరతణ్ని సమీపించి నాలుగు యాంగిల్స్‌లో ఫోటోలు తీసుకున్నాడు.

జనం కొందరు గది గుమ్మం దగ్గర నిలబడి వున్నారు. వాళ్ళంతా కిల్లర్ వంక కుతూహలంగా చూస్తున్నారు!

అంతమంది తనను హంతకుడన్న దృష్టితో చూస్తున్నారన్న భావం కిల్లర్ని కించపరిచింది.

కానీ మనిషి పరిస్థితులకు బానిస.

"ఇన్‌స్పెక్టర్! నిజంగా నేనీ హత్య చేయలేదు. మీరు నమ్మినా నమ్మకపోయినా నేను చెప్పవలసిన కథ ఒకటి వుంది—" అన్నాడు కిల్లర్.

"చెప్పు—" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కిల్లర్ చెప్పాడు.

"అచ్ఛా—" అన్నాడు ఇన్‌స్పెక్టర్. "అంటే ఈ యింట్లో యెన్నో మాయాజాలాలున్నాయంటావు...."

"అవును...."

ఇన్‌స్పెక్టర్ అక్కడున్న జనాన్ని ప్రశ్నలు వేశాడు.

"ఆ యింట్లో రెండు సంవత్సరాలుగా వుంటున్నది హతురాలు. ఆమె క్రిస్టియన్ కాదు. పేరు సుజాత. మనిషి యెంతో మంచిది. చేతనైనంతలో పదిమందికీ సాయపడుతుంది. వీధిలో చాలామందికామె అవసరానికి డబ్బిచ్చి ఆదుకుంది.

వినిరేసినట్లున్నాయి ఇళ్ళన్నీ ఆ వీధిలో. ఒకింట్లో జరిగే విషయమింకో యింట్లో తెలియదు.

సుజాత ఒంటరి ఆడది—అయినప్పటికీ—ఆమెనా వీధి వారందరూ గౌరవభావంతోనే చూసేవారు. అందగత్తె అయినప్పటికీ ఆమె అందం యెవరి చర్చల్లోకీ వచ్చేది కాదు.

వీధిలో నడుస్తున్న ఓ వ్యక్తి కాయింట్లోంచి ఆర్తనాదం వినబడి కంగారుపడి వెళ్ళి తలుపుతట్టాడు.

ఎవరూ తలుపులు తీయలేదు.

అతడు కాసేపు తలుపులు బాదాడు.

లోపల నిశ్శబ్దం!

అప్పుడతడు ఇరుగుపొరుగులను పిలిచాడు. అంతా వచ్చి తలుపులు బాదారు. లోపల నిశ్శబ్దం!

తను ఆర్తనాదం విన్నానని అతడు మరీ మరీ చెబుతున్నాడు.

అతడు భ్రమపడ్డాడని ఇరుగుపొరుగుల అనుమానం.

అయితే లోపలున్నవారు తలుపులెందుకు తీయరు?

లోపలేదైనా అఘాయిత్యం జరిగితే మనిషి బయటకు పోవడానికి వేరే మార్గంలేదు.

అందుకని జనమంతా ఇంటిముందు కాపలా వుండి పోలీసులకు కబురుపెట్టారు. పోలీసులు వచ్చి తలుపులు బాది—తర్వాత తలుపులు బద్దలు కొట్టారు.

గదిలో శవం....శవం పక్కన కిల్లర్!

"నువ్వు గదిలో దేనికోసమో వెతుకుతున్నావు. జనం కాసేపు తలుపులు బాది ఊరుకోగానే—వెళ్ళిపోయారనుకొని చాలా ధైర్యంగా వున్నావు. పోలీసులు తలుపులు బద్దలుకొట్టుకొని లోపలకు వస్తారని ఊహించి

వుండవు. నీ ధైర్యం పోలీసు డిపార్టుమెంట్లో రాణించేది. అభినందించబడేది. తమ తమ విలువలు తప్పిన తమ మిత్రులు శత్రులౌట తథ్యము.." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నా నిర్దోషిత్వాన్ని నేను ఋజువు చేసుకుంటాను.." అన్నాడు కిల్లర్.

"ఎలా?"

"కాసేపు నన్ను వదిలిపెట్టండి...."

"నో జోక్స్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అయాం సీరియస్...." అన్నాడు కిల్లర్.

ఇన్‌స్పెక్టర్ నవ్వి—"సీరియస్‌గా జైల్లో కూర్చుందువు గాని...." అన్నాడు.

ఈలోగా అక్కడ పరీక్షలు-వగైరాలు ముగించుకుని పోలీసు పరివారం ఇన్‌స్పెక్టర్ని చుట్టుముట్టారు.

"పద—మిస్టర్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నా పేరు కిల్లర్!" అన్నాడు కిల్లర్.

"ఆఫ్‌కోర్స్—యూఆరే కిల్లర్!" అని ఇన్‌స్పెక్టర్ కిల్లర్ చేయి పుచ్చుకున్నాడు.

అప్పుడు కిల్లర్ ఇన్‌స్పెక్టర్ని ఒక్కతోపు తోశాడు. అతడి చుట్టూ పరివారాన్ని ఒక్కసారి విదిలించాడు. ఒకేఒక్క గెంతులో గమ్యం చేరాడు.

అక్కడున్న జనం అప్రయత్నంగా పక్కకు తప్పుకుని అతడికి దారి నిచ్చారు.

కిల్లర్ రోడ్డుమీదకు వచ్చాడు.

పోలీసు జీపు సిద్ధంగా వుంది.

ఇన్‌స్పెక్టరు, పరివారం రోడ్డుమీదకు వచ్చేసరికి జీపు స్టార్టయింది.

ఇన్‌స్పెక్టరు జాప్యం చేయలేదు. క్షణాలమీద పరి

వారానికి ఆర్డరిచ్చాడు.

వీధిలో సిద్ధంగా వున్న రెండు మోటారుసైకిళ్ళమీద అతడు, సబ్ ఇన్ స్పెక్టరు బయల్దేరారు.

అసలా మోటారుసైకిళ్ళెవరివీ, యే కండిషన్ లో ఉన్నాయో అని కూడా వారాలోచించలేదు.

ఇతర పరివారంలో కొందరు టెలిఫోన్ చేయాలనీ, కొందరు దగ్గర్లో వున్న పోలీసుస్టేషన్ కి అలా బయల్దేరారు.

కొందరు శవం దగ్గర కాపలాగా వుండిపోయారు.

అక్కడ చేరిన జనం మాత్రం జరిగిందేమిటో అర్థం కాక — ఆశ్చర్యంగా అలా చూస్తూ నిలబడిపోయారు.

## 3

జీపులో కిల్లర్.....

జీపు వెనుక మోటార్ సైకిల్సు....

ఇలాంటి పరిస్థితి యెదురౌతుందని కిల్లర్ అనుకోలేదు.

ఎప్పుడూ పోలీసులకు సాయపడే తానీరోజు వాళ్ళకు భయపడి పారిపోతున్నాడు.

తాను చిక్కుకున్న మాయాజాలమేమిటో అతడికి తెలియదు. దాన్నుంచి యెలా తప్పించుకోవాలో అతడికి తెలియదు.

ముందుగా తాను స్వతంత్రుడు కావాలి.

అదే అతడి ఆలోచన....

జీపు శరవేగంతో దూసుకుపోతోంది.

కిల్లర్ కా వీధులట్టే తెలియవు.

కనబడిన సందుల్లోకి జీపుని తిప్పేస్తున్నాడు.

మోటారుసైకిళ్ళతన్ననుసరించి వస్తూనే వున్నాయి.

ఆ విధంగా కిల్లర్ ఓ సందులోకి మలుపు తిప్పాడు.

మోటారు సైకిళ్ళు మలుపు తిరగడానికి కొద్ది క్షణాల వ్యవధి వుంది.

కిల్లర్ డ్రైవింగ్ సీటులోంచి రబ్బరు బంతిలా పక్కకు దూకాడు.

పక్కన చిన్న యిల్లుంది. ఇంటి తలుపులు దగ్గరగా వేసి వున్నాయి.

ఒక్క క్షణంలో కిల్లర్ తలుపు తీసుకుని ఆ యింట్లో ప్రవేశించాడు.

లోపల అతనికెవ్వరూ కనబడలేదు.

కిల్లర్ తలుపులు దగ్గరగా వేసి సందులోంచి బయటకు చూశాడు.

రెండు మోటారు సైకిళ్ళు వీధిలోంచి దూసుకుని పోయాయి.

కిల్లర్ తృప్తిగా నిట్టూర్చి తలుపుకు గడియ వేశాడు.
ఏం జరుగుతుందో అతడికి తెలుసు.

డ్రైవరు లేకుండానే జీపు తిన్నగా పోతోంది.

వీధి చాలా పొడుగైనది.

వీధి చివర జీపు గోడను గుద్దుకుంటుంది.

అప్పుడు పోలీసులకసలు విషయం తెలుస్తుంది

ఏం జరిగిందీ అని ఆలోచిస్తారు — ఏం జరిగిందో స్ఫురించకపోగా.

తాము వెన్నాడగా జీపులోంచి ఎవరూ బయటకు దూకలేదు

ఏ యింటించి జీపు తమ దృష్టిలో వున్నదీ వారంచనా వేస్తారు.

సోదా ప్రారంభిస్తారు.

ఈలోగా....

"ఎవరు నువ్వు?" అన్నదో గొంతు.

కిల్లర్ వెనక్కు తిరిగాడు.

అందమైన యువతి. మనిషి పొడుగ్గా వుంది.

అప్పుడే స్నానం చేసి వస్తోందేమో — వంటికి టర్కిష్ టవలు చుట్టుకుని వుంది.

కనబడుతున్న వంటిమీద నీటిబిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయి.

ఆమె పొడవైన మనిషి కావడంవల్ల — తువ్వాలు శరీరంలో చాలా తక్కువ భాగాన్ని మాత్రమే దాచగలిగింది.

అంగుళల్ల ఆమె చాలా ఆకర్షణీయంగా వుంది.

"ఇంటి తలుపులు వేసుకోకుండా స్నానానికి వెళ్ళావు. నీ గురించి తెలుసుకోవాలని వచ్చాను—" అన్నాడు కిల్లర్.

ఆమె ముఖం అదోలాగై పోయింది.

"ఇక్కడ మావారు కూర్చుని వుండాలి...." అందామె.

"మీవారా?" అన్నాడతడు — "నేను వచ్చేసరికి యెవరూ లేరు...."

ఆమె ముఖంలో భయం కనబడింది — "ఎందుకో బయటకు వెళ్ళి వుంటారు. ఇప్పుడు నన్నూ నిన్నూ ఇలా చూస్తే పెద్ద గొడవవుతుంది—" అందామె.

కిల్లర్ యేదో అనేలోగా యెవరో తలుపు తట్టారు.

కిల్లర్ ఆ యువతిని సమీపించి — "నావల్ల నీకేమీ ప్రమాదముండదు. నన్ను పోలీసులు తరుముతున్నారు. లోపల నేను దాక్కుంటాను. వచ్చింది పోలీసులే

ఆయూటారు. నా గురించి వాళ్ళడుగుతారు. ఏమీ తెలియదని చెప్పు అప్పుడు నేను నీ భర్తను తెలియకుండా ఈ యిల్లొంచి వెళ్ళిపోతాను.... లేదా...." అని అర్థోక్తిలో ఆగి ఆమె బదులుకోసం యెదురుచూడకుండా లోపలకు వెళ్ళాడు.

తలుపు మళ్ళీ యెవరో తట్టారు.

"ఎవరూ?" అందామె.

"నేను—రమా!" అన్నదతని గొంతు.

"మీతో ఇంకెవరైనా వున్నారా?"

"లేరు...."

రమ చప్పుడు కాకుండా గడియతీసి, బాగా వెనక్కి వెళ్ళి—"తలుపు తీశాను...." అంది గట్టిగా.

బయట్నించి ఓ పాడుగాటి వ్యక్తి లోపలకు వచ్చాడు. ఏదో అనబోయి రమను చూసి ఆగిపోయాడు.

"అలా చూడకండి. ముందు వీధి తలుపులు వేయండి" అంది రమ.

అతడు ప్రయత్నంగా తలుపులు వేశాడు — "చాలా బాగున్నావు—" అన్నాడు.

"మీరు చేసిన పనేమీ బాగోలేదు...." అంది రమ.

"సారీ రమా! అనుకోకుండా సందులోకి వెళ్ళాను" అన్నాడతడు.

"ఎందుకు?" అందామె.

"నీకు తెలుసు!" అన్నాడతడు.

రెండ్రోజుల క్రితం రెండవ ఆట సినిమాకు వెళ్ళి భార్యాభర్తలిద్దరూ తిరిగివస్తూండగా రమకు దొరికింది ఒక గాజు.

అది బంగారపు గాజు. కనీసం రెండు కాసుల బరు

వుంటుంది.

ఆ గాజెవరిదో కూడా రమ వెంటనే గుర్తుపట్టింది.

ఆ వీధిలోనే వుండే కామాక్షమ్మ దా గాజా.

కామాక్షమ్మకు వంటినిండా బంగారం. వీధిలో చాలా మంది ఆమెను చూసి అసూయపడుతూంటారు. వారిలో రమ కూడా ఒకతె!

"కామాక్షమ్మ కట్టిది. గాజెలా పారేసుకుందో!" అంది రమ.

"పారేసుకుని వుండదు. దొంగలు పడివుంటారు. బహుశా ఇది దొంగాడు పారేసుకుని వుంటాడు—" అన్నాడు రమ భర్త.

అది నిజమేనని మర్నాడు తెలిసింది.

దొంగలు కామాక్షమ్మింట్లో ప్రవేశించి—అందరికీ మత్తుమందుతో స్పృహ పోగొట్టి నిలువు దోపిడీ చేసి పోయారు.

ముందు రమ గాజును వెనక్కిచ్చేయాలనుకుంది. కానీ అందువల్ల లేనిపోని యిబ్బందులొస్తాయని భర్త భయపడ్డాడు. ఆ గాజును వారు తాత్కాలికంగా ఇంటి పక్క సందులో దాచారు—ఒక రాత్రిపూట.

ఆ సందులోకి జనం వెళ్ళడం అరుదు. అయినా రమ భర్త అప్పుడప్పుడా గాజును చూసుకుని వస్తూంటాడు. ఇంట్లో దాచాలంటే భయం.

భార్య స్నానానికి వెళ్ళినప్పుడతడు గాజు చూడ్డానికి వెళ్ళాడు.

"దీనికైనా సమయమనుంటుంది. నేనేమో బాత్రూంలో వున్నాను. అలాంటి సమయంలో ఇట్లో యెవరైనా చొరబడితే—...." అంది రమ.

"నా యింట్లో నేను లేకుండా యెవరూ చొరబడరు. నిన్ను మాత్రం ఇలా చూస్తుంటే చాలా బాగున్నావు" అంటూ భర్త రమను సమీపించాడు.

భర్త చొరవతీసుకుంటాడని రమ ఊహించింది. అయితే ఇట్లో వేరే మనిషి వున్న విషయం భర్తకు తెలియదు. చెప్పలేను.

"నేను పక్క గదిలోకి వెడతాను. నా బట్టలు తెచ్చి పెట్టండి—" అందామె.

"ఏం బెడ్రూంకి వెళ్ళి కట్టుకోవచ్చుగా–" అన్నాడు భర్త.

బెడ్రూంలోనే కిల్లర్ వున్నాడు. రమ ఏం చెప్పాలో ఆలోచిస్తూండగా యెవరో వీధి తలుపు తట్టారు.

రమ చటుక్కున బెడ్రూంలోకి వెళ్ళింది.

అక్కడ ఆమెకు కిల్లర్ కనబడలేదు.

ఏ బీరువా వెనకో, మంచంకిందో—ఆ గదిలోనే ఉండివుంటాడు కిల్లర్.

అందుకే రమ బట్టలు మార్చుకోలేదు. టర్కిష్ టవల్‌ను వంటిచుట్టూ మరింత గట్టిగా బిగించుకుంది.

ఆమె అలా నిలబడి వుండగానే యెంత వారిస్తున్నా వినిపించుకోకుండా—ఇన్‌స్పెక్టరూ, సబ్‌ఇన్‌స్పెక్టరూ లోపలకు వచ్చారు.

రమను తువ్వాలు ధరించి వుండగా చూసి తెల్లబోయి "సారీ!" అన్నారిద్దరూ యేక కంఠంతో.

ఆ తర్వాత పోలీసులిద్దరూ ఇల్లు వెదకకుండానే వెళ్ళిపోయారు.

పోలీసులు వెళ్ళగానే రమ భర్త లోపలకు వచ్చి—
"ఎప్పటికీ బట్టలు మార్చుకోవేం? వళ్ళు కావరంగా

వుందా?" అన్నాడు.

రమ మాట్లాడకుండా స్టాండుమీద బట్టలు తీసుకుని పక్క గదిలోకి వెళ్ళింది.

"ఏమయింది నీకీ రోజు?" అంటూ భర్తామె ననుస రించాడు.

"నాకు మరీ దగ్గరగా రాకండి. రాకుండా వుండ లేకనుకుంటే స్నానం చేసి రండి—" అంది రమ.

అతను వెంటనే స్నానానికి వెళ్ళాడు.

తప్పించుకు నేందుకు కిల్లర్ కాసమయం చాలు.

అతడికా సమయమివ్వాలనే రమకూడా అనుకుంది.

కిల్లర్ తన బట్టలు విప్పి మంచం కిందకు తోశాడు.

స్టాండుమీద రమ భర్త లుంగీ ఒకటి వేసుకున్నాడు. పైన లాల్చీ ధరించి ఇల్లొంచి బయటకు వెళ్ళిపోయాడు.

ముందుగా అతడు మొబైల్ వ్యాన్ దగ్గరకు వెళ్ళాడు. లోపల పూర్తిగా వేషం మార్చుకుని-బట్టలు మార్చుకుని బయటకు వచ్చాడు.

పోలీసులవద్ద తన ఫోటో వుంది. ఆ ఫోటోకి ప్రచారం లభిస్తే తన మొబైల్ వ్యాన్ మీద అందరి దృష్టి పడుతుంది.

ఈలోగా తను దారి వెతుక్కోవాలి.

కిల్లర్ మొబైల్ వ్యాన్‌లో రామేశ్వరమూర్తి ఇంటికి వెళ్ళాడు.

రామేశ్వరమూర్తి కిల్లర్ వలన ప్రయోజనం పొందిన భాగ్యవంతుడు.

ఆయన కిల్లర్ ద్వారా జరిగిందంతా విన్నాడు.

"మీ వ్యాన్ — నా గ్యారేజీలో రహస్యంగా దాచ బడుతుంది. మీరు విశ్రాంతిగా వుండండి—" అన్నాడు

రామేశ్వరమూర్తి.

కిల్లర్ నిట్టూర్చి ఆయనదగ్గర శలవు తీసుకున్నాడు.

## 4

విశాల ప్రపంచంలో యేకాకిగా తిరుగుతున్నట్లుంది కిల్లర్ కి.

ఇలాంటి పరిస్థితి అతడికెప్పుడూ ఏర్పడలేదు.

చట్టం దృష్టిలో తాను హంతకుడు.

హంతురాలు సుజాత.

ఆమె యెవరో అతడికి తెలియదు.

తానిపుడు విల్సన్ ని పట్టుకొని సాధించాలి.

విల్సన్ యెవరో ఎక్కడుంటాడో అతడికి తెలియదు.

ఎలా వుంటాడో మాత్రం తెలుసు.

విల్సన్ గురించి తెలుసుకోవాలంటే సుజాత గురించి మరిన్ని వివరాలు తెలుసుకోవాలి. అందుకు తన మారు వేషం బాగా సహకరిస్తుంది.

ఎందుకైనా మంచిదని ఆ రోజు అతడు సుజాత వుండే వీధికి వెళ్ళలేదు.

మర్నాడు మధ్యాహ్నం మండుటెండలో అతడా వీధిలోకి వెళ్ళాడు.

మళ్ళీ ఆ వీధి నిర్మానుష్యంగానే వుంది.

ఎవరింటికి వెళ్ళాలా అని ఆలోచిస్తూ కిల్లర్ నడుస్తూండగా సుజాత ఇంటిముందు మాటలు వినిపించాయి.

చటుక్కున పక్కకు తిరిగాడతడు.

సుజాత ఇంటికి తాళం వేసివుంది. గుమ్మం దగ్గర కూర్చుని వున్నాడు సెంట్రీ.

ఒక వ్యక్తి సెంట్రీని సుజాత గురించి అడుగుతున్నాడు.

సెంట్రీ అతడికి ఆమె హత్య గురించి చెప్పి—

"మీకామెతో ఏమిపని?" అన్నాడు.

అతడు జేబులోంచి పాతిక రూపాయలు తీసి—"ఇవి నేనామెకు బాకీ వున్నాను. మంచి అవసరంలో ఈ డబ్బిచ్చి నన్నాదుకుందామె. పుణ్యాత్మురాలు. ఇలా యెంతో మందిని ఆదుకుంది. డబ్బు తిరిగివ్వాలని వచ్చాను. ఈ డబ్బు ఆమె పేరు చెప్పి నువ్వే వుంచుకో....ఆమె ఆత్మకు శాంతి కలుగుతుంది—" అని వెనక్కు తిరిగా డతడు.

అతడెవరో సుజాతకు బంధువయుండాలి. ఆమె హత్య గురించి ఆ బంధువుకి తెలిసి వుండదు. రాగానే సెంట్రీ ద్వారా విషయం తెలుసుకున్నాడు. హత్య కేసులో సాక్షిగా ఇరుక్కోవాలని భయపడ్డాడు. ఏదో వంకన సెంట్రీకి పాతిక రూపాయలిచ్చి తప్పించుకోవాలను కుంటున్నాడు. పాతిక రూపాయలు సెంట్రీకి తక్కువ మొత్తంకాదు.

తనా వ్యక్తి ననుసరించాలనుకున్నాడు కిల్లర్.

అయితే వెనక్కు తిరిగిన ఆ వ్యక్తిని చూసి తెల్లబోయా డతడు.

అతడు విల్సన్!

విల్సన్ సుజాతను హత్యచేశాడు. మళ్ళీ యెందు కొచ్చాడు?

ఇంటికి పోలీసు కాపలా వుంటుందని అతడూహించ లేదా?

కిల్లర్ తను కూడా సుజాత ఇంటివైపు నడిచి సెంట్రీని పలకరించి — "రామాలయం వీధి అంటే ఇదేనా?" అనడిగాడు.

"ఊరికి కొత్తలాగున్నావు. రామాలయం వీధి ఊరికి

ఆ చివరుంది. నువ్వీ చివర్లో వున్నావు—" అని నవ్వాడు మెంట్రీ.

కిల్లర్ కంగారుపడ్డవాడిలా వెనక్కి తిరిగాడు.

ఆ తర్వాతనుంచి విల్సన్‌ని అనుసరించసాగాడు.

విల్సన్ వెనక్కి తిరక్కుండా ముందుకు వెళ్ళిపోతున్నాడు.

కిల్లర్ మెదడులో రకరకాల ఆలోచనలు....

విల్సన్ తన్ను చూశాడా? గుర్తుపట్టాడా?

అసలతడు మళ్ళీ సుజాతింటికెందుకు వచ్చాడు?

కిల్లర్ ఆలోచనల్లో ప్రశ్నలేకాని జవాబులు లేవు.

విల్సన్ కాలినడకనే ముందుకు చూసుకొని వెళ్ళిపోతున్నాడు.

అలా యిద్దరూ చాలాదూరం వెళ్ళారు.

మందు కొట్టిన కిల్లర్ని రోజా బాధించడంలేదు.

అతడి ఆలోచనలనిండా విల్సన్....

కిల్లర్ చూస్తూండగా విల్సన్ ఓ హోటల్లోకి దూరాడు.

కిల్లర్ కూడా ఆ హోటల్లోకి వెళ్ళాడు.

విల్సన్ ఓ సీట్లో కూర్చున్నాడు.

కిల్లర్ తనకు విల్సన్ కనబడేలా ఓ సీట్లో కూర్చున్నాడు.

సర్వర్ విల్సన్ దగ్గరకు వెళ్ళాడు.

కిల్లర్ జరుగుతున్నది చూస్తున్నాడు.

ఏదో రహస్యం వింటున్నవాడిలా సర్వర్ విల్సన్ వైపు వంగాడు.

విల్సన్ అతడి చెవిలో యేదో చెప్పాడు.

సర్వర్ తలాడించి లోపలకు వెళ్ళిపోయాడు.

కిల్లర్‌కి చాలా ఆశ్చర్యమయింది.

విల్సన్ సర్వర్ చెవిలో ఏం చెప్పాడు?

అతడు తన్ను గమనించాడా? లేక సర్వర్ అతడికి తెలుసా?

ఎందుకో అంతవరకూ తనను విల్సన్ గమనించి వుండడం లేకే కిల్లర్‌కి నమ్మకం కుదరడం లేదు.

"ఏం కావాలి సార్!" అన్న గొంతు వినబడి ఈ లోకానికి వచ్చాడు కిల్లర్.

ఎదురుగా సర్వర్!

సర్వర్ చేతిలో ట్రే వుంది. ట్రేలో మంచినీళ్ళ గ్లాసులు మొత్తం మూడున్నాయి.

సర్వర్ మూడు గ్లాసులూ టేబిల్ మీద పెట్టాడు.

అప్పుడు చూశాడు కిల్లర్.

అతడి కెదురుగా మరో ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు.

వాళ్ళతడివంకే పరీక్షగా చూస్తున్నారు.

వాళ్ళ చూపులు కిల్లర్‌కి మామూలుగా అనిపించలేదు. అయినప్పటికీ చూపులు కలవడంవల్ల పలకరింపుగా నవ్వాడు.

వాళ్ళిద్దరూ ఇబ్బందిగా నవ్వి చూపులు మరల్చుకున్నారు.

"ఏం కావాలి సార్?" సర్వర్ మళ్ళీ అడిగాడు.

"మసాలాదోశ!"

వాళ్ళిద్దరూ కూడా సర్వర్‌కి మసాలాదోశలే ఆర్డరిచ్చారు.

తన మాటలే ప్రతిధ్వనించినట్లు ఫీలయ్యాడు కిల్లర్.

కానీ వాళ్ళిద్దరూ ఇప్పుడతడివంక చూడ్డం లేదు.

కిల్లర్‌కి దాహంగా వుంది.

మండు టెండలో నడిచి వచ్చాడు.

ఓరకంట విల్సన్‌ని గమనిస్తూనే అతడు మంచినీళ్ళ గ్లాసందుకున్నాడు. ఒక గుక్కెడు నీళ్ళు తాగాడు. గొంతులో హాయిగా అనిపించింది.

వేసవిలో చల్లని నీరు అమృతప్రాయం.

గ్లాసుడు నీళ్ళూ తాగేశాడు కిల్లర్.

అతడి యెదుట కూర్చున్నవారిద్దరూ మళ్ళీ కిల్లర్ని శ్రద్ధగా గమనించసాగారు.

కిల్లర్ కుర్చీలో వెనక్కి జారగిలబడ్డాడు. ఓరకంట విల్సన్ని గమనిస్తూ కళ్ళు మూసుకున్నాడు.

కొద్ది క్షణాల్లో అతడి తల పక్కకు వాలిపోయింది.

అప్పుడతడి ముందున్న వ్యక్తు లిద్దరూ లేచి నిల బడ్డారు. కిల్లర్ని సమీపించారు.

కిల్లర్ కుర్చీలో నిద్రపోతున్నవాడిలా వున్నాడు.

వారతణ్ణి కదిపారు.

కిల్లర్ లేవలేదు.

ఇంతలో సర్వర్ అక్కడికి వచ్చాడు—"ఏం జరి గింది?" అన్నాడు.

"మా స్నేహితుడి ఆరోగ్యం బాగోలేదు. వద్దం టూంటే హోటలుకు వచ్చాడు. ఎందుకో కళ్ళు తిరిగాయి. అర్జంటుగా హాస్పిటలుకు తీసుకువెళ్ళాలి. దోసెల ఆర్డరు క్యాన్సిల్ !" అన్నాడు వారిలో ఒకడు.

"అయ్యో! ముందతణ్ణి అర్జంటుగా హాస్పిటలుకు తీసుకొని వెళ్ళండి—" అన్నాడు సర్వర్.

ఈ సంభాషణ అక్కడ చాలామంది విన్నారు.

ఏమిటేమిటంటూ వారిచుట్టూ మూగారు.

ఆ యిద్దరూ జనాలకు విషయం చెప్తుకుంటూ కిల్లర్ని బయటకు తీసుకొని వెళ్ళారు. ఇద్దరు మనుషులకు కిల్లర్ భారంగానే వుండడంవల్ల సర్వర్ కూడా ఓ చేయి వేశాడు.

కిల్లర్ నడవడంలేదు.

అందుకని వాళ్ళతణ్ని ఇంచుమించు ఈడ్చుకుంటూ వెళ్ళారు.

విల్సన్ అటువైపు కూడా చూడలేదు. ఏం జరిగిందీ పట్టించుకోలేదు.

అతడికి ఊతప్పం వచ్చింది. అది తింటున్నాడు.

హోటల్లోని కొందరు జనం బయటకు వెళ్ళారు.

కిల్లర్ ఓ టాక్సీలోకి తరలించబడ్డాడు. జనంవైపుకు ఆ యిద్దరిలో ఒకడు తిరిగాడు–"మీ సహాయానికి చాలా థాంక్స్!" అన్నాడు.

"మే మేం చేశాం—" అన్నాడు జనంలో ఒకడు.

"జరిగిందంతా చూశారు. అందుకు!" అన్నాడా యిద్దరిలో ఒకడు.

"అయితే?"

"అనవసరపు ప్రశ్నలతో విసిగించలేను. చూసి ఊరు కున్నారు...." అంటూ అతడు టాక్సీ యెక్కాడు.

టాక్సీ రివ్వున దూసుకుని పోయింది.

విల్సన్ తాపీగా ఊతప్పం తింటూ ఓసారి తనలో తను నవ్వుకున్నాడు.

## 5

ఉన్నట్టుండి మెలకువవచ్చి చటుక్కున లేచి కూర్చున్నాడు కిల్లర్.

గదిలో ప్లాస్టిక్ నవారు స్టీలు మంచంమీదున్నాడు

తను.

పైన ఫ్యాను తిరుగుతోంది.

కిల్లర్ ఓసారి కళ్ళు మూసుకొని ఏం జరిగిందో గుర్తు చేసుకుందుకు ప్రయత్నించాడు.

అంతా గుర్తొచ్చింది.

హోటల్లో మసాలాదోశ ఆర్డరిచ్చాడు తాను. తిన్న గుర్తులేదు.

ఇక్కడికెలా వచ్చాడు?

కిల్లర్ లేచి గదంతా కలయతిరిగాడు.

మొజాయిక్ ఫ్లోరింగ్ నున్నగా వుంది. అతడి బూట్లు నేలపై జారిపోతున్నాయి.

కిల్లర్ గది గుమ్మందాకా వెళ్ళాడు. తలుపు తీయబోయాడు.

రాలేదు.

అప్పుడతడు తలుపులు దబదబా బాదాడు.

కొద్దిక్షణాల్లో తలుపులు తెరుచుకున్నాయి.

గుమ్మాం అవతల ఓ వ్యక్తి నిలబడి వున్నాడు.

అయిదడుగుల మూడంగుళాల పొడవు....

పొడవుకు తగ్గ సన్నం....

మనిషికి ముప్పై యేళ్ళపైముండొచ్చు. కానీ ముఖంలో వక్రతనం కనపడుతోంది.

చూపుల్లో మాత్రం పరిణతి వుంది.

అతడు కిల్లర్ని చూసి నవ్వాడు.

ఆ నవ్వు అంతర్జాతీయ స్మగ్లర్స్ కే సాధ్యపడుతుంది.

కోల్డు బ్లడెడ్ స్మైల్ అది!

"మెలకువొచ్చిందా?" అన్నాడతడు.

"ఎవర్నువ్వు?" అన్నాడు కిల్లర్.

"చూపులకు చిన్నవాణ్ని. చేతలకు పెద్దవాణ్ని. నా పేరు ప్రస్తుతానికి వినీల్ అనుకో—" అన్నాడతడు నవ్వుతూ.

నవ్వకపోతే అతడు పసిబాలుడిలా వున్నాడు.

నవ్వినప్పుడు అంతర్జాతీయ స్మగ్లర్లా వున్నాడు.

"మిస్టర్ వినీల్—నాతో నీకేం పని?" అన్నాడు కిల్లర్.

"నిజానికి నీతో నాకేపనీ లేదు. కానీ నువ్వే పని కల్పించావు...."

"నేను కల్పించానా?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యపోతూ.

"నువ్వాశ్చర్యపోతే నువ్వు చాలా మంచి నటుడివని నేననుకుంటాను.... బయటకురా — నీతో చాలా మాట్లాడాలి!" అన్నాడు వినీల్.

కిల్లర్ బయటకు వచ్చాడు.

అదొక చిన్న హాలు.

నేలంతా కార్పెట్ పరిచివుంది.

మధ్యలో సోఫా!

గోడలకు ఖరీదైన పెయింటింగ్స్....

ఇద్దరూ సోఫాల్లో యెదురెదురుగా కూర్చున్నారు.

ఇద్దరికీ మధ్య టీపాయ్ వుంది.

టీపాయ్ మీద చిన్న ప్లాస్టిక్ డబ్బా వుంది.

వినీల్ సోఫాలో వెనక్కు జారగిలబడి—"నేను నిన్నో ప్రశ్న అడుగుతాను. సూటిగా జవాబు చెప్పాలి" అన్నాడు.

"అడుగు—" అన్నాడు కిల్లర్.

"ఎవర్నువ్వు?" అన్నాడు వినీల్.

అంతవరకూ అతడి గొంతు ఒక విధంగా వుంది. అప్పుడు మరోలా ధ్వనించింది. కోల్డు బ్లడెడ్ వాయిస్ అది!

"నేనెవరో తెలియకుండా నే ఇక్కడికి రప్పించావా?" అన్నాడు కిల్లర్.

"తెలుసుకుందుకే ఇక్కడికి రప్పించాను" అన్నాడు విసిల్.

"నా గురించి తెలుసుకోవాల్సిన అవసరం నీకేముంది?" అన్నాడు కిల్లర్.

"నా ప్రశ్నలకు జవాబు చెప్పడం నీ బాధ్యత— ముందు నువ్వెవరో చెప్పు. చెప్పకపోతే....?" అని ఆగాడు విసిల్.

"చెప్పకపోతే?" కుతూహలంగా అడిగాడు కిల్లర్.

విసిల్ ముందుకు వంగి ప్లాస్టిక్ డబ్బా మూతతీశాడు.

కిల్లర్ ఉలిక్కిపడ్డాడు.

టీపాయ్‌మీదున్న ప్లాస్టిక్ డబ్బాలోంచీ బుస్సు మంటూ నల్లటి తాచుపాము పడగవిత్తి ఆడుతోంది.

తాచుపాము అటూ ఇటూ కదుల్తోంది. డబ్బాలోంచి బయటకు రావడంలేదు.

"ఏమిటిది?" అన్నాడు కిల్లర్.

"ఈ పాము కాటేస్తే సెకన్లో వెయ్యోవంతులో మనిషి ప్రాణం పోతుంది—...."

కిల్లర్ తేలిగ్గా నవ్వి—"ఇంతవరకూ ఇది నిన్ను కాటేయలేదా?" అన్నాడు.

"ఇది నా పెంపుడు పాము. నన్ను తప్ప ఎవరినైనా కాటేసుంది...."

కిల్లర్ తాచుపాము వంకే చూస్తున్నాడు. అది

తమాషాగా అవుతోంది....

"నా పేరు కిల్లర్. నేనొక ప్రయివేటు డిటెక్టవుని" అన్నాడు కిల్లర్.

"వెరిగుడ్ ....ఇంకా చెప్పు...."

"నన్ను చంపాలనుకుంటే మనుషుల్ని లెక్క చేయను. ఇంతవరకూ నన్ను చంపాలనుకున్న వారందరూ చచ్చారు. ఆ విషయం నీ పెంపుడు పాముకు అర్థమయ్యేలా చెప్పు.."

"నా పెంపుడు పాముకు చావులేదు—" అన్నాడు వినీల్.

"పుట్టిన ప్రతి జీవికీ చావుంటుంది...."

"జీవికి చావుంటుంది. కానీ యంత్రానికి కాదు...."

"అంటే?"

వినీల్ వివరించాడు. ఎదురుగా ప్లాస్టిక్ డబ్బాలో వున్న పెంపుడు పాముకు ప్రాణంలేదు. కానీ తుపాకీ గుళ్ళకూ, ప్రేలుడు పదార్థాలకూ లొంగని ప్రత్యేకమైన పాలిమర్స్‌తో తయారు చేయబడిందది. తనలో జీవం లేక పోయినా జీవమున్న వారి జీవాలు హరించగల విషం దానిలో వుంటుంది.

ఆ పాము ఎదుట వుండగా వినీల్‌ని తనేమీ చేయ లేడని కిల్లర్ గ్రహించాడు.

"వెరిగుడ్! హేట్సాఫ్ టూ యువర్ డిస్కవరీ!" అన్నాడు కిల్లర్.

"పాగ డంతో నిన్ను నీవు రక్షించుకోలేవు—...." అన్నాడు వినీల్.

"పోనీ—ఎలా రక్షించుకోగలనో చెప్పు—...." అన్నాడు కిల్లర్.

"తాళపత్ర గ్రంథాలు నాకిచ్చేస్తే నీ ప్రాణాలు రక్షించబడతాయి...."

"తాళపత్ర గ్రంథాలేమిటి?" అన్నాడు కిల్లర్.

"సుజాత ఇంట్లోంచి నువ్వు తీసుకున్నవి...."

కిల్లర్ ఆశ్చర్యపోయి — "సుజాత నీకు తెలుసా?" అన్నాడు.

"ఊం! సుజాత నా మనిషి!" అన్నాడు వినీల్.

"పాపం — ఆమె చచ్చిపోయింది...." అన్నాడు కిల్లర్.

"నువ్వే ఆమెను చంపేశావ్!" అన్నాడు వినీల్.

"ఎవరు చెప్పారు నీకు?"

వినీల్ చప్పట్లు కొట్టాడు.

అప్పుడు దూరాన్నుంచి ఓ నల్లటి మనిషి వచ్చాడు. అతడు ఆరడుగుల ఎత్తులో కండలు తిరిగి బలిష్టంగా వున్నాడు.

అతడి చూపుల్లో క్రూరత్వం తప్ప మరో భావం లేదు. ఆ వ్యక్తి వినీల్‌ని సమీపించి దగ్గరగా వంగాడు.

వినీల్ అతడి చెవిలో ఏదో చెప్పాడు. ఆ మనిషి వెళ్ళిపోయాడు.

"ఎవరతడు?" అన్నాడు కిల్లర్.

"ఈ యింటి కాపలావాడు. ఇంట్లోంచి నన్ను తప్ప యెవర్నీ నా అనుమతి లేకుండా బయటకు వెళ్ళనివ్వడు."

"నేను వడతానంటే ఏం చేస్తాడు?"

"వద్దంటాడు...."

"వినకపోతే?"

"వారిస్తాడు...."

"లెక్క చేయకపోతే?"

"చంపేస్తాడు...." చాలా తాపీగా అన్నాడు విసీల్.

"చంపలేకపోతే?"

"నాకు తెలియదు...."

"తెలుసుకోవడం మంచిది...." అన్నాడు కిల్లర్.

"తెలుసుకోవాలని నాకూ వుంది. కానీ నాకా అవకాశం రావాలి కదా! ఇంతవరకూ ఈ యింటినుంచి పారిపోవాలని ప్రయత్నించినవారు ముగ్గురు. ముగ్గురికి ముగ్గురూ చచ్చారు...."

కిల్లర్ యేదో అనాలనుకున్నాడు. ఈలోగా అతడు వచ్చాడు. అతడి చేతిలో పేపరుంది.

విసీల్ పేపరు తీసుకుని అతణ్ని వెళ్ళిపొమ్మని సైగ చేశాడు.

అతడు వెళ్ళిపోయాడు.

విసీల్ పేపర్ని కిల్లర్ కిచ్చాడు.

టీపాయ్ మీది తాచుపాము ముందు విసీల్ వైపుకి వంగింది. అతడి చేతిలోని పేపరు చేతులు మారుతూంటే తనూ పేపరుతోపాటు కిల్లర్ వైపు వంగింది.

కిల్లర్ దాన్ని గమనిస్తూనే ఉన్నాడు.

సెకండ్లో వెయ్యోవంతు చాలు — ప్రాణం పోవడానికి!

అతడు పేపరు చూశాడు.

మొదటి పేజీలో అతడి బొమ్మ. బొమ్మకింద వివరాలను బట్టి అతడు పారిపోయిన హంతకుడు.

"సుజాత మా మనిషి. మాదొక అంతర్జాతీయ ముఠా. ఆమె మాకు కావలసిన కీలకమైన రహస్యాలు తెలుసుకుని వాటిని తాళపత్రగ్రంథాల రూపంలో పొందుపరుస్తోంది.

ఎవరికీ అనుమానం రాకుండా వుండడంకోసం ఆమెవద్ద పురాతన తాళపత్రగ్రంథాలు కూడా కొన్ని వున్నాయి. ఇటీవల ఆమె కొన్ని ముఖ్య రహస్యాలు తెలుసుకుంది. వాటిని విల్సన్ అనబడే మరో మా మనిషికందజేయాలి. ఆమె అందజేసే తాళపత్రగ్రంథాల విలువ నలభైకోట్ల రూపాయలు. అంతర్జాతీయంగా అందరూ పంచుకోగా-నా ఒక్కడికే దెబ్భై లక్షల రూపాయలు వస్తుంది. అంత విలువైన వాటిని నువ్వు — విల్సన్‌కంటే ఒకరోజు ముందే దక్కించుకున్నావు....” అన్నాడు వినీల్.

“ఇప్పుడు నాకు కొంత కథ అర్థమవుతోంది—” అన్నాడు కిల్లర్.

తాచుపాము టీపాయ్‌మీద ఆడుతోంది.

“వెరీగుడ్ —నీకర్థమయిందేమిటో చెప్పు-” అన్నాడు వినీల్.

“విల్సన్ సుజాతనెందుకు చంపాడా అని ఆలోచిస్తున్నాను. ఇప్పుడసలు కథ తెలిసింది.”

“స్టాప్ నాన్సెన్స్!” కోపంగా అరిచాడు వినీల్.

టీపాయ్‌మీద తాచుపాము బుస్సుమంది.

“నేను నిజమే చెబుతున్నాను. పూర్తిగా విను....” అన్నాడు కిల్లర్..

వినీల్ కోపాన్ని నిగ్రహించుకొని—“ఊఁ చెప్పు-” అన్నాడు.

కిల్లర్ విల్సన్ తన్ను కలుసుకొని ఎలా ట్రాప్ చేసిందీ చెప్పాడు.

“ఇంపాసిబుల్!” అన్నాడు వినీల్.

“జరిగింది చెప్పాను. అసాధ్యమైతే నేనేం చేయను?”

"జరిగింది నేను చెబుతాను. శ్రద్ధగా విను—" అన్నాడు విసీల్.

"ఊఁ" అన్నాడు కిల్లర్.

"ఈరోజు విల్సన్ సుజాతను కలుసుకొని తాళపత్ర గ్రంథాలు సేకరించాలి. కానీ ఈ విషయం నీకెలాగో తెలిసింది. నిన్న నే వెళ్ళావు. సుజాతను హత్య చేశావు. తాళపత్రగ్రంథాలకోసం వెతకడంలో ఆలస్యం జరిగింది. పోలీసులు వచ్చారు. తప్పించుకొని పారిపోవాలనుకున్నావు పారిపోయావు...."

"కానీ అదే నిజమనుకున్నా—తాళపత్రగ్రంథాలు నాకు చిక్కలేదు...."

"చిక్కకపోతే నేనాశ్చర్యపోను. కానీ ఆ విషయం ధృవపడడానికి నాకు వ్యవధి కావాలి. సుజాతింటికి ప్రస్తుతం పోలీసు కాపలా వుంది. అంతవరకూ నిన్ను నా బందీగా వుంచుకోక తప్పదు...." అని నవ్వాడు విసీల్-"ఈలోగా తప్పించుకోవాలనుకుంటే ఒకే ఒక్క ఉపాయం. తాళపత్రగ్రంథాలెక్కడ దాచిందీ నాకు చెప్పు...."

"ఆ విషయం నాకంటే విల్సన్ కే బాగా తెలుస్తుంది. ఇంతకీ నేను నీకెలా దొరికాను?"

"నీ ప్రవర్తనే నిన్ను పట్టిచ్చింది—" అన్నాడు విసీల్—"సుజాత హత్య గురించి మాకెవ్వరికీ తెలియదు. విల్సన్ మామూలుగా నిర్ణీత సమయానికి సుజాత ఇంటికి వెళ్ళాడు. అక్కడ సెంట్రీని చూసి ఆశ్చర్యపడ్డాడు. విషయం తెలిసేక అక్కణ్ణించి బయటపడ్డాను. అప్పుడు నువ్వాణ్ణి అనుసరించడం మొదలుపెట్టావు. అయితే మాది అంతర్జాతీయ ముఠా. విల్సన్ ఊళ్ళో అడుగుపెట్టగానే

అతిథికే ప్రమాదమూ రాకుండా రక్షించడానికి నలుగురు అంగరక్షకులు కూడా బయల్దేరారు. వారు నిన్ను కని పెట్టారు. విల్సన్ కూడా నీ వ్యవహారం గమనించాడు. అందుకే హోటల్లోకి అడుగు పెట్టాడు.

అది మా ముఠా హోటాలన్న విషయం నీకు తెలియదు. విల్సన్ సర్వర్‌కి చెప్పి నీకిచ్చే మంచినీళ్ళలో మత్తుమందు కలిపించాడు. నా అనుచరులిద్దరు నిన్నిక్కడికి తీసుకుని వచ్చారు. మొదట నేను నిన్ను పోలీసుల మనిషని అనుమానించాను. తీరా చూస్తే నీది మారువేషమని తేలింది. సుజాత హత్య గురించిన ఆరా ఈలోగా కొంత తెలిసింది. నువ్వే ఆ హంతకుడివని తెలియగానే నా అదృష్టాన్ని నేనే అభినందించుకున్నాను—...."

మొత్తం జరిగినదంతా కిల్లర్‌కర్థమయింది.

"ఇప్పుడు నాకంతా తెలిసింది. విల్సన్ నిన్ను మోసగించాడు...." అన్నాడు కిల్లర్.

"విల్సన్ నాకు నమ్మకమైన మనిషి. అతడు నన్ను మోసగించడు...."

"నమ్మినవాళ్ళే ఎవరైనా మోసగించగలరు. ఆ తాళపత్రగ్రంథాలవల్ల నీకు డెబ్భై లక్షలు వస్తాయంటున్నావు. అందులో విల్సన్ భాగమెంత?" అన్నాడు కిల్లర్.

"యాభై వేలు...."

"చాలాకాలంగా ఈ వ్యవహారాలు తెలిసిన విల్సన్ ఏ అయిదులక్షలకో ఆ తాళపత్రగ్రంథాలనమ్మేస్తే?"

విసీల్ ముఖంలో రవంత కలవరం కనపడింది—

"నువ్వు నాలో అనుమానబీజాలు నాటాలని చూస్తున్నావు. నిజానిజాలు తెలుసుకోగల లైడిటెక్టర్ నా

దగ్గరుంది—" అన్నాడతను.

"అయితే యీ కేం? నీ లైడిటెక్టర్‌తో విల్సన్‌ని పరీక్షించుకో—"

"వావాళ్ళని నేను పరీక్షించను. నువ్వు చెప్పేది నిజమో కాదో నా డిటెక్టర్ తేలుస్తుంది. నువ్వు నిజమే చెబితే విల్సన్ మోసం చేసినట్లు.... లేకుంటే...." అని ఆగాడు విసీల్.

"లేకుంటే?" అన్నాడు కిల్లర్.

"నా విషసర్పం నిన్ను కాటేస్తుంది...." అన్నాడు విసీల్.

కిల్లర్ ఒళ్ళు జలదరించింది.

విసీల్ మళ్ళీ చప్పట్లు కొట్టాడు.

నల్లటి ఆరడుగుల మనిషి వచ్చి విసీల్ అడిగిన ఓ చిన్న సాధనం తెచ్చి ఇచ్చి వెళ్ళిపోయాడు.

పాకెట్ టేపురికార్డంత సాధనం అది.

దానిపై పియానో మెట్లు మీటలు నాలుగున్నాయి.

విసీల్ ఒక మీట నొక్కగానే—దానిపై స్టీరియో కాసెట్టే డెక్స్‌లో వెలిగినట్లు ఒక పచ్చ చుక్క, ఒక ఎర్రచుక్క వెలిగాయి.

విసీల్ కిల్లర్‌తో—"నువ్వు మాట్లాడ్డం ప్రారంభించు" అన్నాడు.

"ఏం మాట్లాడాలి?" అన్నాడు కిల్లర్.

అప్పుడే విసీల్ రెండవ మీటను నొక్కాడు—"ఇప్పుడిది నీ గొంతుకు అనుకూలంగా యింది. నువ్వేం మాట్లాడినా ఈ పరికరం వింటుంది. నువ్వు చెప్పేది నిజమైతే నీ స్వరానికి అనుగుణంగా వరుసగా ఆకుపచ్చ చుక్కలు మెరుస్తాయి. అబద్ధం చెబితే ఎర్రచుక్కలు

మెరుస్తాయి. హరిహరాదులెవరొచ్చినా, ఈ పరికరం అబద్ధమాడదు. తప్పు చేయదు. ఇప్పుడు నీ వివరాలు చెప్పు...."

కిల్లర్ ఆశ్చర్యంగా ఆ యంత్రంవంక చూశాడు. ఒక్కక్షణమాగి—"నా పేరు వెంకన్న, నేనొక ప్రయివేటు డిటెక్టివును...." అన్నాడు.

అతడు వెంకన్న అనగానే పరికరంలో వరుసగా యేడు ఎర్రచుక్కలు వెలిగాయి. ప్రయివేటు డిటెక్టివనగానే వరుసగా ఏడు ఆకుపచ్చ చుక్కలు వెలిగాయి.

"పరికరాన్ని పరీక్షించినట్లున్నావు. అలాంటి పనులు చేయడంవల్ల నీకే ప్రమాదం. ముందు విల్సన్ గురించి చెప్పు. నువ్వు మాట్లాడేటప్పుడు ఎర్రదీపం వెలిగిందా— నా పెంపుడు పాము కాటందుకుంటుంది—" అంటూ పరికరానికి విల్సన్ మరో మీట నొక్కాడు.

"అంతే!

టీపాయ్‌మీద ఆడుతున్న తాచుపామిప్పుడు కిల్లర్ వైపు తిరిగింది.

అది అతడినే గుచ్చి గుచ్చి చూస్తున్నట్లుంది.

కిల్లర్ దృష్టి ఇప్పుడు టీపాయ్‌మీదనే వుంది.

లైడిటెక్టర్; తాచుపాము—ఒకదానికొకటి పక్కన వున్నాయి.

మనిషి అబద్ధం చెప్పేటప్పుడతడికా విశేషం తెలుస్తుంది. తను అబద్ధం చెబుతున్నానన్న భావం అతడిని తడబడేలా చేస్తుంది. అప్పుడతడి నరాల కంపన వేరే విధంగా వుంటుంది. స్పందనగతులు మారతాయి అది మామూలు మనుషులు కనిపెట్టే తేడా కాదు. లైడిటెక్టర్స్ ఈ సూత్రం ఆధారంగా పనిచేస్తాయి. తన యెదుటనున్న

లైడిటెక్టర్ స్వగతులనుబట్టి అబద్ధాలను తెలుసుకుంటు దన్నమాట!

కిల్లర్ కు అవసరపడినప్పుడబద్ధాలు చెప్పడంలో తానగ్రగణ్యుడినని నమ్మకం. తడబడకుండా అబద్ధాలు చెప్పగలననుకున్న అతడి నమ్మకాన్నీ పరికరం అబద్ధం చేసింది. చాలా సునిశితమైన యంత్రమయ్యుండాలది.

ఇప్పుడబద్ధం చెబితే తన ప్రాణాలకే ప్రమాదమని కిల్లర్ కి తెలుసు.

అతడు గొంతు సవరించుకొని గత దినం విల్సన్ తో తనకు జరిగిన అనుభవం చెప్పసాగాడు.

కిల్లర్ మాట్లాడుతూంటే లైడిటెక్టర్లో వరుసగా ఆకుపచ్చ చుక్కలు వెలిగి ఆరుతున్నాయి. ఆ చుక్కలతడి మాటలకనుగుణంగా నాట్యం చేస్తున్నట్టుంది. ఆ పక్కనే చుక్కల కనుగుణంగా తాచుపాము ఆడుతోంది.

కిల్లర్ జరిగింది జరిగినట్లు చెప్పడమయ్యేసరికి విసీల్ లో పెద్ద మార్పు వచ్చింది.

అతడు చప్పట్లు కొట్టాడు.

ఆరడుగుల నల్లనివాడు వచ్చాడు. విసీల్ అతడికేదో చెప్పాడు. అతడు వెళ్ళిపోగానే లైడిటెక్టర్ని ఆఫ్ చేశాడు.

కిల్లర్ తృప్తిగా నిట్టూర్చాడు.

"మాశావా— నేను నిజమే చెప్పాను. అనవసరంగా నన్ను సుమానించావు...." అన్నాడతడు.

"నువ్వు మాట్లాడకు...." అన్నాడు విసీల్. అతడు ప్లాస్టిక్ డబ్బమీద మూత పెట్టాడు.

కిల్లర్ మరింత తేలికగా నిట్టూర్చాడు.

"విల్సన్ చేసిన పొరపాటువల్ల అనవసరంగా నీవంటి వాడికి మా సాధరం తెలిసిపోయింది. ఈ కేసులో నీ సంబంధ మూలేదు. అయినా విల్సన్ స్వార్థంతో మమ్మల్ని మోసగించి—ఆ మోసం నీవల్ల జరిగినట్లు భ్రమలో వుంచా లనుకున్నాడు నన్ను. అందుకు ఫలితమనుభవిస్తాడు...."
అన్నాడు విసీల్.

"నా అమాయకత్వాన్ని గ్రహించావు. అదే నాకు సంతోషం —" అన్నాడు కిల్లర్.

"నువ్వు మాట్లాడకు...." అన్నాడు విసీల్ తీవ్రంగా.

ఇద్దరూ కాసేపు మౌనంగా కూర్చున్నారు.

సుమారు గంట గడిచేక ఆ హాల్లోకి విల్సన్ ప్రవే శించాడు.

"రా—విల్సన్—ఇలా వచ్చి కూర్చో—" అన్నాడు విసీల్. అతడు చూపిన ప్రకారం కిల్లర్ పక్కనే కూర్చు న్నాడు విల్సన్.

"ఇతడి వివరాలు తెలుసుకున్నారా?" అన్నది విల్సన్ మొదటి ప్రశ్న.

"అతడు చెప్పేది ఆసక్తికరంగా వుంది. నువ్వుకూడా విను..." అన్నాడు విసీల్.

విల్సన్ కోసం కిల్లర్ మళ్ళీ తన కథ చెప్పాడు.

కథ పూర్తికాగానే విల్సన్ నవ్వి—"లైడిటెక్టర్లో ఇతడి కథలోని నిజానిజాలు తేల్చలేకపోయారా?" అన్నాడు.

"ఇతడి కథపై నీ అభిప్రాయమేమిటి?" అంటూ లైడిటెక్టర్ ఆన్ చేశాడు విసీల్ విల్సన్ మాట్లాడ్డం ప్రారంభించగానే మరో రెండు మీటలు నొక్కాడు.

"అంతా శుద్ధ అబద్ధం—" అన్నాడు విల్సన్.

లైడిటెక్టర్లో ఆకుపచ్చ చుక్కలు వెలిగాయి. కానీ విసీల్ పరికరం వంక కాక విల్సన్ వంక చూస్తూ—"ఆ విషయం నాకూ తెలుసు. అతడి మాటలు నమ్ముతున్నా నన్న భ్రమ అతడికి కలిగించి నిన్ను రప్పించానిక్కడికి. అతడు నీ గురించి అబద్ధం చెప్పాడు. అందుకే శిక్ష నీవే అతడికివ్వాలి. ఈ డబ్బా మూత తెరు—" అన్నాడు.

కిల్లర్ తడబడ్డాడు.

విసీల్ తన మాటలు నమ్మలేదా? ఇప్పుడు తనకు ప్రాణాపాయం తప్పదా?

అతడాలోచిస్తూండగానే విల్సన్ ప్లాస్టిక్ డబ్బా మూత తీశాడు. ఆ వెనువెంటనే బుస్సుమంటూ తాచు పాము విల్సన్ని కాటేసింది.

విల్సన్ గొంతులోంచి కేక కూడా రాలేదు.

చూస్తూండగా అతడి శరీరం నల్లగా మారిపోయింది. అతడు నేలకూలాడు.

"డియర్ మిస్టర్ కిల్లర్! ఇది నా అనుచరులను శిక్షించే పద్ధతి నీవు నా అనుచరుడివి కాకపోయినా, నన్ను మోసగించకపోయినా రేపు నిన్నూ ఇదే పద్ధతిలో శిక్షించబోతున్నాను. నా ప్రాకరంలో పరాయివాళ్ళకు చోటు లేదు. రేపటిదాకా నీకెందుకవకాశమిస్తున్నానంటే—నా పెంపుడు పాము రోజుకొక్కడిని మాత్రమే కాటేస్తుంది మరి!" అంటూ విసీల్ ప్లాస్టిక్ డబ్బామీద మూత పెట్టేసి చప్పట్లు కొట్టాడు.

అరగుండు నల్లటివాడు వచ్చి విసీల్ ఆదేశం ప్రకారం విల్సన్ శవాన్నీడ్చుకొని వెళ్ళిపోయాడు.

"నువ్విక బుద్ధిగా వెళ్ళి నీ గదిలో పడుకో—" అన్నాడు విసీల్.

"నీకు బుద్ధి చెప్పిగానీ నేను పడుకోను—" అంటూ కిల్లర్ మెరుపు వేగంతో లేచాడు.

విసీల్ చటుక్కున చప్పట్లు కొట్టాడు. అయితే అరడుగుల నల్లనివాడొచ్చేలోగా—అతడు కదలలేని స్థితిలోకి మారిపోయాడు.

కిల్లర్ అతణ్ణి కూడా క్షణాలమీద పడగొట్టాడు.

తర్వాత ఇల్లంతా కలియదిరిగాడు.

ఆ యింట్లో ఇంకెవ్వరూ లేరు. ఓ పక్కగదిలో విల్సన్ శవముంది.

కిల్లర్ ఆ యిద్దర్నీ బంధించడానికి తాడుకోసం వెతికి సంపాదించాడు. దాంతో ఆ యిద్దర్నీ ఒకరికొకర్ని కలిపి కట్టేసి ఎదురుగా కూర్చున్నాడు.

"ఇంత సులభంగా నన్నూ, నా అనుచరుణ్ణీ పడగొట్టగల వాడీ భూప్రపంచంలో లేడని నమ్మాను—" అన్నాడు విసీల్ వాపోతూ.

"అయాం మే కిల్లరాఫ్ సచ్ ఒపినియన్స్!" అన్నాడు కిల్లర్.

తానున్న ఊరికి సుమారు పదిహేను కిలోమీటర్ల దూరంలో వున్న ఆ యింటి వివరాలు కిల్లర్ పోలీసులకు చెప్పడానికంతో వ్యవధి అవసరంలేకపోయింది.

# 6

కిల్లర్‌కంతా ఆశ్చర్యంగా వుంది.

ఒక్క లై డిటెక్టర్ కారణంగా తన ప్రాణాలు కాపాడబడ్డాయి.

లై డిటెక్టరుంటే ఎన్ని ప్రాణాలైనా నిలబెట్టవచ్చు. నేరస్థుల ఆచూకీ తెలుసుకోవచ్చు. ప్రపంచంలో నేరాలనే రూపుమాపవచ్చు.

తనకది రావాలని అతడు పోలీసు డిపార్టుమెంటుని కోరాడు. కానీ అది ప్రభుత్వ పరిశోధనా సంస్థలకు పరీక్షకు వెళ్ళింది.

కిల్లర్ నిరుత్సాహపడ్డాడు.

ఆ నిరుత్సాహంతోనే అతడొకరోజు సాయంత్రం బజార్లో తిరుగుతూండగా ఓ వ్యక్తి యెదురై పలకరించాడతణ్ణి.

"నువ్వెవరో నాకు తెలియదు...." అన్నాడు కిల్లర్.

"గోడలకు చెవులుంటాయి. గోడల్లేని చోటుకు వెళ్ళి మాట్లాడుకుందాం—" అన్నాడతడు.

ఇద్దరూ ఓ పార్కుకి వెళ్ళారు.

చుట్టుపక్కల జనంలేరు.

"హేట్సాఫ్ టూ యూ—డిటెక్టివ్ కిల్లర్! ప్రభుత్వం యెన్నోవిధాల ప్రయత్నించి పట్టుకోలేకపోతున్న అంతర్జాతీయ ముఠా వ్యక్తుల్ని పోలీసులకప్పగించావు...." అన్నాడతడు.

"నువ్వెవరు?"

"ఆ ముఠాకోసం యెన్నో పథకాలు వేస్తున్న ప్రభుత్వోద్యోగిని. అయితే వారి మనుషులు మా సంస్థలో కూడా కొందరు చేరినందువల్ల మా పథకాలు ముందే వారికి తెలిసిపోతున్నాయి. నాకు సుజాత గురించి కొన్ని వివరాలు తెలిసి ఆమె యింటి పనివాడుగా చేరి ఎన్నో రహస్యాలు తెలుసుకున్నాను. ఆమె నన్ననుమానించకుండా జాగ్రత్త తీసుకున్నాను. కానీ నాకు తెలిసిన రహస్యం ఎవరికి చెప్పాలో తెలియదు. అందుకే మా డిపార్టుమెంటుకి చెందని నిన్నెన్నుకున్నాను. నువ్వు నా ఎన్నిక సరైనదని ఋజువు చేశావు...." అన్నాడతడు.

కిల్లర్ ఆశ్చర్యంగా—"నువ్వు నన్నెన్నుకున్నావా? ఎలా?" అన్నాడు.

అతడొక కవర్ని కిల్లర్‌కందించి—"ఇందులో యాభై వేలున్నాయి. ప్రభుత్వం తరఫున నీకు నేనందజేస్తున్న ఫీజిది. జరిగిందంతా పూర్తిగా మర్చిపో. ప్రభుత్వానికందిన తాళపత్ర గ్రంథాలవల్ల చాలా గొప్ప విశేషాలు తెలుస్తున్నాయి. అదంతా రహస్యంగా ఉండాలి...." అన్నాడు.

"ఇంతకీ నువ్వే విల్సన్ని బుట్టలో వేసుకున్నావా?" అన్నాడు కిల్లర్.

"లేదు. ఒకరోజు ముందు నేనే విల్సన్‌గా వచ్చి నిన్ను కలుసుకున్నాను. సుజాతను చంపి తాళపత్ర గ్రంథాలు సాధించాను. నిన్ను నరరూప రాక్షసులకు వదిలిపెట్టి—ఆ దుర్మార్గుల దృష్టి నాపై పడకుండా కాపాడుకున్నాను. మరి నాకు సెలవు. ఇంకేమీ అడక్కు" అంటూ అతడు లేచి వెళ్ళిపోయాడు.

కిల్లర్ ప్రమాన్పడిపోయాడు.

అంటే—విల్సన్ విసిల్‌ని మోసం చేయలేదు.

లై డిటెక్టర్ని తనవారిపై ప్రయోగించకూడదన్న విసిల్ సిద్ధాంతం అతణ్ణి మోసగించింది.

కళ్ళతో చూసేదంతా నిజంకాదు.

లై డిటెక్టర్ తను నిజం చెబుతున్నాడో లేదో తెలుసుకోగలదు తప్ప—అసలు నిజాన్ని తెలుసుకోలేదు.

కిల్లర్‌కిప్పుడు లై డిటెక్టర్ గురించిన బెంగ పోయింది.

ఓ అంతర్జాతీయ ముఠా ఆటకట్టించే అవకాశాన్ని తనకిచ్చిన ఆ ప్రభుత్వోద్యోగిని మనసులో అభినందించుకుంటూ అతడు రామేశ్వరమూర్తి ఇంటికి బయల్దేరాడు.

—: అయిపోయింది :—

# నకిలీ సంపద

## భీమవరపు పురుషోత్తం

ప్రపంచంలోకెల్లా అతి ఎత్తైన శిఖరం ఎవరెస్ట్. ఎవరెస్ట్‌కు ఆనుకొని ఉన్న శ్రేణులలోకెల్లా ఎత్తైన శిఖరం 'డిజియానా'. డిజియానాకి దాదాపు తొమ్మిది మైళ్ళ ఎగువన ఒక పర్వతారోహకుల బృందం ప్రయాణిస్తున్నారు. ఆ పర్వతం ఉనికి కనుగొన్న తర్వాత ప్రయాణించే బృందాలలో వాళ్ళది రెండవది.

దూరంనుండి వాళ్ళు చిన్న చిన్న నలకల్లా కనిపిస్తున్నారు.

అర చెయ్యి నుదుటిపై ఆన్చి, కళ్ళు చికిలించి క్రిందికి చూశాడు విద్యాసాగర్. కాళ్ళు కొద్దిగా వణకడంతో బాటు శరీరమంతా కంపించిందతడికి. చేతిలో ఐరన్ స్టిక్‌ని మంచులో బలంగా గుచ్చాడు అప్రయత్నంగా.

"సాగర్ ఆ లోయలోనికి చూడకు. కళ్ళు తిరుగుతాయి" అలసటగా వినిపించిందో కంఠం.

ఆ కంఠం విని నవ్వుతూ తలతిప్పాడు సాగర్. తెల్లటి

మంచుతిన్నెల మధ్య కొద్దిగా వంగి నిలబడి వున్నాడు జస్వంత్. అతడి వీపుమీద దృఢమైన సంచి బిగించబడి వుంది. చేతులకు గ్లౌవ్స్ వున్నాయి. రెండు చేతుల్లోనూ వున్న ఐరన్ స్టిక్‌ని గుచ్చి పట్టుకున్నాడు. తలపై అతుక్కు-పోయినట్టున్న బొచ్చు టోపీమీద మంచుపడి చిత్రంగా వున్నాడతడు.

సాగర్ దృష్టి పైకి పోనిచ్చాడు. ఇరవై అడుగుల దూరంలో జస్వంత్ లాంటి దుస్తులలో వున్న బృందం మెల్లగా సాగిపోతున్నారు.

"సాగర్! వచ్చేయ్. మళ్ళీ వాళ్ళకు దూరమై పోతాం!"

సాగర్ కొద్దిగా పరిగెడుతూ వచ్చి జస్వంత్‌తో కలిసాడు. ఇద్దరూ నడవసాగారు. చలికి గడ్డకట్టుకొని పోయిన శరీరంతో పరిగెట్టడంవల్ల ప్రారంభమైన నొప్పుల్ని పళ్ళబిగువున అణుస్తూ అడిగాడు సాగర్ "జస్వంత్! ఇంకా మనం యెంతదూరం పోవాలి ఈ రోజుకి?"

మిత్రుడి వంక చూస్తూ చెప్పాడు జస్వంత్ "చాలా దగ్గరికి వచ్చేశాం! దాదాపు పద్దెనిమిది కిలోమీటర్లు ప్రయాణం చేస్తే చాలు మాప్‌లో వున్న ప్రదేశం చేరుకొంటాం. బహుశా ఈ రోజు ప్రయాణంతోనే మనం ఆ దూరాన్ని పూర్తి చేయవచ్చునేమో!"

ఇద్దరూ బృందాన్ని సమీపించారు. వాళ్ళలో ఇద్దరు ముగ్గురు వెనక్కు తిరిగి మిత్రులవైపు చూసి నవ్వారు.

"పాల్కే సాబ్! ఇంకా యెంత సేపటిలో గుడారం వేయబోతున్నారు?" అడిగాడు జస్వంత్, పొడుగ్గా వుండి, నిండుగా వున్న గడ్డంతో గంభీరతను సంతరించు

కొన్న వ్యక్తిని.

కాసేపాగి చెప్పాడు పాల్కే "మరో రెండు గంటల్లో అనువైన ప్రదేశం చూసి గుడారాలు వేసేద్దాం. మీరేమంటారు బెర్జీ?" వెనక్కి తిరిగి అడిగాడు గుంపులో చివరగా వున్న వ్యక్తిని.

పాల్కే ఆ పర్వతారోహక బృందానికి నాయకుడు. బెర్జీ వయసులో పెద్దవాడేం కాదు. ఇరవై నాలుగేళ్ళుంటాయి అతడికి. అనవభిజ్ఞా శిలా విశాలమైన నుదురు. తెలివితేటలు ప్రతిబింబించే సన్నటి ముఖం.

"ప్రస్తుతం వున్న వెలుతురుబట్టి చూస్తే మరో గంటన్నర చాలనిపిస్తూంది. అనువైన ప్రదేశం వెదకడానికి టైం పడుతుంది కదా" చెప్పాడు బెర్జీ. పాల్కే ముఖంలో బెర్జీ చెప్పినదానికి సరేనన్న భావం కనిపించింది.

నిజానికి పాల్కే బృందంలో సభ్యులంతా ప్రాథమిక దశలో వున్నవారే. బృందం రెండు మూడు ప్రయాణాలను మించి చేయలేదు కూడా. అందుకే సాగర్, జస్వంత్, బెర్జీలను బృందంలో సభ్యత్వం లేకపోయినా, గతానుభవం కూడా లేకుండానే తమతోపాటు డిజియానా ఆరోహణ చేస్తాననగానే పాల్కే మనస్ఫూర్తిగా అంగీకరించాడు. బృందం పెరగడంవల్ల ప్రయాణం సమర్థవంతంగా సాగుతుందనే విశ్వాసం పాల్కే కలిగివుండడం అందుకు కారణం కావచ్చు. బృందంలో చేరిన మర్నాడే పాల్కేకి బెర్జీ తెలివితేటలు, మనస్తత్వం నచ్చాయి. నిజానికి సాగర్, జస్వంత్‌లకు బెర్జీ ఎవరో తెలియదు!

దాదాపు గంటన్నరపైనే నిశ్శబ్దంగా సాగింది

ప్రయాణం. తరువాత పార్కే బెనర్జీ తప్ప. మిగతావాళ్ళ తలో దిక్కుకి విడివడి గుడారాలకు అనువైన ప్రదేశం వెతకసాగారు. వాళ్ళకు కొద్ది వెనకగా వున్న సాగర్, జస్వంత్ అలాగే నిలబడిపోయారు.

"మిస్టర్ ఫ్రెండ్స్ ఈ ప్రయాణం మీకు కొద్దికష్టంగా వుంది కదూ!?" నవ్వుతూ ప్రశ్నించాడు బెనర్జీ. అతడి ప్రశ్న సూటిగా వుంది.

గొంతు సర్దుకొని ముందుకొస్తూ చెప్పాడు జస్వంత్. "నో....నో.. మిస్టర్ బెనర్జీ. కొద్ది కొత్తగా ఉన్నప్పటికీ ఉత్సాహంగా వుంది."

"పార్కే లాంటి అనుభవజ్ఞులతో కలసిరావడంవలన ధైర్యంగా కూడా వుంది" మిత్రుడి మాటకు వత్తాసు పలికాడు సాగర్.

"కొత్తవాళ్ళయినా ఇంతదూరం, ఇంతపైకి యే అలసటా లేకుండా మాతో సమానంగా రాగలిగారంటే మీ సహనానికి మెచ్చుకోవాలి" ప్రశంసనీయంగా చూశాడు పార్కే.

"ఏదో కారణం లేకుండా ఇంత పట్టుదలగా కష్టపడి రారులే!?!"

బెనర్జీ మాటలకు మిత్రద్వయం మొఖాల్లో నవ్వు మాయమయింది. ముఖంలో మారే రంగుల్ని బలవంతాన అదుపులో పెట్టుకొన్నారు.

"మిస్టర్ బెనర్జీ! మీ మాటలు నాకర్థం కాలేదు?" వీలయినంత ప్రశాంతంగా అడిగాడు జస్వంత్.

"మిస్టర్ జస్వంత్! నా ఉద్దేశ్యం—పర్వతారోహణ బాగా నేర్చుకోవాలనుకొన్నదే మీ పట్టుదలకు కారణం కావచ్చు!"

మిత్రులిద్దరూ నిశ్శబ్దంగా ఊపిరి వదిలారు బెనర్జీ సమాధానంతో.

## 2

"పాల్లేసాబ్ ఇక్కడ బావుంది" వారు నిలబడిన ప్రదేశానికి ఎడం వయిపు, కాస్త దూరంనుండి ఒక వ్యక్తి అరచి చెప్పాడు.

అందరూ అటు తిరిగారు. "వెరీగుడ్! అద్దు కూడా అనువుగా వుంది" సంతృప్తిగా చెప్పాడు పాల్కే. మరి కాసేపు ఆ ప్రదేశాన్ని పరికించి, "అందరూ అక్కడకు పదండి" అని బిగ్గరగా చెప్పాడు.

అప్పటికే బాగా చీకటిపడింది. ముక్కలు ముక్కలుగా చింపి గాలిలోకి ఎగరేసిన దూదిపింజల్లా మంచు మెల్లగా కురుస్తోంది. ముందు రాబోయే ఉధృతానికి సూచనగా చల్లని గాలులు వుండుండి వీస్తున్నాయి. అందరూ తమ తమ సామానులు విప్పుకొని, గుడారాలు వేయడంలో నిమగ్నమయ్యారు.

బలమైన టార్పాలిన్ గుడ్డతో మిలటరీ గుడారాల వలె వేయబడ్డ మొత్తం ఐదు గుడారాలు గాలి వేగానికి కొద్దిగా కంపిస్తూ మంచులో గుచ్చబడిన ఇనుపఊచల్ని కూడా సన్నగా ఊపుతున్నాయి. నిజానికి అప్పుడు గాలి చాలా బలంగా వీస్తూంది. అయితే వారి గుడారాలు ఎత్తుగా వున్న రెండు మంచు శిఖరాల మధ్య సమతల ప్రదేశంలో వేయడంవలన గాలి విసురు అంతగా బాధించడంలేదు వాళ్ళను.

పాల్కేతో సహా మొత్తం సభ్యులు పదహారుమంది. పాల్లే బెనర్జీలకు ప్రత్యేకంగా ఒక గుడారం కేటాయించబడింది. మిగతా పధ్నాలుగుమంది నాలుగు గుడా

రాలలో పడుకొన్నారు. అంతా, పొడవైన కాలర్లు వున్న, ఉన్ని జుబ్బాలు తొడుగుకొని వున్నారు.

సాగర్, జస్వంత్ లు ఉన్న గుడారంలో మరో ఇద్దరున్నారు. వాళ్ళ గుడారానికి అక్కడక్కడా కొన్ని చిరుగులున్నాయి. వాటిల్లోంచి, సన్నగా గాలిదూసుకొస్తూ, వాళ్ళు కప్పుకొన్న జుబ్బాల్ని ఛేదించుకొని శరీరాన్ని కొద్దో గొప్పో బాధిస్తూంది.

గుడారంలో వున్న మరో ఇద్దరు అప్పటికే బయటికి వెళుతూ అడిగారు "ఫ్రెండ్స్ మీరు ఫుడ్ కి రారా!?"

ఒక్కసారిగా మిత్రుద్దరికీ ఆకలి గుర్తొచ్చింది. హుషారుగా లేచి బయటికి వచ్చారు. సాగర్ జుబ్బా కాలర్ని చెవుల పైకి మరింత లాక్కున్నాడు. మధ్యలో వున్న విశాలమైన గుడారంలో మంట వెలుతురు కనబడుతూంది. అక్కడ కొందరు బయటే నిలబడి వణుకుతున్నారు.

ఇద్దరికీ చలికి పళ్ళు గిట్టకరచుకొనిపోతూ చేతులూ కాళ్ళూ వొంకర్లు తిరిగిపోసాగాయి. సాగర్ నడుస్తూ చుట్టూ చూశాడు, చిక్కటి చీకటిలో తెల్లటి మంచు శిఖరాలు చీకటిపడబోయేముందు ఆకాశంలో తేలే మబ్బు తునకల్లా అస్పష్టంగా కనబడుతున్నాయి.

గుడారం లోపలికి చేరుకున్నారు. ఎర్రటి మంట వెచ్చదనాన్ని ఇస్తూంది.

"హల్లో ఫ్రెండ్స్ ఇలా కూర్చోండి" ఆహ్వానించాడు జార్జ్ అప్పటికే చేతిలో వున్న ప్లేటులో యేదో తింటున్నాడతను.

"థాంక్స్!" కులాసాగా అని కూర్చున్నాడు సాగర్. ప్రక్కనే కూలబడ్డాడు జస్వంత్. మంట దగ్గర ఆహారం

తయారుచేస్తున్న నలుగురిలో ఒక వ్యక్తి లేచివచ్చి, ఇద్దరికీ చెరో ప్లేటూ అందించి వెళ్ళిపోయాడు.

సాగర్ ప్లేటును చూశాడు. బాగా వేడిగా వుంది. నాలుగు చపాతీలపై పొగలు కక్కుతున్న బఠానీకూర వేసివుంది ప్లేట్లో వేడి పుట్టించడానికి అన్ని పాళ్ళూవున్న ఆహారం. చురుకుగా చపాతీముక్క తుంచి, కూరలో ముంచాడు సాగర్.

"సాగర్ మీది జైపూర్ కదూ!" మాతాత్తుగా విని పించిన ప్రశ్నకి, నోట్లో పెట్టుకోబోతున్న చపాతీ ముక్కని అలాగే వుంచి, జస్వంత్ వంక చూసి తర్వాత తల పక్కకి తిప్పాడు సాగర్.

చిరునవ్వుతో సాగర్ వంక చూస్తున్నాడు బెనర్జీ.

సాగర్ అవునన్నట్టు చాలా నెమ్మదిగా తలవూపి, మళ్ళీ తన పనిలో నిమగ్నమయ్యాడు.

కాసేపాగి "నాదీ జైపూరే - అంటే మన బాచ్‌లో జైపూర్ వాళ్ళం ముగ్గురున్నామన్నమాట" అన్నాడు బెనర్జీ, జస్వంత్ వంక చూస్తూ.

"మీదీ జైపూరేనా!?" తాపీగా చూస్తూ ఆశ్చర్యం ప్రకటించాడు జస్వంత్.

బెనర్జీ ముఖంలో మళ్ళీ నవ్వు ప్రత్యక్షమయింది. అతడు మళ్ళీ యేదో అడగబోతున్నాడని గ్రహించాడు సాగర్.

"ప్రొఫెసర్ గురుసింగ్ మీకు తెలుసా?"

ఆ ప్రశ్నకు సాగర్‌కి పాలమారింది. ఇద్దరూ చటుక్కున చూపుల్ని బెనర్జీ ముఖానికి ప్రసరింపజేశారు. మంట వెలుతురు ఎర్రగా ప్రజ్వరిల్లుతుంది బెనర్జీ ముఖంపై, ముఖంలో అతడి కళ్ళల్లో.

మిత్రుల మౌనం చూసి బెనర్జీయే చెప్పాడు ప్రొఫెసర్ గురుసింగ్ మా ఫామిలీకి బాగా ఆప్తుడు. జైపూర్ లో సాధారణంగా గురుసింగ్ పేరు తెలియని వాళ్ళు ఎవరూ ఉండరు. ఎందుకంటే అతడు వారిల్లోని వ్యక్తి. చరిత్ర కందని విషయాల్ని, చరిత్రకారులు మర్చిపోయిన నిజాల్ని వెలికితీయడంలో దిట్ట ...

బెనర్జీ తమ ముఖాలలో భావాల్ని గమనిస్తున్నట్టు గ్రహించిన సాగర్ చటుక్కున గాజు గ్లాసు అందుకొని కాసిన నీళ్ళు తాగాడు. తర్వాత అడిగాడు "ఇవన్నీ మాకెందుకు చెబుతున్నారు?"

జస్వంత్ చుట్టూ పరికిస్తున్నాడు. ఎవరి ధోరణిలో వాళ్ళు బాతాఖానీ మాట్లాడుకొంటున్నారు.

బెనర్జీ ఆశ్చర్యంగా అడిగాడు "అదేమిటి సాగర్ అలా అంటావు మీ అంకుల్ పేరు ముఖర్జీ కదూ?"

కాసేపు ఊపిరి పీల్చడం మాని, తర్వాత సర్దుకొని చెప్పాడు సాగర్ అయిష్టంగానే "అవును."

"ఆయన మీకు తెలుసా?" ఆత్రంగా అడిగాడు జస్వంత్.

"తెలియకపోవడమేమిటి. అసలు మీరిద్దరూ ఈ బృందంతో వెళుతున్నట్టు ఆయనే చెప్పాడు."

"మేమీ బృందంతో ప్రయాణం చేస్తున్నట్టు ముఖర్జీగారే చెప్పారా?!?" ఇక ఆగలేనట్టు ఆశ్చర్యాన్ని వెళ్ళగక్కాడు జస్వంత్ — సాగర్ వారిస్తున్నట్టు కళ్ళతోనే చేస్తున్న సైగలు తనకి చేరకముందే!

బెనర్జీ కళ్ళు తళుక్కున దీపాల్లా మెరిశాయి. స్పష్టంగా అన్నాడతడు "అవును."

## 3

రాత్రి పదకొండు దాటుతోంది.

సాగర్, జస్వంత్ లిద్దరూ గుడారంలో ఓ మూలగా కూర్చుని రెండు అరచేతులంత ఉన్న కార్డ్ బోర్డ్ పేపర్ నొకదాన్ని పరిశీలిస్తున్నారు, పైన వేలాడదీయబడిన చిన్న లాంతర్ ప్రసారిస్తున్న గుడ్డి వెలుతురులో.

వాళ్ళతో పాటు ఉంటున్న మరో ఇద్దరు వ్యక్తులు గంటక్రితమే లాంతరు ఆర్పి నిద్రలోనికి జారుకున్నారు.

జస్వంత్ మాప్ లో ఎడమవయిపునుండి రెండంగుళాల ముందు ప్రదేశాన్ని చూపుతూ చెప్పాడు. "సాగర్ ఈ రోజు సాయంత్రం స్పష్టంగా చూశాను నేను—ఇక్కడ పాయింట్ చేయబడిన రెండు శిఖరాలు మన గుడారానికి అటూ ఇటూ ఉన్న శిఖరాలే....

....జాగ్రత్తగా చూడు మాప్ లో చూపబడిన శిఖరాలన్నింటిలోనూ చెట్లు వున్న శిఖరాలు రెండే వున్నాయి. వాటికి గుర్తుగా ఈశిఖరాలకు ఆకుపచ్చరంగు దిద్దబడింది. ఇందులో ఒక శిఖరం మనం చేరవలసిన గమ్యం ఉన్న చోట వుంది. అందుకు గుర్తు ఈ ఆకుపచ్చ శిఖరం క్రింద అటువైపు కూడలి ప్రదేశం, ఇటువైపు సమతల ప్రదేశం. ఈ సమతల ప్రాంతం దిగువగుండా ఉన్న ఇరుకుమార్గమే మాప్ లో బాణం గుర్తుతో గుర్తించబడింది. ప్రస్తుతం ఈ మార్గంలో నుండే మనం ప్రొసీడ్ అవ్వాలి."

సాగర్ అంగీకరించినట్టు తల వూపాడు "నువ్వు చెప్పింది కరెక్టే జస్వంత్! ముఖర్జీ అంకుల్ చెప్పినదాన్ని బట్టి, ఈ బృందం వెళ్ళే దారిలోనే మన గమ్యం చేరడానికి మార్గం తెలుస్తోంది—నిజానికి అందుకే కదా, మనం ఒంటరిగా వెళ్ళకుండా ఈ బృందంతో కలిసాం"

అన్నాడు.

"అయితే ఈ రాత్రే గుట్టుచప్పుడుకాకుండా మనం బృందంనుండి వైదొలగడం మంచిది" చెప్పాడు జస్వంత్.

ఉన్నట్టుండి చటుక్కున కదిలాడు సాగర్!! అతడు గుడారం చివర బాగ్ కి అనుకొని కూర్చున్నాడు అంత వరకూ! గుడారానికి ఉన్న చిన్న రంధ్రంలోనుండి చలిగాలి సూటిగా అతడి కుడి చెంపను కొడుతుంది అంత వరకూ.

అయితే చిత్రంగా అది సుమారు నాలుగైదు క్షణాల నుండి ఆగిపోవడమేకాక, పూర్తిగా అటునుండి గాలి వేయకపోవడంతో అక్కడ యెవరో రంధ్రంలోనుండి చూస్తున్నట్టు అనుమానించాడతడు!!

గుడారం వెలుపలికి వచ్చి నాలుగడుగులు వేగంగా ముందుకు నడిచి చూశాడు. దూరంగా యేదో ఆకారం అప్పటికే లీలగా నెమ్మదిగా చీకట్లో కలసిపోయింది!!?

"ఏమయింది?" తనూ వచ్చి అడిగాడు జస్వంత్.

"ఎవరో మన మాటలు విన్నారని అనుమానంగా ఉంది."

"మనల్ని అనుమానించవలసిన అవసరం ఎవరికి వుంది. అసలు అనుమానం కలిగే విధంగా యే కోశానా మనం ప్రవర్తించలేదు" నమ్మకంగా చెప్పాడు జస్వంత్.

"బెనర్జీ విషయం మర్చిపోతున్నావు!" సాలోచనగా అన్నాడు సాగర్.

"అతడు మనం అనుకొన్నంత ప్రమాదకారి కాదేమో!?"

"సరే! ఏదియేమయినా యెలాంటి ఆపదనయినా ఎదుర్కొనడానికి మనం సిద్ధంగా వుండాలి. ఇక నిద్ర

పోదాం. తెల్లవారుజామునే లేవాలి మళ్ళీ" అంటూ నడిచాడు సాగర్.

తెల్లవారుజామున నాలుగు దాటింది—

ఉలిక్కిపడి లేచాడు సాగర్. చుట్టూ చూశాడు. జస్వంత్ కనిపించలేదు. అతడి పెదడు శూన్యమై పోయింది. సామగ్రి అంతా అక్కడే వుంది.

ఇంతలో గుడారం కర్టెన్ తొలగించుకొని ఒక ఆకారం లోనికి వచ్చింది. సాగర్ ఏదో అనబోతుండగా "సాగర్ నాలుగు దాటింది. బయట ఎవరూ లేరు. త్వరగా రెడీ అవు!" హెచ్చరించాడు జస్వంత్.

సాగర్ ఊపిరి వదిలి ఐదు నిమిషాల్లో బధకం వది లించుకొని రెడీ అయ్యాడు. వాళ్ళిరువురుగా పడుకొన్న ఇద్దరు వ్యక్తులు గాఢ నిద్రలో వున్నారు. హేండ్ స్టిక్ అందుకొని గుడారంలో నుండి బయటికి వచ్చాడు సాగర్. అంతకుముందే తయారయ్యాడు జస్వంత్. ఇద్దరూ సామాగ్రి చేరిసగం వీపులకు బిగించుకొన్నారు.

"జస్వంత్, ఫుడ్ టిన్స్ నీ దగ్గర ఉన్నాయా" గుసగుసగా అడిగాడు సాగర్.

"వున్నాయి" చెప్పాడు జస్వంత్. చాలా అస్ప ష్టంగా వెలుతురు ఉంది బయట. ముందుకు నడిచారిద్దరూ.

ప్రతి అరగంటకు మాప్ చూసుకొంటూ దాదాపు ఎనిమిది గంటలు ప్రయాణం చేశారు.

అప్పటికే వాతావరణం కొద్ది వెచ్చబడింది. పరిసరాలు స్పష్టంగా ఆహ్లాదంగా వున్నాయి.

సాగర్ టైమ్ చూశాడు. పన్నెండు దాటింది. అప్ప టికే చాలావరకూ గమ్యం చేరారిద్దరూ.

మేప్‌లో వాళ్ళున్న పరిసరం ఎర్రటి రంగుతో సర్కిల్ చేయబడి వుంది.

## 4

"జస్వంత్ అసలా నిధి నిజంగా వుందంటావా లేక పోతే ఇదంతా పుక్కిటిపురాణం లాంటిదా?!"

జస్వంత్. సాగర్ వంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఇంత దూరం వచ్చాక నీకీ సందేహం రావడం వింతే! గురుసింగ్ వంటి మేధావి పరిశోధనలో బయల్పడిన అద్భుత రహస్యం ఇది. ఇక్కడున్న సంపద, అంకుల్ ముఖర్జీ మనకు చెప్పిన దానికంటే తక్కువ వుంటే వుండ వచ్చు—కానీ, అసలు లేకపోవడం అనేదిమాత్రం జరగ దని నా నమ్మకం."

"మనం తీసుకొన్న ఇంత రిస్క్‌కి సరైన ఫలితం దక్కాలన్నదే నా తాపత్రయం కూడా" విపరీతమైన చల్లదనానికి కమిలిపోయిన సాగర్ ముఖంలో అలసట స్పష్టంగా కనబడుతూంది. మరికొంతదూరం నడిచారు నెమ్మదిగా.

అక్కడి ప్రదేశాన్ని ఓసారి పరీక్షగా కలియ జూశాడు జస్వంత్. సాగర్ టెన్షన్‌గా చూస్తూ ఆలో చిస్తున్నాడు.

ఎత్తయిన ఓ శిఖరం పైనుండి ఎండ వేడికి మంచు కరుగుతూ నీటిధార చిన్న చప్పుడుతో క్రిందికి వస్తూంది. క్రిందికి రాగానే అది రెండుగా చీలి శిఖరం దిగువ లోయలోనికి జారిపోతూంది. ఆ లోయ అంచునే ఉన్నారు జస్వంత్. సాగర్‌లు.

వాళ్ళకు కుడివైపు బాగా ఎత్తుగా విశాలంగా పేరు కొని పోయిన మంచు తిన్నెపై గుబురుగా అల్లుకొని

పోయాయి పచ్చటి చెట్లు. సర్వ సాధారణంగా మంచు లోనే పెరుగుతాయవి

"సాగర్ అటు చూడు!!" ఆనందంతో వణికే స్వరంతో చెప్పాడు జస్వంత్.

అప్పటికే సాగర్ కనిపెట్టా డది. వెంటనే సంతోషంతో తల ఊగిస్తూ చేతిలో మాప్ ను మరోసారి చూశాడు. ఎర్రటి సర్కిల్ చేయబడిన ప్రాంతంలో కుడి వైపు మూలగా సన్నటి ఇంగ్లీష్ కేపిటల్ అక్షరాలు స్పష్టంగా వ్రాయబడి వున్నాయి 'CAVE' అని....

కాసేపాగి ఇద్దరూ నిశ్శబ్దంగా నడిచా రక్కడికి. చెట్ల గుబురు మధ్యనుండి లోపలికి చూస్తే, చీకటి నల్లరంగు పులిమినట్టుంది. చెట్లు పొదలు తొలగించుకొని కాస్త లోపలికి నడిచారు. "మైగాడ్! ఇంత చీకటా!?" అంటూ బ్యాటరీలైటు తీసి వెలిగించాడు సాగర్.

మరుక్షణం చీకటి ప్రదేశం లైటు ప్రసరించిన మేరకు వెలుగు చూసింది. నల్లటి మట్టి చెమ్మగా వుంది. మంచు కరిగిన నీళ్ళుకూడా దానికి తోడవడంతో, పైభాగానున్న మట్టిపలకలనుండి నీరు బొట్లు బొట్లుగా కారుతోంది. నేలంతా బురదగా మారుతూంది అక్కడక్కడా!!

ముందున్న విశాలమైన ప్రదేశంలో, ఇద్దరూ ఒకరి చేయి మరొకరు పట్టుకొని ముందుకి పోసాగారు. వాళ్ళ లెదర్ షూస్ దాదాపు మూడు అంగుళాలవరకూ బురదలో మునిగిపోతున్నాయి!

"సాగర్, బీ కేర్ ఫుల్! ఇలాంటిచోటే ఊబులు తయారవుతుంటాయి" హెచ్చరించాడు జస్వంత్.

ఇద్దరూ పదిహేను అడుగులు పొడవున్న ఆ ప్రదేశాన్ని అతి జాగ్రత్తగా దాటసాగారు.

సాగర్ చేతిలో లైటును గుహాంతా తిప్పసాగాడు. అతడి చేయి మెల్లగా ఆగింది! అక్కడినుండి లైటుకాంతి పడేచోట సన్నగా పొడుగ్గా వున్న సొరంగమార్గం కనిపిస్తూంది. ఇద్దరూ కొద్దిక్షణాలు ముఖముఖాలు చూసుకొన్నారు.... మెల్లగా అటు కదిలారు.

సందులా వున్న ఆ మార్గంలోనికంటా కాంతిని ప్రసరింపజేశాడు సాగర్. పొరలు పొరలుగా చీలిపోయివున్న నల్లమట్టి ప్రదేశం అదంతా. సహజసిద్ధంగా ఏర్పడినది.

ఎంతో దూరం లేదా మార్గం. ఐదారు అడుగులు నడిచేసరికి, ముందున్న ప్రదేశంపై యేదో అస్పష్టమైన వెలుతురు పడుతుందని క్రమంగా అర్థమైంది వాళ్ళకు. బ్యాటరీ లైటు వెలుతురు కాదది?!

సొరంగం మార్గం అంతమయింది. ఈసారి దగ్గరగా చూశాడు. వెలుతురు తునకలు యొక్కడినుండో వాళ్ళకెగువగా ఉన్న ప్రదేశంపై పడుతున్నాయి. లైటు ఒకసారి చుట్టూ తిప్పాడు సాగర్. ఆ కొద్దిసేపటిలోనే అదొక చిన్న గుండ్రటి ఇరుకు స్థలమని గ్రహించారు.

సాగర్ కనుబొమ్మలు ముడిపడ్డాయి. మళ్ళీ లైటుతిప్పి "జస్వంత్ చూశావా!" అన్నాడు. వింతగా ధ్వనించింది అతని కంఠం. ఆశ్చర్యకరమైన దృశ్యం చూసినవాడిలా.

జస్వంత్ ముందుకు వంగాడు.

లైటుకాంతి పడినచోట, రెండడుగుల లోతున రాతి విగ్రహం ఒకటి పాతుకొనిపోయి వుంది మట్టిలో.

లైటును కొద్దిగా కదిపాడు సాగర్. అతడికి వినిపించిందో ధ్వని—బుస్సు ...మనే ధ్వని అది.

జస్వంత్ కూడా విన్నాడది. "సాగర్!!" అంటూ

అర్చాడు కంగారుగా.

త్రుళ్ళిపడిన సాగర్ అప్రయత్నంగా వెనక్కి తంగాడు.

## 5

ఏదో గట్టిదనం వున్న మెత్తటి వస్తువు సాగర్ చేతిలో బ్యాటరీలైటును బలంగా తాకింది! చిన్న శబ్దంతో లైటు అద్దం పగిలి విరిగిపోయింది. వెంటనే ఆరి పోయిందది.

అంతా గాఢాంధకారం!! ఇద్దరూ భీతితో రెండడుగులు వెనక్కి వేసి అలాగే వుండిపోయారు కాసేపు. ఆ చీకటి ప్రదేశంలో సర్పాలు వున్నాయనే నిజాన్ని క్రమక్రమంగా జీర్ణించుకోసాగారు.

ఇద్దరికి కళ్ళు లాగుతున్నాయి ఆ చీకటికి. జస్వంత్ చూపులు వెలుగురేఖలపై పడ్డాయి. "ఓహ్....గాడ్" అప్రయత్నంగా అన్నాడు. సాగర్ చటుక్కున అటు చూశాడు. ఒళ్ళు జలదరించిందతనికి, పూర్తిగా చూడగానే!?

రాతివిగ్రహం పరిసరాలలో పైభాగంనుండి కొన్ని కాంతికిరణాలు దూసుకొని పడుతున్నాయి. వాటి అస్పష్ట కాంతిలో అనేక సర్పాలు బిరుసైన పొడలతో తాపీగా కదులుతున్నాయి!!

"కొంచెం వుంటే ప్రాణంపోను—బహుశా పైభాగాన ఎక్కడో ఓపెన్ గా ఉండివుంటుంది. అందుకే ఈ వెలుతురు" స్వగతంగా చెప్పాడు సాగర్. జస్వంత్ మాట్లాడలేదు. అతడింకా పాముల్ని క్రీగంట అసహ్యంగా చూస్తూనే వున్నాడు.

సాగర్ లైటును తడిమాడు. అద్దం రెండుగా బ్రద్దలయి పైభాగమంతా ముక్కలు ముక్కలుగా క్రిందికి

రాలిపోయి వుంది. వేళ్ళను లోపలికి పోనిచ్చి తడిమాడు. రిలీఫ్ గా నిట్టూర్చాడు. ప్రాణం లేచివచ్చినట్టయింది అతడికి.

"బల్బు పగిలిందా?" ఆత్రంగా అడుగుతున్నాడు జస్వంత్.

"లేదు" కష్టంగా చెప్పి వేళ్ళతో బల్బును అటూ ఇటూ తిప్పాడు.

చటుక్కున వెలిగింది బల్బు! కాని ఈసారి కాంతి మునుపటిలా లేదు.

ఊపిరి వదిలి చెప్పాడు జస్వంత్ "అదృష్టవంతులం" లైటు మసక వెలుతురులో అతడి ముఖంపై చెమట బిందువులు చూశాడు సాగర్.

"ఇప్పుడెలా?" భయంగా అడిగాడు జస్వంత్.

సాగర్ ఆలోచించి చెప్పాడు. "మన దగ్గర తాడు బయటికి తియ్."

జస్వంత్ మారు మాట్లాడకుండా వీపుకున్న బాగ్ విప్పి సన్నటి తాడుతీసి అందించాడు. సాగర్ తన బాగ్ లోనుండి పర్వతారోహకులు వాడే 'ఏంచర్'లాంటి సాధనంతీసి తాడుకు ముడివేశాడు.

జస్వంత్ అయోమయంగా చూడసాగాడు బ్యాటరీ లైటు అందుకొని.

"ఆ విగ్రహమే మన టార్గెట్ ను సూచిస్తూందని నా అనుమానం — ముందు దాన్ని అక్కడనుండి కదిపి తేగాని యే విషయం బయల్పడదు" చెప్పాడు సాగర్.

జస్వంత్ లైటు విగ్రహం మీదికి ఫోకస్ చేసి పట్టుకున్నాడు. కాంతి యెక్కువగా లేకపోవడంవల్ల నుసగ్గా కనబడుతూంది విగ్రహం. ఇద్దరూ కాస్త వెనగ్గా నిల

బడ్డారు ఏమైందుకయినా మంచిదని.

సాగర్ తాడును కొద్దిగా తిప్పుతూ విగ్రహంమీదికి విసరసాగాడు ఏడవసారి అతడి ప్రయత్నం ఫలించింది. విగ్రహానికి ఆశీర్వాదిస్తున్నట్లు ఒక చేయి ముందుకొచ్చి వేసుగా వుంది. ఏంకర్ సరిగ్గా అక్కడ తగులుకొంది.

"నెమ్మదిగా లాగు. వంగితే ప్రమాదం" హెచ్చరించాడు జస్వత్.

సాగర్ జాగ్రత్తగా లాగసాగాడు తాడిని. విగ్రహం కూరుకుపోయి వున్నది కేవలం నల్లమట్టిలోనే కావడంవల్ల మరికాస్త గట్టిగా లాగేసరికి, పూర్తిగా వెలుపలికి వచ్చేసిందది.

విగ్రహం బయటికి రాగానే ఇద్దరి కళ్ళూ అది కూరుకొనిపోయినచోట చుట్టుపక్కల పడ్డాయి.

వెంటనే ఇద్దరి ముఖాలు కళావిహీనం అయ్యాయి!?! అక్కడేమీ లేదు. మసక వెలుతురులో మట్టి కనబడుతుందంతే!

చేతిలో తాడును కొద్దిగా లాగాడు కదల్లేదు అది. పాముల బుసలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

సాగర్ కి ఆశ్చర్యం వేసింది. విగ్రహం అంత బరువా?!! రెండు చేతులతో బలంగా లాగాడు కొద్దిగా కదిలింది. ఈసారి ఇద్దరూ కలసి లాగసాగారు. మెల్లగా వాళ్ళ ముందుకు వచ్చిందది.

కాసేపు విగ్రహాన్నంతా తడిమారు. ఏ ఆధారం దొరకడంలేదు. హఠాత్తుగా సాగర్ చూపులు విగ్రహం కంఠంమీద పడ్డాయి. చారలా వుందక్కడ.

"జస్వత్ విగ్రహాన్ని గట్టిగా పట్టుకో కదలకుండా" అని చెప్పి విగ్రహం తల, రెండు చేతుల మధ్య బిగించి

చెప్పాడు బలంగా—ఆ భాగం మరలా తిరిగి మూతవలె మూడిపడి వచ్చేసింది.

"వా్రే!?!" ఆనందంతో ఒడలు పులకించగా అరిచాడు జస్వంత్. టార్చి వెలుతురు విగ్రహం కంఠం లోపలికి వేసి చూస్తూ.

సాగర్ శరీరం ఉద్వేగంతో కూడిన ఆనందంతో కంపిస్తూంది సన్నగా.

విగ్రహం లోపలినుండి అక్కడక్కడా మెరుస్తు న్నాయి వజ్రాలు!! కొన్ని మట్టి కొట్టుకుని వున్నాయి.

"ఫలితం దక్కింది-మనం ఇక్కడినుండి ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది" కంగారు పెట్టాడు జస్వంత్.

సాగర్ విగ్రహం తల యథావిధిగా బిగించి తాడు రెండు కొసలు రెండువైపులా వచ్చేలా చేసి బిగించి కట్టాడు. చెరోవయిపూ తాడు పట్టుకొని మోస్తూ వెలుపలికి వచ్చేశారు.

"సాగర్ బాగ్ ఒకటి ఖాళీచేసి నిధి అంతా అందులో సర్దేస్తే" అడిగాడు జస్వంత్.

వప్పుకోలేదు సాగర్. "సామానుకే బాగ్ లు చాలడం లేదు. అంతగా కావాలంటే పర్వతం దిగిపోయాక ఓ బాగ్ లో సామాగ్రితీసి అందులో సర్దేసి విగ్రహం పడేద్దాం. ఎవరికీ అనుమానం రాకుండా కూడా వుంటుంది" చెప్పాడు.

టైమ్ ఒంటి గంటన్నరవుతూంది. మిత్రులిద్దరూ విగ్రహాన్ని కాసేపు మోస్తూ కాసేపు మంచులో ఈడుస్తూ దిగుతూనా పర్వతాన్ని అవరోహించసాగారు.

క్రమంగా చీకటి పడింది—

గుడారం వేయడానికి మంచి చోటు చూసి ఆగా రిద్దరూ. కాసేపటిలో గుడారం తయారయింది. చలి గాలులు ఉధృతం అవుతున్నాయి.

నిద్రలేకపోవడం, దానికి తోడు విపరీతంగా శరీరం అలసిపోవడంవల్ల నిద్రముంచుకొనివస్తూంది సాగర్‌కి. విగ్రహం ఒక మూలగా వుంచి ఫుడ్ టిన్నులు బయటకుతీసి భోజనాలు ముగించారు. పక్కలు వేసుకుని టార్పాలిన్ దుప్పట్లు కప్పుకున్నారు గుడారం చలిగాలులనుండివాళ్ళను కాపాడటమేకాకుండా వెచ్చదనాన్ని కూడా ఇస్తూంది.

జస్వంత్ అప్పటికే ఆవలిస్తున్నాడు.

సాగర్ ఎడంచేయి ఎయిర్ పిల్లో క్రిందికి దూర్చి సుఖంగా నిద్రలోనికి జారిపోయాడు!

అలా ఎంతసేపు గడిచిందో అతడికే తెలియదు!

ఉండుండి అతడి కనురెప్పలు కొద్దికొద్దిగా తెరుచు కొంటున్నాయి!! కళ్ళు తెరవడానికి ప్రయత్నిస్తున్నాడు సాగర్ !!?

నిద్ర మత్తు అతడిపై స్వారీ చేస్తూంది. బలవంతంగా కళ్ళు తెర్చి తలవిదిలిచాడు...

హఠాత్తుగా తలగడతో పాటు అతడి చేయి పైకి లేచిపోవడంవల్ల. చటుక్కున చేయి లాక్కుని మోకా ళ్ళపై పైకిలేచి చూశాడు.

ఆశ్చర్యంతో అతడి నిద్రమత్తు వదిలిపోసాగింది. కళ్ళు పత్తికాయల్లా విచ్చుకున్నాయి.

# 6

"జ....స్వం....త్ ...." కఠినత్వం ధ్వనిస్తూ ఉరి మింది సాగర్ కంఠం, జస్వంత్ చూపులు వాడిగా

కనిపిస్తున్నాయి సాగర్ కి.

జస్వంత్ చేయి విసురుగా కదిలింది. రెండుక్షణాల క్రితమే శత్రువు చేతిలో కత్తి చూసి వుండడం చేత, చురుకుగా ప్రక్కకి కదిలాడు సాగర్.

ఎడమ భుజం క్రింద నాటుకొంది కత్తి. కీచుమని అర్చాడు సాగర్ బాధతో. రక్తంతో తడిసిపోతోంది అతడి భుజం.

జస్వంత్ రేకలా చూస్తూ వణుకుతున్న చేతులతో జేబుల్లో వెతుకుతున్నాడు.

ఆలస్యం చేస్తే ప్రాణాలు దక్కవని గ్రహించాడు సాగర్. అతడి చేతులు యంత్రంలా కదిలాయి. రివాల్వర్ ప్రత్యక్షమయింది చేతుల్లో. మరుక్షణమే పెద్ద శబ్దంతో పేలింది కూడా.

ధ్వనికి రివాల్వర్ పట్టుకొన్న సాగర్ కుడిచేయి పెద్దగా కంపించింది. ఆ వూపుకి కొద్దిగా వెనక్కి తూలాడతను.

బిగ్గరగా అర్చాడు జస్వంత్. అతడి కాళ్ళూ చేతులు చలనరహితం అయిపోయాయి. సాగర్ కి అంతా అయోమయంగా కంగారుగా వుంది. బుల్లెట్ జస్వంత్ కి ఎక్కడ తగిలిందో అర్థం కావడం లేదతడికి.

రివాల్వర్ గట్టిగా పట్టుకొని పరీక్షగా చూశాడు ముందుకి. జస్వంత్ క్రింద పడివున్నాడు. రెండు చేతులు బొడ్డు ప్రక్కన అదుముకొంటూ మూలుగుతున్నాడు. అతడి చేతుల్లో నుండి ఉబుకుతోంది రక్తం, పొట్టంతా ఎర్రగా తడిసిపోయి వుంది.

రెండో బులెట్ పేల్చే అవసరం లేదని గ్రహించాడు సాగర్!

కాసేపటికి జస్వంత్ మూలుగు ఆగిపోయింది. అతడి శరీరం నిర్జీవమయింది!!

సాగర్ తన ఎడంచేయి చిటికెనవేలికి తగులుకొని వున్న తాడును తెంపాడు. జస్వంత్ మనస్తత్వంపై సాగర్‌కి ముందునుండీ అనుమానమే. అందుకే పడుకో బోయేముందు, విగ్రహానికి కట్టిన తాడు నుండి సన్నటి పోగును కొద్దిగా లాగి చిటికెనవేలికి ముడివేసుకొని, విగ్రహం నుండి తాడును బిగుతుగా లాగి పడుకొన్నాడు.

జస్వంత్ విగ్రహాన్ని కదపడంతో ప్రత్యక్షంగా పట్టుబడిపోయాడు.

మోకాలిపై అలాగే కూర్చుని యించుమించు పావు గంట గాయానికి కట్టుకట్టుకొని, అలాగే వుండిపోయాడు సాగర్ చాలాసేపు.

చుట్టూ విశాలమయిన గాఢాంధకారం! గుడ్డిగా వెలుగుతున్న బ్యాటరీలైటు వెలుతురులో మెరుస్తున్న వజ్రాలు! కాంతులీనే బంగారం! నగలు! మరికాస్త వెలుగును సృష్టిస్తున్నాయి. వాటి ప్రక్కనే కొయ్యలా బిగుసుకున్న శవం!! వెలుతురు కొంత అస్పష్టంగా జస్వంత్ ముఖంపై పడుతోంది.

ఇక భరించలేకపోయాడు సాగర్.

రివాల్వర్ జేబులో భద్రపర్చి, శవం రెండు కాళ్ళూ పట్టుకొని గుడారం వెలుపలికి వచ్చాడు.

వణికే అతడి శరీరాన్ని గాలి చల్లగా, వేగంగా స్పృశిస్తూ మరింత వణికిస్తోంది. అతడి గుండె చప్పుడు పెరిగింది అప్రయత్నంగా!

గుడారానికి పదడుగుల దూరంలో వాలుగా మంచు కోయబడివున్న పల్లపు ప్రదేశం వుంది. శవాన్ని అక్కడికి

లాక్కొనిపోయి క్రిందికి దొర్లించాడు. పెద్ద లోతయిన పల్లపు ప్రాంతము కాదది.

జస్వంత్ శవం నాలుగుసార్లు దొర్లి ఆగిపోయింది.... కళ్ళు తెరుచుకొనే వున్నాయి! చూపులు సూటిగా సాగర్ వైపే వున్నాయి. చనిపోయే ముందు అతడి చూపులో క్రూరత్వం ఇంకా పోలేదు!!

వెన్ను జలదరించగా భారంగా నిట్టూర్చి లోపలికి వచ్చాడు సాగర్. జస్వంత్ బాగ్ లోనికి కొంత నిధి సర్దివుంది. విగ్రహం నేలమీద పడివుంది. మిగిలిన నిధి కూడా అదే బాగ్ లోనికి చేరవేసి, విగ్రహాన్ని తల బిగించి వేసి దానిని కూడా అదే పల్లంలోకి విసిరేశాడు.

భుజంపై గాయం ఉండుండి భగ్గుమంటోంది. చేయి కదలడం కష్టంగా వుంది. కట్టు మరికాస్త గట్టిగా బిగించాడు. నిద్రమత్తు ఊపుతోందతిడిని.

వడివైపుకి ఒరిగి పడుకొన్నాడు పక్కపై. నిస్సత్తువగా అలసటగా వుంది సాగర్ కి. ముందు కారిన రక్తం, ఇంకా జుబ్బపై ఆరలేదు. తడితడిగా వుంది.

కళ్ళు మూసుకొన్నా నిద్ర రావడంలేదు. జస్వంత్ శవం తనవైపే సూటిగా చూస్తున్న దృశ్యం ప్రత్యక్షమై అతడి గుండె వేగాన్ని పెంచుతోంది. కళ్ళు తెరిచాడు భరించలేక. అయినా అదే దృశ్యం!!

ఆ రాత్రి అతడికి కాళరాత్రే అయింది.

# 7

మర్నాడు రాత్రి ఏడున్నర అవుతోంది—

చీకటి మంచుపర్వతశ్రేణుల క్రిందవున్న ఆ పట్టణాన్ని చుట్టుముట్టి వుంది.

విశాలమైన వీధులలో జనసంచారం యెక్కువగా

వుంది. అన్నిచోట్లా దీపాలు వెలిగివున్నాయి. మంచు పేరుకొనిపోయి వుంది కొన్నిచోట్ల. వేళ్ళు కూడా కనబడనటువంటి వేషధారణలో ఉన్న జనం మెల్లగా సంచరిస్తున్నారు.

అక్కడున్న ప్రతి వీధిలోనూ కనీసం ఇద్దరయినా పర్వతారోహకుల దుస్తులలో వున్నారు. కాని అలాంటి వారిని అక్కడెవరూ వింతగా చూడరు. రోజూ యెన్నో బృందాలు, ఎంతోమంది టూరిస్టులు అక్కడికి రావడం బస చేయడం మామూలే!

ఒకచోట రోడ్డుపై ఎత్తుగా 'ఎంబ్రాన్ లాడ్జి అండ్ హోటల్' అని నీలంరంగు లైట్లతో సొగసుగా అమర్చబడి వుంది. అతి ఖరీదయిన హోటల్ అది. అందులో నాలగవ అంతస్తులో, మూటరెండు నెంబర్ గల గదిలో, ఎరుపు తెలుపు మిళితమైన కాంతిగల పల్చటి లైటు వెలుతురు ఆ గదికి సంబంధించిన నాలుగు విశాలమైన అద్దాలపై పడి వింతగా మెరుస్తోంది.

ఆ గదిలో హీట్ రూమ్‌లో వెచ్చటి పరుపుపై హాయిగా పడుకొని వీడియోలో బ్లూఫిల్మ్ చూస్తూన్నాడు సాగర్! చేతిలో పొట్టిగా గుండ్రంగా వున్న గాజు గ్లాసులోని ద్రవాన్ని తాపీగా తాగుతున్నాడు. అంతక్రితమే డాక్టర్ వచ్చి అతడి చేతికి కట్టుకట్టి, ఇంజెక్షన్ ఇచ్చి వెళ్ళాడు.

హీటర్ లీలగా శబ్దం చేస్తోంది. సాగర్ మౌనంగా ద్రవాన్ని సిప్ చేస్తూ చూస్తోన్నాడు ఫిల్మ్‌ను. గ్లాసులోని ద్రవం కానీ బ్లూఫిల్మ్ కానీ తమ ప్రభావాన్ని అతడిపై యేమాత్రం చూపలేకపోతున్నాయి. బాగ్‌లో దాచిన సంపద చుట్టూనే అన్యమనస్కంగా తిరుగుతున్నాయి,

అతడి ఆలోచనలు.

చేతిలో గ్లాసు టేబుల్ పై వుంచి ఫోన్ రిసీవర్ ఎత్తి యేదో నెంబర్ తిప్పాడు.

కాసేపు నిశ్శబ్దం.

అవతల చప్పుడయింది. ఎవరో రిసీవర్ యెత్తారు బహుశా ముసలి నౌఖరు అలీ అయ్యుంటాడు.

వెంటనే అడిగాడు "హలో .... ముఖర్జీ గారు వున్నారా?"

కాసేపాగి కంఠం వినిపించింది. "తమ రెవరు బాబూ?"

'వాడే, నౌఖరు అలీ' అనుకొన్నాడు సాగర్, జాగ్రత్తగా గొంతు, భాష గుర్తుపట్టి.

"ముఖర్జీ గారుంటే పిలువ్" అసహనం ధ్వనించేలా చెప్పాడు.

బాగా దూరంనుండి మాట్లాడడంవలన అలీ తనను గుర్తుపట్టలేకపోతున్నాడని గ్రహించాడు సాగర్.

"ఆయన లేరు బాబూ!"

"ఎక్కడికి వెళ్ళారు?"

"పోలీసులు అరెస్టు చేసి తీసికెళ్ళిపోయారు బాబూ...."

ఊపిరి పీల్చడం ఆపాడు సాగర్. అతడి కనుబొమ్మలు దగ్గరయ్యాయి.

"ఎప్పుడు?" అతడి స్వరంలో ముందున్న గాంభీర్యం లేదు.

"ఐదురోజులు అవుతుంది బాబూ— ఇంతకీ తమ రెవరు బాబూ!?"

"ఐదురోజులవుతుందా!" స్వగతంగా అనుకొన్నాడు

సాగర్. "పోలీసులు వస్తోన్నారా ఇంటికి, వెతుకు తున్నారా ఇల్లు."

"అవును బాబూ! ఎవరయినా ముఖర్జీ బాబు గురించి అడిగితే వాళ్ళు యేమేం మాట్లాడేరో చెప్పమని కూడా చెప్పారు బాబూ నాకు."

"అంటే ఇప్పుడు నే నడిగినదంతా చెపుతావా పోలీసులకు!"

"అందుకే కదా బాబూ మీ రెవరని అడుగుతు న్నాను. చెప్ప...."

మెల్లగా రిసీవర్ క్రెడిల్ చేశాడు సాగర్. వేళ్ళతో నుదుటిమీద గట్టిగా రాసుకొంటూ ఆలోచిస్తూ వుండి పోయాడు చాలా సేపు.

ఐదురోజుల క్రితమే ముఖర్జీ గారిని అరెస్టు చేశారంటే తాము బయలుదేరిన మర్నాడే ఆయన పోలీసులకు దొరికి పోయాడన్నమాట. తమ గురించి కూడా పరిశోధన జరుగుతోందని మెల్ల మెల్లగా అవగాన అయింది అతడికి.

పోలీస్ డిపార్టుమెంట్ చురుకుదనానికి కొద్ది భయం వేసింది సాగర్ కి. అకస్మాత్తుగా అతడికి బెనర్జీ గుర్తొచ్చాడు. అతడు డిపార్టుమెంటుకు సంబంధించిన వ్యక్తి కావచ్చునేమో అని అనుమానం కూడా వచ్చింది.

అంకుల్ ముఖర్జీ పోలీసులకు దొరికిపోయాడు. అతడి పాట్లేవో అతడు పడతాడు. ప్రస్తుతం తను చేయవలసిన పని నిధిని కాష్ గా మార్చడం. తనను యే పోలీసులు అనుమానించని, గుర్తించని ప్రాంతానికి వెళ్ళిపోయి కోటీశ్వరుని గా స్థిరపడగలిగితే తనను మించిన అదృష్ట వంతుడు లేడు!!

# 8

వీడియో ఆఫ్ చేసి పక్కనున్న ఇంటర్ కమ్ నొక్కాడు. అతడు రూమ్ నెంబర్ చెప్పవలసిన అవసరంలేదు. ప్రతీ రూమునుండి సెపరేట్ గా ఇంటర్ కమ్ కనెక్షన్స్ వుంటాయక్కడ.

“యస్ సర్!” మృదువుగా వినిపించింది ఓ స్త్రీ కంఠం.

“మేడమ్! సర్వెంటుని పైకి పంపండి, లగేజ్ వుంది. నేను బయటికి వెళ్ళాలి” ఇంగ్లీషులో చెప్పాడు.

“వన్ మినిట్ సర్!” వినయంగా చెప్పింది.

అతడు రెడీ అవుతూండగా సర్వెంట్ వచ్చాడు. సాగర్ సోఫా ప్రక్కన దళసరి క్లాత్ తో తయారు చేయబడిన ఎర్ర పువ్వులున్న బాగ్ చూపించాడతడికి.

సర్వెంట్ బాగ్ అతి కష్టంమీద పైకెత్తాడు. బాగ్ పట్టుకొన్న వైపు ఒరిగిపోయి నత్తలా నడుచుకొంటూ వెళ్ళిపోయాడు. పాత బాగ్ ఒకటి రెండుచోట్ల ఓపెన్ గా కనబడడంతో దానికంటే కొద్ది పెద్దసైజు పువ్వుల బాగ్ తెప్పించి దానిపై కవరులా తొడిగాడు సాగర్.

ఐదునిమిషాల్లో ఖరీదైన సూట్లో రెడీ అయి కుడివైపు జేబు తడుముకొన్నాడు ఓసారి!

అంతకు ముందే ఐదు వజ్రాలు విడిగా తీసి జేబులో ఉంచుకొన్నాడతడు. రూమ్ లాక్ చేసి బయటికి నడిచాడు.

లిఫ్ట్ లో క్రిందికి వచ్చాడు సాగర్. టాక్సీలో బాగ్ వుంచి అక్కడే నిలబడి వున్నాడు సర్వెంట్.

సాగర్ కి తెలుసు బాగ్ టాక్సీలో చేర్చడానికి సర్వెంట్ ఎంత కష్టపడి వుంటాడో. ఇద్దరు మోయ

తలపిన బరువు అది.

టాక్సీలో కూర్చుంటూ, కొన్ని నోట్లు సర్వెంట్ చేతిలో పెట్టాడు సాగర్. సర్వెంట్ కళ్ళు చిరునవ్వు నవ్వుతున్నాయి.

డోర్ వేస్తూ చెప్పాడు డ్రైవరుకి "జ్యూయలరీ సెంటరుకి పోనీ—"

వేగంతో కదిలింది టాక్సీ.

సాగర్‌కి కొంత బాధగా వుంది. తను డబ్బు ఎక్కువగా ఖర్చుపెట్టేసున్నానని. లాడ్జిలో రూమ్‌కి రెండు వేలు అడ్వాన్స్ కట్టాల్సి వచ్చింది. జైపూర్ నుం యిక్కడికి రావడం లాంటి ఖర్చులకు అంతే లేదు; చాలా అయింది.

ఇంకొంత, నిధి క్యాష్‌గా మారితే తన బాధ దూది పింజెలా ఎగిరిపోతూంది. అప్పుడు తనపని మంచినీళ్ళలా ఖర్చుపెట్టడమేగా డబ్బుని. వచ్చే డబ్బుని ఏం చేయాలా? ఎలా ఖర్చు పెట్టాలా? అని చాలా సేపటివరకూ తలమునకలుగా ఆలోచిస్తూ ఉండిపోయాడు సాగర్.

కాసేపాగి చెప్పాడు. "డ్రైవర్! ఈ సిటీలో మంచి జ్యూయలరీ షాపు దగ్గర ఆపు."

డ్రైవరు చూశాడు కొద్దిగా వెనక్కి తలతిప్పి. తెల్లగా విశాలంగా ఉందండి ముఖం. కళ్ళు ఎర్రగా కాగినట్టున్నాయి. మీసం చివర్లు ఎర్రగా పండి మెలితిరిగి వున్నాయి. తలమీద టోపీ.

సాగర్ నిశ్శబ్దంగా చూశాడు డ్రైవరు వంక.

"జీజీగారి షాపు ఈ సెంటర్లో బాగా సౌకర్యంగా వుంటుంది సార్ అన్నిటికంటే—పైగా అన్నీ ఖచ్చితంగా న్యాయంగా ఉంటాయంటారు!"

ఇక ఆలోచించలేదు సాగర్. "వెరీగుడ్. అక్కడికే పోనీ" చెప్పాడు ఉషారుగా.

పదినిమిషాల ప్రయాణం.

విశాలమైన వీధుల్ని ఎత్తైన ఖరీదైన అద్దాల భవంతుల్ని, నేల ఈనినట్టున్న జనసందోహాన్ని, సిమెంట్ ప్లాట్ ఫారాలపై, అక్కడక్కడా గుట్టలుగా ఉన్న మంచుని క్లీన్ చేస్తున్న వ్యక్తుల్ని ఆసక్తిగా గమనించాడు సాగర్.

టాక్సీ ఒక భవంతిముందు ఆగింది. ఫేర్ మీద మరో నోటు యెక్కువగా చెల్లించాడు సాగర్. డ్రైవరు కృతజ్ఞతగా చూశాడు.

బాగ్ బరువును పళ్ళబిగువున మోస్తూ లోపలికి నడిచాడు.

ద్వారంపై 'జీ. జ్యూయలర్స్' అనే అక్షరాలు యెప్పుడో కొన్ని సంవత్సరాల క్రితం వ్రాసినట్టు ఉన్నాయి.

# 9

"రండి సాబ్ రండి! ఆ బాగ్ అలా ఉంచి సుఖంగా కూర్చోండి" సహజమైన నేర్పుతో హిందీలో ఆహ్వానించాడు లావాటి వ్యక్తి.

అతడి చుట్టూ చిన్నా పెద్దా అద్దాల చెక్కపెట్టెలు పద్ధతిగా అమర్చి ఉన్నాయి. వాటిల్లోంచి వెండి బంగారు వస్తువులు వింత శోభను వెదజల్లుతున్నాయి. గది ఇరుకుగా ఉంది.

తెల్లపంచె కొద్దిగా మాసి నలిగిన బనియన్, దబ్బపండు రంగు శరీరాన్ని మోస్తూ సాగర్, బాగ్‌ను అనుకొని కూర్చుని "మిస్టర్ ...." అన్నాడు.

"వసంత్ జీ బసంత్ జీ" అన్నాడు లావాటి వ్యక్తి నవ్వుతూ. అతడి చూపులు వేటికోసమో ఎదురుచూస్తున్నాయి!!

"మిస్టర్ వసంత్ జీ బసంత్ జీ! నేను కొన్ని వజ్రాలు చూపుతాను. మీరు వాటికి న్యాయమైన ధర చెప్పాలి— అలా చెప్తే వాటిని మీకే అమ్మేస్తాను" జేబులో చెయ్యి పెట్టాడు సాగర్.

సంభాషణ హిందీలో నే సాగుతోంది.

జీజీ ముఖంలో ఆశ కనబడలేదు. "భలే ఆనందం. చూపించండి, చెబ్తాను" చురుకుగా కదిలి భూతద్దం, సాన రాయి అందుకొన్నాడు.

ఐదు వజ్రాలు గుప్పెటతో తీసి జీజీ చేతిలో పోసాడు సాగర్. వాటిని ముఖమల్ గుడ్డ అమర్చిన చిన్న బల్లపై ఉంచి, భూతద్దంతో పరీక్ష చేయసాగాడు జీజీ.

వాటి కాంతిని పరవశంగా చూస్తూ వచ్చే డబ్బును అంచనా వేసుకొంటున్నాడు సాగర్. అతడి హృదయంలో ఆనందపు వెల్లువ సముద్రంలా ఉప్పొంగుతోంది.

సరిగ్గా నిమిషన్నర గడిచింది. జీజీ కొద్దిగా తలెత్తి వినయపు ముసుగు తొలగించి చెప్పాడు "వ్ చ...." అని ఆగి—"షోగ్గా వచ్చేరే పెద్ద!? డమ్మీ వజ్రాలివి!!"

కాసేపటికి గానీ అర్థం కాలేదు సాగర్ కి అత దేమంటున్నాడో "ఏమిటీ??" అన్నాడు.

"ఈ వజ్రాలు నకిలీవి" చెప్పాడు జీజీ పెద్దగా.

సాగర్ చేతులు వణుకుతున్నాయి. అన్యమనస్కంగా ముఖంపై చెమటలు తుడుచుకొంటూ "ఇవన్నీ పరీక్ష చేయండి" అని, బాగ్ విప్పి తప్పగా అతడి ముందు పోసాడు.

"బాప్ రే!?!" మూలిగాడు జీత్. నగలు బంగారం వజ్రాలు, వాటి కాంతిని వెర్రివాడిలా చూస్తూ.

"ఊఁ....పరీక్షించండి" గద్దించాడు సాగర్. జీత్ కంగారుగా సానరాయి అద్దం అందుకొని, ఒక్కో వస్తువూ ముందుకు లాక్కొని చూడసాగాడు.

ఇంతలో సాగర్ కళ్ళను ఓ వస్తువు ఆకర్షించింది. నగలమధ్య ఇరుక్కున్న కాగితం అది! చటుక్కున తీశాడు దానిని. ఏదో గజిబిజిగా వ్రాయబడి ఉంది దాని మీద!! చదవసాగాడు ...

అందులో ఇలా ఉంది—

"మిస్టర్ సాగర్,

నేను 'జెర్రీ'ని—శ్రద్ధగా చదువ్—ప్రొఫెసర్ గురుసింగ్ మా నాన్నగారు అకుంఠిత దేశభక్తుడాయన. డిజియానా పై నిధి ఉన్నటు ఆయన చరిత్ర శోధనలో బయల్పడింది. ఆ రహస్యాన్ని ఆయన ఏమాత్రం స్వార్థ తత్వం లేకుండా ప్రభుత్వానికి తెలియపర్చాడు.

డిజియానా భారత సరిహద్దు లోపలికే ఉండడంతట అది మనదేశానికే చెందుతుంది. సి.బి.ఐ., నిధికోసం వెదికే లోగా, మా నాన్నగారి స్నేహితుడు వృద్ధుడూ, మేక వన్నె పులి అయిన మీ అంకుల్ ముఖర్జీ ప్రేరేపణతో నువ్వు, జస్వంత్ మా నాన్నగారిని హత్యచేసి, రహస్యాన్ని దొంగిలించారు ...

ఆ వార్త తెలిసి స్టేట్స్ నుండి వచ్చిన నేను ముఖర్జీ ముసుగు లాగి విచారణ జరిపించాను. బహుశా వాడికి యావజ్జీవ శిక్ష పడవచ్చు. మిమ్మల్నీ చట్టానికి పట్టించ వచ్చు! కాని చట్టం శిక్ష వేసినంత మాత్రాన నా హృదయ క్షోభ చల్లారుతుందా? అందుకే మిమ్మల్ని వెంటాడాను.

నాన్నగారు నిధి రహస్యం కనుగొన్నప్పుడు, అది కనుక్కొన్న ప్రాచీన గ్రంథం నుండే ఆ నిధి ఏ రూపంలో ఉందో చూసి డిటైల్స్ వ్రాసుకొన్నారు. ఆ కాగితం నాన్నగారి గదిలో నాకు లభించింది. దాని ప్రకారం ఆర్టిఫిషియల్ వజ్రాలు, బంగారం, నగలు చీకటి బజారులో సంపాదించాను. మీరు ఖచ్చితంగా డిజియానా పర్వతం దగ్గరకే వెళతారు కాబట్టి నేనూ అక్కడికే వచ్చాను....

సి.బి.ఐ, పరిశోధనలో ముఖర్జీ ఇంటిలో దొరికిన మీ ఇద్దరి ఫోటోలు స్పష్టంగా చూశాను. ఆ ఆధారంతో నే పాల్కే బృందంలో చేరిన మిమ్మల్ని గుర్తించాను. నేనూ బృందంలో చేరాను. ఆర్టిఫిషియల్ నిధి నాతో పాలే పర్వతంపైకి తెచ్చాను....

ఆ రోజు రాత్రి మీరు బృందంనుండి వైదొలగాలను కోవడం గమనించి, నేనూ మిమ్మల్ని ఫాలో అయ్యాను.

నువ్వు. జస్వంత్‌ను చంపడం చూశాను. నువ్వాపడుకో గానే మత్తుమందు స్ప్రే చేసి నిన్ను స్పృహ పోగొట్టాను. నా బాగ్‌లోని ఆర్టిఫిషియల్ నిధి నీ బాగ్‌లోనికి మార్చాను. (ఈ కాగితం కూడా అప్పుడే పెట్టాను.) అసలు నిధి నా వెంట తెచ్చి పోలీసులకు స్వాధీనం చేస్తున్నాను—నువ్వు ఇది చదివేటప్పటికి నీ కోసం పోలీసుల వేట ప్రారంభమవుతూంది-కాచుకో!!

— నీ శత్రువు, బెనర్జీ."

# 10

"ఊహు....ఏం లాభంలేదు. ఇంచుమించు అన్నీ చూసేశాను. ఒక్కటీ నిజమైందిలేదు. ఈ పెంటంతా గొప్ప నిధిలా తెచ్చారేమిటీ!!" అడుగుతున్నాడు జీజీ.

అతడి కంఠంలో విసుగు, కోపం.

నిశ్శబ్దంతో కూడిన నిరాశతో మూగబోయి చూస్తున్నాడు సాగర్.

మౌనంగా అన్నీ బాగ్‌లో కూరేసి చెప్పాడు జీజీ "వెళ్ళండి ఇక."

గొంతు పెగల్చుకొని అడిగాడు సాగర్ హీనస్వరంతో, "మరి.... ఇవి ఇంత కాంతిగా మెరుస్తున్నాయేమిటి?!"

విసుగ్గా చూసి తప్పదన్నట్టు చెప్పాడు జీజీ. "బ్లాక్ మార్కెట్లలో అమ్మే ఆర్టిఫిషియల్‌వి ఇవి—నిజం వాటి కంటే, కాస్త మెరుపు ఎక్కువ ఉండేలాగానే తయారు చేస్తారు వీటిని!"

సాగర్ బాగ్ అందుకొని శూన్యంగా నడుస్తూ వెలుపలికి వచ్చి ప్లాట్‌ఫారం మీద నిలబడ్డాడు. అతడి ఎడం చేతిలో జెర్రీ వ్రాసిన కాగితం రెపరెపలాడుతోందింకా.

అతడి కళ్ళల్లో అంతులేని ఆశాభంగం. రెండు హత్యలు చేసినటువంటి రిస్కు! వారం రోజుల నిర్విరామ శ్రమ. ఫలితం శూన్యం!? నిరాశ నిస్పృహలు అతడి కళ్ళల్లో పోటీ పడుతున్నాయి!!

కాసేపటికి—

అతడి పెదాలపై చిరునవ్వు! నిర్లిప్తతతో కలిసినదది. రోడ్డు రద్దీగా ఉంది. చలిగాలి వేగంగా వీస్తూంది. పెద్ద పెద్ద వాహనాలు వేగంగా బరువుగా సాగిపోతున్నాయి.

కాగితం కాసేపు రెపరెపమని గింజుకొని, సాగర్ చేతిలోనుండి విడిపించుకొని ఎగిరిపోయింది తన పని అయిపోయినట్లుగా.

రోడ్డుమీద పోయేవాళ్ళు కొంతమంది, పిచ్చివాడిలా బిగ్గరగా నవ్వుతున్న సాగర్ వంక వింతగా చూస్తూ

పోతున్నారు. క్రమంగా అతడినవ్వు వికృతంగా మారుతూంది!?!

మెరుపులా కదిలాడు సాగర్. క్రింద ఉంచిన బాగ్ జిప్ లాగి అందులో సంపదనంతా, బాగ్ గట్టిగాపట్టుకొని ఊపుతూ జల్లేశాడు. చెల్లాచెదురుగా ప్లాట్ ఫాంమీద రోడ్డుమీద పడ్డాయి డమ్మీ వజ్రాలు! నగలు! బంగారం!!

చాలామంది జనం అది పడినచోట పెద్ద గోలగా మాట్లాడుకొంటూ ఏరుకొంటున్నారు. నాలుగైదు క్షణాల్లో పరిస్థితి గందరగోళంగా మారింది. ఒకరినొకరు తోసుకొంటున్నారు.

దూరం నుండి. ఇద్దరు కానిస్టేబుల్స్ విజిల్స్ వూదుతుంటూ పరుగెత్తుకొని వస్తున్నారు.

పిచ్చిగా నవ్వుతూ నే వేగంగా దూసుకొని పరుగెట్టాడు సాగర్ రోడ్డుమీదికి—

గుండ్రటి పొడవయిన ఆయిల్ టాంక్ మోసుకొని వస్తూన్న లారీ, కీచుమని బ్రేక్ పడుతూండగా మరి కాస్త ముందుకి వచ్చి ఆగిపోయింది. దాని ముందు చక్రాల క్రింద పడున్నాడు సాగర్. అతడి చుట్టూ రక్తం మడుగు కడుతూంది.

శేఠ్ షాపులోనుండి ఆదరాబదరా పరిగెట్టుకొని వస్తున్నాడు.

ఎవరో వ్యక్తి పబ్లిక్ బూత్ లోనుండి పోలీసులకు ఫోన్ చేస్తున్నాడు.

మృతుడైన సాగర్ పెదవుల చివర్ల నుండి ఓ రక్తపు చుక్క క్రిందికి జారి, అతని తల ప్రక్కనే పడి ఉన్న ఓ డమ్మీ వజ్రంపై పడి ఎర్రగా కప్పేసింది....

—: అయిపోయింది :—

# పులి పంజాలు

## సుంకరి రాంప్రసాద్

గూడెం గుప్పుమంది.

కట్టెలు కొట్టడానికి వెళ్ళిన సింగడు పులివాత పడ్డాడన్న వార్త కార్చిచ్చులా గూడెంలో వ్యాపించింది.

చెట్టంత కొడుకును పోగొట్టుకున్న గంగమ్మ గుండె చెరువయ్యేలా ఏడుస్తుంది.

'ఎక్కడ? ...ఎక్కడ?'

'ఎలా? ...ఎలా?'

జనంలో ఒకటే గుస, గుసలు

"కొండ మొగల సీతిమ్మారి సెరువుకాడ." అన్నాడు లింగడు ఆయాసంతో వగరుస్తూ.

అడవిలో చెరువు ఒడ్డున సింగడి శవాన్ని చూసి.... భయంతో గూడెంకు పరుగెత్తుకొని వచ్చాడతడు.

సింగడి తల్లి గంగమ్మను తీసుకుని, మొగాళ్ళంతా చెరువు దగ్గరకు బయలుదేరారు.

మల్కానగిరి పోలీస్ స్టేషనుకు కబురు పంపించి, సింగడి

శవాన్ని చూడటానికి తను కూడా బయలుదేరాడు గూడెం నాయకుడు రామన్నదొర.

లింగడు ముందు నడుస్తూ దారి చూపిస్తున్నాడు. అంతా అడవిలోనికి ప్రవేశించారు.

తుఫాన్ వెలిశాక ప్రశాంతంగా ఉండే సముద్రంలా నిశ్శబ్దంగా ఉంది అడవి.

పులీ, సింహమూ లాంటి క్రూరమృగాలు వేటకు బయలుదేరినప్పుడు, వాటి వాసననూ, వాటి భారీ శరీరపు అడుగుల సవ్వడినీ గ్రహించి, అడవిలోని పశు పక్ష్యాదులన్నీ సద్దు చేయకుండా తమ, తమ నెలవుల్లో దాక్కుంటాయి.

అడవిలో ఎప్పుడైతే అలాంటి సహజమైన నిశ్శబ్దం నెలకొని ఉందో, ఏదో క్రూరమృగం ఆ పరిసరాల్లో సంచరిస్తుందని గ్రహిస్తారు ఆటవికులు.

అడవుల్లో పుట్టి, అడవుల్లో పెరిగే వారికి యిలాంటి వన్నీ అలవాటే. ఆ అసహజమైన వాతావరణాన్ని గమనించాడు రామన్నదొర.

అతడు చేసైగ చేయగానే, నడుస్తున్న ఆటవికులంతా టక్కున ఆగిపోయారు.

“మెకం ఈడే మసలుతున్నట్లుండాది. కొమ్ములూ, డప్పులూ పైకి తీయండి. ఈ టెగాళ్ళ పక్కల కాపు కాయండి” అన్నాడు దొర.

నాయకుని ఆజ్ఞ ప్రకారం వారంతా జట్లు, జట్లుగా విడిపోయారు.

అంతలో ....గుండెలు జలదరించేలా, అడవి మార్మోగేలా పెద్దపులి గాండ్రిపు వినిపించింది వారికి. భయంతో

వణికిపోయారు వారు. కలవరంగా చుట్టూ చూసారు.

కాని, మరుక్షణం సహజంగా వారిలో జీర్ణించుకు పోయిన వేట ప్రవృత్తి వారిని మామూలు మనుషులను చేసింది.

కొమ్ము బూరలనూ, డప్పులనూ మ్రోగిస్తూ కొందరు ముందు నడిచారు. చేతులలోని ఈటెలను బారు చేసి, నలు దిక్కులా జాగ్రత్తగా చూస్తూ కొందరు బాటకు ఇరు వైపులా రక్షణ కవచంలా ఏర్పడ్డారు. వారి వెనుక విండ్లకు బాణాలను సంధించి సిద్ధంగా నిలబడ్డారు మరి కొందరు, వారి మధ్య మిగిలినవారు నడిచారు.

వారు చేస్తున్న శబ్దాలకు అడవి మార్మోగిపోయింది. కుందేళ్లూ. లేళ్ళు లాంటి చిన్న జంతువులు భయంతో తమ నెలవులను వీడి కకావికలై పరుగెత్తసాగాయి.

పులిలాంటి క్రూరమృగాలు సైతం ఆ శబ్దాలకు దూరంగా పారిపోతాయని వారికి తెలుసు. వారి తాపత్రయమంతా తమను తాము రక్షించుకోవడం మాత్రమే కాదు. తమ అండా సింగని శవాన్ని ఆ క్రూరమృగం పాలవకుండా రక్షించడం కూడానూ.

వారు అలా పెద్దగా శబ్దాలు చేసుకుంటూ సీతమ్మ చెరువును సమీపించారు.

చెరువు ఒడ్డున వెల్లకిలా పడివుంది సింగడి శవం. పోలీసులు వచ్చేసంతవరకూ ఆ శవాన్ని ఎవరూ తాకవద్దని, ఆ శవం దరిదాపులకు కూడా వెళ్ళవద్దని శాసించాడు రామన్న దొర. శవానికి నూరు గజాల దూరంలో అంతా ఒక వలయంలా ఏర్పడి కూర్చున్నారు.

మామూలుగా అయితే ఆ ఆటవికులు అంత జాగ్రత్తగా వ్యవహరించేవారు కారు.

అయితే ఈ మధ్య వారి గూడెంలో ఒక యువతి ఆత్మహత్య చేసుకుంది. శవ పంచాయితీ జరపడానికి వచ్చిన మల్కానగిరి సబ్ ఇన్‌స్పెక్టర్ ఉదయకుమార్ గూడెం వాసులందరినీ సమావేశ పరిచాడు.

ఇక ముందు ఆ గూడెంలో ఎలాంటి అవాంఛనీయ సంఘటన జరిగినా తనకు ముందుగా తెలియజేయమనీ, తాను వచ్చినంతవరకూ ఆ శవం పరిసరాలకు కూడా ఎవరూ వెళ్ళకూడదనీ వారికి చెప్పాడు.

నాగరికత ఎరుగని ఆ ఆటవికులకు పోలీసులంటే సింహ స్వప్నమే అందులో ఇన్‌స్పెక్టర్ దొర ఒకమాట చెప్పాక, దానిని జవదాటే ధైర్యం ఎవరికుంటుంది?

ఇన్‌స్పెక్టర్ రాకకోసం ఎదురు చూస్తూ వారు అలానే కూర్చున్నారు.

## 2

జీపులోనుండి హుందాగా క్రిందకు దిగాడు ఉదయ కుమార్. అదే సమయంలో వారికి కొద్ది అడుగుల దూరంలో సర్ర్ మంటూ దూసుకు వచ్చి ఆగింది మరో జీపు. అందులోనుండి దిగుతున్న శివప్రకాశ్ వంక సాదరంగా చూశాడతడు.

శివప్రకాశ్ మల్కానగిరి రిజర్వ్ ఫారెస్టు ఆఫీసరు. ముప్పయిఅయిదేళ్ళ బ్రహ్మచారి అతడు.

"హల్లో శివప్రకాశ్ గారూ! మీరూ వచ్చేసారా? ఇంకా మీ కోసమే కబురు పంపుదామనుకుంటున్నాను" శివప్రకాశ్‌తో కరచాలనం చేస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఉదయకుమార్.

"నాకూ ఈ వార్త ఇప్పుడే తెలిసింది ఇన్‌స్పెక్టర్."

"సింగడ్ని చంపిన పులి మాన్ ఈటరే నంటారా?"

"కావచ్చు. సాధారణంగా పులి మాన్ ఈటర్ గా మారకుండా మనుషులపై దాడి చేయదు. కాని, నాకు తెలిసినంతవరకు మన మల్కానగిరి ఫారెస్టులో మాన్ ఈటర్స్ లేవు."

"అంటే ఇది పై అడవుల నుండి వచ్చిన పులి అంటారా?"

"కావచ్చు ఇన్ స్పెక్టర్! ఈ మాన్ ఈటర్స్ చాలా చాలా తెలివిగా వ్యవహరిస్తాయి. ఒక రోజు ఒక ప్రదేశంలో వేటాడితే, మరునాడు మరో దిక్కులోని కొన్ని మైళ్ళ దూరంలో తమ ఎర కోసం మాటువేస్తాయి. ఒక్కొక్కసారి కేవలం ఒక్కరోజులో ఇవి ఏభయి, అరవై మైళ్ళ దూరం ప్రయాణించినా మనం ఆశ్చర్యపోనవసరం లేదు."

శివప్రకాశ్ మాటలకు చిన్నగా తల పంకించాడు ఇన్ స్పెక్టర్. వారు నెమ్మదిగా నడుచుకుంటూ శవాన్ని సమీపించారు. వారిని చూసి గౌరవంగా లేచి నిలబడి నమస్కరించారు ఆ ఆటవికులు.

ఇన్ స్పెక్టర్ మోకాళ్ళమీద వంగి శవాన్ని పరీక్షించసాగాడు.

అత్యంత బీభత్సంగా ఉంది ఆ శవం ఆకారం. శరీరం అంతా రక్తసిక్తం అయివుంది. పులి పంజాతో కొట్టడం వలన పైకి ఊడివచ్చిన కండలు, వాడిగోళ్ళు గీచుకోవడం వలన ఏర్పడ్డ రక్తపుచారికలు....అతడి శరీరం అంతా ఒక రక్తపుముద్దలా ఉంది.

చుట్టూ ఉన్న నేలను పరిశీలనగా చూశాడు. నేల మీద పులి పంజా గుర్తులు, మనిషి పాదాల గుర్తులు అన్నీ కలసిపోయి చిందర, వందరగా ఉన్నాయి.

పులికీ, మనిషికీ జరిగిన భీకర పోరాటానికి సాక్ష్యంలా ఉంది ఆ ప్రదేశం.

ఇక అక్కడ తాను చేయగలిగింది ఏమీ లేదు. శవాన్ని ఆ గూడెం వాళ్ళకు అప్పగిస్తే సరిపోతుంది. ఆ మాన్ ఈటర్ విషయం ఫారెస్టు ఆఫీసరు చూసుకుంటాడు.

పాలోచనగా తల పంకిస్తూ, వెను తిరిగి రెండడుగులు ముందుకు వేసాడు. ఎందుకో యధాలాపంగా చెరువు వంక చూసాడు.

చెరువు ఒడ్డున బురదలో స్పష్టంగా కన్పిస్తున్న బూట్ల గుర్తులను చూడగానే అతడి కళ్ళు విచిత్రంగా మెరిసాయి.

అతడు దగ్గరకు వెళ్ళి చూశాడు. చెరువు ఒడ్డు నుండి అడవిలోనికి ఎవరో నడుచుకుంటూ వెళ్ళినట్లు ఉన్నాయి ఆ బూట్ల గుర్తులు. అవి అంబాసిడర్ షూ గుర్తులు.

ఆ అడవిలో అంబాసిడర్ షూలను ధరించేది అతడూ, శివప్రకాశ్. ఆ ఇద్దరే. ఇన్ స్పెక్టర్ ఆ చెరువు దగ్గరకు రావటం అదే మొదటిసారి. మిగిలింది శివప్రకాశ్.

అతడు శివప్రకాశ్ వంక చూసాడు.

ఫారెస్టు ఆఫీసర్ శివప్రకాశ్ నేలమీదకు వంగి వున్నాడు. జేబులోనుండి చాకును తీసి, పులి పంజా గుర్తు ఉన్నమట్టిని పెళ్ళలా పెకలించి జాగ్రత్తగా పైకితీశాడు.

శివప్రకాశ్ చేస్తున్న పనిని చూడగానే ఇన్ స్పెక్టరు మెదడులో బల్బు వెలిగినట్లయింది.

"ఈ పంజాల గుర్తుల ఆధారంతోనే మేం పులికోసం అన్వేషించాల్సి ఉంటుంది."

ఇన్ స్పెక్టరు వంక నవ్వుతూ చూస్తూ చెప్పాడు శివ

ప్రకాశ్.

ఇకనుండీ అతని పని ప్రారంభమవుతుంది. ఆ గుర్తులను ఫోటో తీయించి, ఆ పంజా కొలతలనుబట్టి, పంజా భూమిలో చొచ్చుకున్న లోతునుబట్టి ఆ పులి ఆకారాన్నీ, వయసునూ, బరువునూ, నడకలో దాని వేగాన్నీ నిర్ణయిస్తారు.

ఈ ఫారెస్టులో మాన్ ఈటరు తిరుగుతుందని హైదరాబాద్ లోని తమ హెడ్ ఆఫీసుకు రిపోర్ట్ చేయాలి. అవసరం అనుకుంటే పులులను వేటాడే షికారీని సహాయం పంపమని కోరాలి.

చేయాల్సిన పనులు ఊహించుకుంటూ అతడు టీపు వైపు నడిచాడు.

"మిస్టర్ శివప్రకాశ్....! అన్నట్లు మీరు ఈ మధ్య ఎప్పుడైనా ఈ చెరువు ప్రాంతానికి గాని వచ్చారా?"

ఇన్ స్పెక్టరు మాటలకు ఆశ్చర్యంగా చూశాడు శివప్రకాశ్. ప్రశ్నార్థకంగా అతడి కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఉహుం .. లేదే! ఏం అలా అడిగాడు?"

"ఏం లేదు ఊరికినే" అన్నాడు ఇన్ స్పెక్టరు.

శివప్రకాశ్ వెళ్ళిపోయాక, చెరువు ఒడ్డుకు నడిచాడు ఇన్ స్పెక్టరు. బూటు గుర్తువున్న మట్టిపెళ్లను జాగ్రత్తగా పెకలించి పైకి తీశాడు.

'తను అనవసరంగా అనుమానిస్తున్నానా' అన్న సందేహం అతడిని పట్టి పీడించసాగింది.

'పులి పంజా దెబ్బలకు కండలు ఊడి సింగడు మరణించాడన్నది నిర్వివాదాంశం. అయితే అదే ప్రదేశంలోనికి ఆ బూట్ల గుర్తులు ఎలా వచ్చాయి? తనూ, శివ

ప్రకాశూ ఇద్దరూ కాకుంటే, ఆ చెరువు ప్రాంతానికి బూట్లు వేసుకొని వచ్చిన అజ్ఞాతవ్యక్తి ఎవరు?

పంజాల గుర్తులతో పులిని అన్వేషించడానికి బయలు దేరాడు శివప్రకాశ్. ఈ బూట్ల గుర్తులతో ఆ అజ్ఞాత వ్యక్తికోసం తనూ అన్వేషణ సాగించాలా?

ఎడతెగని ఆలోచనలతో ముందుకు నడిచాడు అతడు. దారిలో అతనికి శివప్రకాశ్ బూట్ల గుర్తులు కనిపించాయి. తన చేతిలోని మట్టిపెళ్లపై వున్న గుర్తులతో పోల్చి చూశాడు.

ఆ రెండు గుర్తులూ ఒకటి కావు. అవివేరు. వేరు డిజైన్లను కలిగి వున్నాయి. అయితే వాటి సైజు మాత్రం ఒక్కటే.

అయితే కేవలం కాలిబూటు సైజు ఒకటయినంత మాత్రాన ఎవరినైనా అనుమానించడం తెలివితక్కువని అతడికి తెలుసు. అయినా శివప్రకాశ్ లాంటి ఆఫీసర్ వ అబద్ధం ఆడాల్సిన పనేమిటి?

అతడు గూడెం మనుషులను సమీపించాడు. అంత వరకూ వారంతా అక్కడే చేతులు కట్టుకొని నిలబడి వున్నారు.

"శవాన్ని ముందుగా చూసిందెవరు?" వారివంక సూటిగా చూస్తూ అడిగాడు అతడు.

"నేను దొరా!" అంటూ లింగడు ముందుకు వచ్చాడు.

"అడవిలో కొండవార కట్టెలు కొడుతుండా. ఇంతలో మొకం కూత ఇనిపించింది. భయంతో ఉగత్తినా. నీలమ్మారి చెరువుకాడ సింగడ్ని సూసినా. రకతపు ముద్దనాగున్నాడు. సచ్చిపడున్నాడు. గూడెంకు ఉగత్తి

దొరకు చెప్పినా, గంతే దొరా!"

లింగడ్ని వెళ్ళమన్నట్లు సైగ చేసి, రామన్నదొర వంక చూశాడు ఇన్ స్పెక్టర్.

"సింగడ్ని చివరిసారిగా ఎవరు చూశారో చెప్ప గలవా దొరా?"

అతని సందేహమల్లా ఒక్కటే. ఆ ప్రదేశంలో బూట్ల గుర్తులు వున్నాయంటే, అక్కడికి ఎవరో నాగరికుడు వచ్చివుండాలి. బహుశా మరణానికి ముందు సింగడు అతనిని కలుసుకొని వుండాలి.

ఎవరో తెలియని ఒక నాగరికునితో ఒక ఆటవికుడు ఎందుకు కలుస్తాడు? వాద్దరి మధ్యా యేదో రహస్య సంబంధం ఉండివుండాలి. ఏమిటయి వుంటుంది?

ఒక వేళ తనకు తెలియకుండా గంజాయి లాంటి మత్తు మందుల వ్యాపారమేమైనా రహస్యంగా జరుగుతోందా? అదేదో తేల్చుకోవాలని ఉంది అతనికి.

"నిన్న రేతిరి గూడెంలో జాతర జరిగింది దొరా, అడవిదొర (ఫారెస్టు ఆఫీసరు) కూడా వచ్చిండు. వాళితో తెల్లార్లూ ఆడిండు. పాడిండు.... మా సింగడు, ఎండదొర రాకముందే అడవికి పోయిండు."

"వాళి ఎవరు దొరా?" రామన్నదొర మాటలకు అడ్డువచ్చాడు ఇన్ స్పెక్టరు.

"మా గూడెం కూనే దొరా. అడవిదొర యింట వంట చేసుద్ది. సింగడంటే దానికి పేనం. పెట్టా, వుంజా మా మంచి జోడులే దొరా!" అన్నాడు రామన్న దొర.

"సింగడు యెవరైనా పట్టణవాసపు మనుషులతో తిరుగుతుండేవాడా?" సాలోచనగా అన్నాడతడు.

“లేదు దొరా! ఆరెప్పుడూ ఆ అడవిదారి వెంటనే వుండేవాడు. కాళీకీ ఆడికీ జోడు కుదిరింది అడనే.”

ఇంక అడగటానికి అతనికేం తోచలేదు. రామన్న దొరను శవాన్ని తీసుకొని వెళ్ళిపొమ్మని చెప్పి, అతడు జీపు దగ్గరకు నడిచాడు. ఎర్రని ధూళిని రేపుకుంటూ జీపు ముందుకు కదిలింది.

అతని మస్తిష్కం నిండా యేవో ఆలోచనలు.

కాళీ పని చేస్తున్నది ఫారెస్టు ఆఫీసరు శివప్రకాశ్ ఇంట్లోనే. చనిపోయిన సింగడు ఎక్కువగా తిరిగేది ఫారెస్టు ఆఫీసరుతోనే. మరణ స్థలంలో కనిపించిన బూటుకాలి ముద్ర ...సరిగ్గా శివప్రకాశ్ బూటుకాలి సైజుదే. కాకుంటే డిజైన్ వేరు. అది ఇంకొక బూటుది అయివుండవచ్చు.

అతడు సింగడి మరణాన్ని గురించి ఆలోచించటం లేదు. సింగడి గతజీవితాన్ని గురించి ఆలోచిస్తున్నాడు సింగడి గతంలో యేదో చిక్కుముడి వుంది. ఆ ముడికి లింకు యెక్కడో శివప్రకాశ్ దగ్గరే ఉండి వుండాలని అతనికి బలంగా తోచసాగింది.

పోలీసుజీపు గూడేన్ని సమీపించింది.

## 3

“కాళి అంటే నీవేనా....?”

తన యెదురుగా నిలబడిన పద్దెనిమిదేళ్ళ యువతివంక చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టరు.

నిండయిన యవ్వనంలో మిస మిసలాడుతోంది. ఒక సారి చూస్తే కన్నులు త్రిప్పుకోలేని అందం ఆమెది. కట్టులో, బొట్టులో, మాట తీరులో నాగరిక లక్షణాలు కొద్దిగా కనిపిస్తున్నాయి ఆ యువతిలో.

'ఔనన్నట్లు' తలాడించిందామె.

"సింగడూ నీవూ ప్రేమించుకున్నారా?"

ఆ ప్రశ్నతో అంతవరకూ అదిమిపెట్టుకున్న దుఃఖం వెల్లువలా ఆమెలోనుండి పైకి వచ్చింది. అరచేతుల్లో ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి యేడ్వసాగిందామె.

రెండు నిముషాలసేపు ఆమెను అలా యేడ్వనిచ్చాడతడు. ఆ పరిస్థితిలో ఆమెను ఆపే ప్రయత్నం చేస్తే ఆమె దుఃఖం రెట్టింపు అవుతుందని అతనికి తెలుసు.

సరిగ్గా రెండునిముషాల తరువాత గ్లాసునిండా నీళ్ళు పోసి ఆమెకు అందించాడు. ఆమె నీళ్ళను త్రాగి, కాస్త స్థిమితపడ్డాక, ఆమెను అనునయంగా యిలా అడిగాడు.

"చూడమ్మా రాణీ....! సింగడికి యెవరితో పట్టణవాసులతో పరిచయం వుండితీరాలి. ఆ విషయం నీకేమైనా తెలుసా?"

"లేదు దొరా! నా ఎరికలో సింగడు నేస్తంగా తిరిగింది మా ఆఫీసరు దొరగారితోటే ఒక్కో రతిరి సింగడు దొరగారితో బంగళాలోనే నిద్దరోయేవాడు. ఈళ్ళిద్దరికీ యింతటి నేస్తమెవిటని గూడెం వాళ్ళంతా నిచ్చెరపోయేవాళ్ళు.

అలాంటిది యీ మద్దెన ఆళ్ళిద్దరికీ చెడిసికొట్టింది."

"ఏం....? యెందుకని?...." ఆత్రంగా అడిగాడతడు.

"నా మూలాన్నే దొరా. నాపై కన్ను వేసిందు దొర. ఓ రోజు నా చేయి పట్టిందు. నాపై మనసయిందంట. నేను ఔనంటే వన్నె రాణిని చేస్తానన్నాడు. నేను సింగడికి మనసిచ్చానని సెప్పి తప్పించుకుని

వచ్చాను....

ఆ ఎనక సింగడికీ, దొరకీ గొడవై నాదంట. సింగడు చెప్పిండు.

నిన్న రేతిరి జాతరకు దొర వచ్చిండు! వచ్చి తనతో ఆడమన్నాడు. నే వల్లనన్నాను. సింగడితో ఆడుతున్న నన్ను చూసి మండిపడుతూ వెళ్ళిపోయిండు దొర."

"ఈ విషయం మీ నాయకునికి తెలుసా....?"

"లేదు దొరా! ఈ రగడ మా ముగ్గురిమధ్యే వుండాలిది. మూడో కంటికి ఎరుగ నేదు."

కేసు మంచి మలుపుతిరిగిందని అనుకున్నాడు ఇన్ స్పెక్టరు.

"సింగడు ఇంకా యేమైనా చెప్పాడా కాళీ!"

"సెప్పిండు దొరా! నన్ను మరిసిపొమ్మనీ. లేకుంటే పేణం తీస్తానని సింగడ్ని బెదిరించినాడంట దొర."

ఇన్ స్పెక్టర్ సాలోచనగా తల పంకించాడు.

## 4

జీపులో నుండి క్రిందకు దిగాడు శివప్రకాశ్. అతడి చేతిలో డబుల్ బారల్ గన్ వుంది. అడవిలోనికి వెళ్ళేటప్పుడు యెప్పుడూ గన్ను దగ్గరే వుంచుకుంటాడతడు.

ఆ ప్రాంతంలో యెక్కడో పులి గర్జనను విన్నామని చెప్పారు కట్టెలకోసం అడవికి వెళ్ళిన గూడెంవాళ్ళు. ఆ వార్త అందిన మరుక్షణం హుటా, హుటిని జీపుమీద బయలుదేరి వచ్చేశాడతడు.

అది మాన్ ఈటరనీ, మామూలు పులులకన్నా చాలా తెలివిగా ప్రవర్తిస్తుందనీ అతనికి తెలుసు. అతడు చుట్టూ ఒక్కసారి పరికించి చూశాడు. తరువాత యేపుగా పెరిగిన దుబ్బులూ, పొదలకు దూరంగా నడక

సాగాడు.

అంతలో అతనికి సమీపంలోని పొదలు ఒక్కసారిగా కదిలాయి. ఏదో పెద్ద జంతువు నడుస్తున్నట్లు అలికిడి అయింది.

నడుస్తున్నవాడల్లా టక్కున ఆగిపోయాడతడు. చేతిలోని డబుల్ బారల్ గన్ను ఆ పొదవైపు గురి పెట్టాడు.

అదే సమయంలో ఘోరంగా....గుండెలు జలదరించేలా పులి గర్జన వినిపించింది.

ఒక్కక్షణం అతడు తడబడ్డాడు. అదే సమయంలో పొదలను చీల్చుకుంటూ అతని కళ్ళముందు నుండే పరుగెత్తుకుంటూ పారిపోయింది పెద్ద అడవిపంది. అతడింకా ఆ పులిగర్జన వినడంవలన ఏర్పడిన షాక్ లోనే వున్నాడు. కనీసం ట్రిగ్గర్ కూడా నొక్కలేదతడు.

పులి గాండ్రింపు వినవచ్చిన దిక్కు వేగంగా పరుగెత్తాడతడు. ఒకచోట నేలమీద పులిపంజా గుర్తులు కన్పించాయి అతనికి. వాటిని చూడగానే జేబులో నుండి ఆత్రంగా ఓ కాగితాన్ని తీశాడు. సింగడి శవం దగ్గర లభించిన పులి పంజా గుర్తులు ఆ కాగితం మీద ఉన్నాయి.

ఆ రెండింటినీ పోల్చి చూశాడు. సందేహంలేదు. ఆ రెండు పంజాల గుర్తులు ఒకటే.

'సో....సింగడ్ని చంపిన మాన్ ఈటర్ యింకా యిక్కడే తిరుగాడుతుందన్న మాట.'

అతడు ఆ పంజా జాడలను అనుసరిస్తూ ముందుకు నడిచాడు.

మట్టిలో పులిపంజాల గుర్తులు చాలా స్పష్టంగా కన్పి

స్తున్నాయి తుపాకీని చేతితో పట్టుకొని, చుట్టూ పరీక్షగా చూస్తూ ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నాడతడు.

అయితే తనకు కొన్ని అడుగుల దూరంలో తనను కబళించడానికి మృత్యువులా ఎదురుచూస్తున్న ఊబిని అతడు గమనించలేదు.

కాని, అందులో అతని తప్పేంలేదు. నిజానికి అది ఊబిలా లేదు. ఎండుటాకులు రాలిన మామూలు నేలలా వుంది. అతడు ఒక్కొక్క అడుగూ ముందుకు వేస్తున్నాడు.

దూరంగా ఒక చెట్టు చాటునుండి ఒక జత కళ్ళు అతడివంక ఆత్రంగా చూస్తున్నాయి.

తన ఆరవప్రాణం మరణానికి కారకుడయిన ఆ నీచుడి చావును కళ్ళారా చూడటానికి ఆ కళ్ళు ఆతురతపడుతున్నాయి.

ఒకటి.... రెండు .... మూడు .... అంతే! నాలుగవ అడుగు సరిగ్గా ఊబిలోపడింది. మొదటి అడుగు పడగానే సర్రున బురదలోకి జారాడతడు. మోకాళ్ళవరకూ ఆ ఊబిలో కూరుకుపోయిన అతడు మరి కాలు కదపలేక పోయాడు.

తన శరీరం నెమ్మదిగా బురదలో కూరుకుపోతుంటే నిస్సహాయంగా చుట్టూ చూశాడతడు.

"ర .... క్షి .... ం .... చ .... ండి ...." అంటూ అతడు అరచిన అరుపు ఆ నిర్జనారణ్యంలో ప్రతిధ్వనించింది.

అప్పటికే నడుంవరకూ ఆ ఊబిలో కూరుకుపోయాడతడు. ఇక తన చావు తప్పదనుకున్నాడతడు. చివరి ప్రయత్నంగా చేతిలోని తుపాకీని గాలిలోకి రెండుసార్లు

పేల్చాడతడు.

ఆ శబ్దానికి చెట్లమీద పక్షులు ఉవ్వెత్తున గాలిలోనికి లేచాయి.

# 5

శివప్రకాశ్ ఉంటున్న ఫారెస్టు బంగళా ముందు జీపును ఆపాడు ఇన్స్పెక్టర్. జీపు నుండి క్రిందకు దిగి బంగళాలో ప్రవేశించాడు.

ఇన్స్పెక్టర్‌ను డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి లోపలికి వెళ్ళాడు సీనయ్య.

సీనయ్య ఫారెస్టు బంగళాలో పనివాడు. ఏభయి ఏళ్ళ వయసులో కూడా యెంతో బలంగా, దృఢంగా కన్పిస్తాడు. పుట్టింది గూడెంలోనైనా, చిన్నతనం నుండీ ఫారెస్టు ఆఫీసర్ల దగ్గర పని చేయడంవలన అతనిలో నాగరికతా లక్షణాలు కన్పిస్తున్నాయి.

సీనయ్యను చూసిన వెంటనే అతనిని యెక్కడో చూసినట్లు అనిపించింది ఇన్స్పెక్టర్‌కు. ఐదు నిముషాల తరువాత గుర్తుకు వచ్చింది అతనికి సీనయ్యను యెక్కడ చూసిందీ.

సరిగ్గా రెండు నెలల క్రితం....అంటే అతడు మల్కానగిరికి సబ్ ఇన్స్పెక్టర్‌గా వచ్చిన తొలిదినాల్లో....

గూడెంలో యెవరో ఒక యువతి ఆత్మహత్య చేసుకుందన్న వార్త అందింది. వెంటనే బయలుదేరి గూడేనికి వెళ్ళాడతడు. అప్పటికే ఆ యువతి శవానికి అంత్యక్రియలను పూర్తిచేశారు వారు.

మృతురాలి శవమే లేకుండా అతడు చేసే పరిశోధన యేముంటుంది? ఫార్మల్‌గా ఎంక్వాయిరీ జరిపించి వచ్చేశాడు.

ఆ యువతి పేరు నీలమ్మ అనీ, ఎప్పుడూ నవ్వుతు, తుళ్ళుతు తిరిగే ఆమె ఆకస్మాత్తుగా ఎందుకు మరణించిందో అంతా వింతగా వుందని అన్నారు అంతా.

ఆ యువతి తండ్రే ఈ సీనయ్య.

'తను ఆ రోజు సామానులు తేవడానికి మల్కానగిరి సంతకు వెళ్ళానని, రాత్రి బాగా పొద్దుపోయాక ఇంటికి వచ్చిన తనకు చచ్చి పడివున్న నీలమ్మ కనిపించిందనీ' గోలు గోలున ఏడుస్తూ చెప్పాడతడు.

సీనయ్యను చూస్తూంటే ఆ కేసంతా గుర్తుకు రాసాగింది ఇన్ స్పెక్టర్ ఉదయ్ కుమార్ కు.

ఆత్మహత్య చేసుకున్నకు నీలమ్మ తండ్రి సీనయ్య పని చేస్తోంది శివప్రకాశ్ యింట్లోనే. ఎందుకో అన్ని లింకులూ శివప్రకాశ్ దగ్గరే అదృశ్యమవుతున్నాయి — అనుకున్నాడు సీనయ్య యిచ్చిన టీ త్రాగుతూ.

"ఏం శీనయ్యా....శివప్రకాశ్ గారు లేరా?"

"లేరు బాబూ! అడవిలోనికి వెళ్ళారు."

"లేరా! సరే! నేనిక్కడే వుంటాను. నీవు ఒకసారి గూడేనికి వెళ్ళి రామన్నదొరను పిలుచుకొని రా!"

సిగరెట్ ముట్టిస్తూ అన్నాడు ఇన్ స్పెక్టరు.

శివప్రకాశ్ బంగళాలో లేడని అతనికి ముందే తెలుసు. ఇంక బంగళాలో మిగిలిన సీనయ్యనూ బయటకు పంపడం ద్వారా తనకు కావాల్సిన ఏకాంతాన్ని కల్పించుకున్నాడు.

సీనయ్య బంగళా దాటి కొంత దూరం పోగానే అతడు మెరుపులా లేచాడు. చేతిలోని సిగరెట్ ను యాష్ ట్రేలో నొక్కి....శివప్రకాశ్ బెడ్ రూమ్ లోనికి ప్రవేశించాడతడు.

ఆ బెడ్‌రూమును చూసిన అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. అది బ్రహ్మచారి పడకగదిలా లేదు. గోడలకు వ్రేలాడుతున్న శృంగార చిత్రాలూ, డబుల్ కాట్ బెడ్ ప్రక్కన టీపాయ్‌మీద నున్న అందమైన నగ్నసుందరి విగ్రహం, ప్రక్క చుట్టుక్రింద దొరికిన విరిగిన గాజుముక్కా, వాడిన ఒకటి రెండు అడవి సంపెంగలూ.... శివప్రకాశ్ మంచి రసికుడని చెప్పకనే చెబుతున్నాయి.

ఈ అడవిలో అతనికి అనుభవాన్ని పంచుతున్న దెవరు? పైవారు మాత్రం కాదు. ఎందుకంటే స్త్రీ ముఖం కన్పిస్తే చాలు యీ అడవిలో అందరికీ తెలిసి పోతుంది.

మరి ...గూడెం మనుషులా? అతని అధికారానికి భయపడో, అతనిచ్చే డబ్బులకు ఆశపడో గూడెం స్త్రీలలో కొందరు అతనికి లొంగారే అనుకొందాం. అప్పుడు గూడెం స్త్రీలకూ, అతనికీ మధ్య ఎవరో మాధ్య వర్తి వుండాలి.

ఎవరతడు? సింగడా....?

అవును సింగడే. శివప్రకాశ్, సింగడు అంత సన్నిహితంగా ఉండటంలోని అంతరార్థం అదే అయి వుంటుంది.

"ఒక్కొక్క రేతిరి సింగడు దొరగారితో బంగళాలోనే నిద్దరోయేవాడు"....అతనికి కాళీ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి.

అతడు ఒకవంక ఆలోచిస్తూనే, ఒక్కొక్క గదిని వెతుకుతున్నాడు. ఇంకెక్కడా అనుమానింపదగ్గ ఆధారాలేం దొరకలేదు. చివరగా స్టోర్ రూమ్‌లోకి

ప్రవేశించాడు.

విరిగిన ఫర్నిచరూ, పాత ఫైళ్ళూ. ఇంకా పనికిరాకని పారేసిన యెంతో సామాను.... అంతా బూజుపట్టి. దుమ్ము ధూళితో నిండివుంది. అతడు చుట్టూ పరికించి చూశాడు.

ఒక మూలగా పడివున్న బూట్లజత అతని దృష్టిని ఆకర్షించింది. వాటి సోల్స్‌కు బంకమట్టి అంటివుంది. అతడు వాటిని పైకితీసి చూశాడు. ఒక్క క్షణం పరీక్షగా ఆ సోల్సు చూసి, జేబులోనుండి ఒక కాగితాన్ని పైకి తీశాడు. దానిపై సీతమ్మ చెరువు దగ్గర అతడు భద్రపరచిన బూటుకాలి ముద్ర వుంది.

ఆ రెండింటినీ సరిచూశాడతడు. సందేహం లేదు. ఆ రెండింటి సైజూ, డిజైను.... అంతా ఒక్కటే.

విజయగర్వంతో అతని కన్నులు మెరిశాయి. లేచి నిలబడి ముందుకు రెండడుగులు వేశాడు.

ఏదో దుర్గంధం అతని నాసికాపుటాలకు సోకింది. ఆ వాసన ఆ గదిలో ప్రవేశించినప్పటి నుండీ వస్తున్నా.... ఏదో పాత సామానులు బూజుపట్టటంవలన వస్తున్న ముక్కి వాసన అనుకున్నాడు. కాని అది కుళ్ళిన మాంసం వాసనని గ్రహించటానికి అతనికి యెంతో సేపు పట్టలేదు.

పదినిమిషాల తరువాత పాతఫైళ్ళ దొంతరల వెనుక గోడవారను కన్పించాయి ఆ దుర్గంధాన్ని వెలువరిస్తున్న వస్తువులు.

అవి.... పులిపంజాలు.

వాడిగావున్న వాటి గోళ్ళల్లో చిన్న చిన్న మాంసపు ముక్కలు ఇరుక్కొని వున్నాయి. అవే క్రుళ్ళిపోయి చెడు

వాసన వేస్తున్నాయి. ఆ పంజాల అడుగు భాగానికి రక్తంతో కూడిన మట్టి అంటివుంది.

ఆ పంజాలలోని రహస్యమేమిటో అతనికి అర్థం కాలేదు. వాటిని మళ్ళీ యథాస్థానంలో వుంచి అతడు గదిలో నుండి బయటపడ్డాడు.

మళ్ళీ మామూలుగా డ్రాయింగ్ రూములోనికి వచ్చేసరికి దూరంగా మనుష్యుల మాటలు వినిపించాయి. కిటికీ కర్టెన్ తొలగించి బయటకు చూశాడు. కా సమారంలో నడుచుకుంటూ వస్తున్న సీనయ్య, రామన్నదొర కనిపించారు.

అతడు సర్దుకొని మామూలుగా పేముకుర్చీలో కూర్చోబోతూ ముందుకో టేబిల్ వంక చూశాడు. టూ-ఇన్-వన్ టేప్ రికార్డర్ కనిపించింది. వెళ్ళి ఆన్ చేసి వచ్చి కూర్చున్నాడు.

అవును మరి.... సీనయ్య వచ్చేసరికి.... అంత సేపూ తను టేప్ రికార్డర్‌లోని పాటలు వింటూ కూర్చున్నానని అనుకోవద్దూ!

అయితే అతడు ఊహించినట్లుగా ఆ కేసెట్‌లో పాటలు లేవు

ముందుగా పక్షుల కిచ కిచలు వినిపించాయి. తరువాత కూ.... కూ.... అంటూ కమ్మగా వినిపించింది కోకిల స్వరం.... ఆ వెనుక గుడ్.... గుడ్.... మంటూ ఆడపావురాన్ని పిలవడానికి మగ పావురం చేసే విచిత్రమైన శబ్దాలు....

"ఓహో శివప్రకాశ్‌కు మంచి టేస్టు వుందే. అడవిలోని పక్షుల స్వరాలను బాగానే రికార్డు చేశాడు" అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్ ఉదయకుమార్.

అంతలో....భయంకరమైన పులిగర్జనతో ఆ గది మారుమ్రోగిపోయింది. త్రుళ్ళిపడ్డాడతడు. అప్రయత్నంగా చుట్టూ చూశాడు. అదే క్షణంలో మరోసారి వినిపించింది పులిగర్జన.

అది నిజమైన పులిగర్జన కాదని, కేసెట్ లో రికార్డు అయిన పులిగర్జనను టేప్ రికార్డర్ ద్వారా వింటున్నానని గ్రహించడానికి కూడా అతనికి రెండు నిముషాలు పట్టింది.

నుదుటను పట్టిన చిరుచెమటను కర్చీఫ్ తో అద్దుకుంటూ బరువుగా నిశ్వసించాడతడు.

అదే సమయంలో ఆ గదిలోనికి ప్రవేశించారు సీనయ్యా, రామన్నదొరలు.

"గుండె అదిరిపోనాయి దొరా! మెకమేంది....దొర గారి మొంగసాలను కూయడమేందని నిచ్చెరపోయా.

అప్పుడు సింగడి శవాన్ని సూడటానికి పోయుంటిమే. అక్కడ అడవిలో అచ్చం ఇట్టాంటి కూతలే ఇనిపించి నాయి.

హో తెలి. కూసింది మెకం కాదు. పాటలపెట్టె అని సీనయ్య సెప్పిండు. నమ్మ బుద్ధి కాలేదు దొరా! గిదేనా ఆ పాటలపెట్టె."

టేప్ రికార్డర్ వంక అబ్బురంగా చూస్తూ అన్నాడు రామన్నదొర.

రామన్న మాటలు వినగానే ఎవరో కొరడాతో ఛెళ్ళున వెన్నుమీద చరచినట్లయింది.

"అక్కడ అడవిలో ఇట్టాంటి కూతలే ఇనిపించి నాయి."....రామన్న పలుకులు చెవుల్లో గింగురుమన సాగాయి. ఏవో ఆలోచనలు మెదడులో సుళ్ళు తిరుగ

సాగాయి.

గదిలో నిశ్శబ్దంగా పచార్లు చేస్తున్న అతడివంక ఆశ్చర్యంగా చూశారు వారు.

టేప్‌రికార్డర్‌లో కేసెట్ యింకా అలా తిరుగుతూనే వుంది. పాదలు గల గలమన్న శబ్దం. ఎండుటాకుల పై యేదో భారీ జంతువు బలంగా అడుగులు వేస్తున్న ధ్వని.

వింటున్న ఇన్‌స్పెక్టర్ పెదవులు విజయగర్వంతో విచ్చుకున్నాయి. అప్పటికే అతని ఆలోచనలు ఒక రూపాన్ని దిద్దుకున్నాయి.

'శివప్రకాశ్‌కు ఆడవాళ్ళంటే పిచ్చి. అందమైన గూడెం స్త్రీలను తార్చడంలో సింగడు అతనికి సహాయపడుతూ ఉండేవాడు. అయితే వున్నట్లుండి శివప్రకాశ్ కన్ను కాళిమీద పడింది. కాని త్వరలో తను పెళ్ళి చేసుకోబోతున్న కాళిని శివప్రకాశ్‌కు అప్పగించడానికి సింగడు అంగీకరించలేదు.

దానితో వారిద్దరి మధ్య ఘర్షణ పెరిగింది. తన దారికి అడ్డు తప్పుకోని మర్యాదగా కాళిని అప్పగించకపోతే ప్రాణాలు తీస్తానని బెదిరించాడు శివప్రకాశ్. కాని సింగడు లొంగలేదు.

ఆ రోజు రాత్రి జాతరలో తనను కాదని, కాళి సింగడితో నాట్యం చేయడంతో అతడి కోపం తారాస్థాయికి చేరుకుంది.

మరునాడు ఉదయం కట్టెలు కొట్టడానికి వెళ్ళిన సింగడ్ని చంపి. సీతమ్మ చెరువు దగ్గర పారేశాడు. తన దగ్గరున్న పులిపంజాలతో అతని శరీరాన్ని చీల్చి, చండాడాడు.

ఎంతో నేర్పుగా నేలమీద ఆ పంజాగుర్తులను వేసి, పులి సింగడిని చంపినట్లు అందరినీ నమ్మించాడు. తన నాటకానికి మరింత బలం చేకూరటానికి, సింగడి శవాన్ని చూడటానికి వెళ్తున్న గూడెంవాళ్ళకు తను ముందుగా రికార్డు చేసిన పులిగర్జనలను వినిపించాడు.

ఎంతో అమాయకంగా తనతోపాటే వచ్చి సింగడి శవాన్ని చూసి ఆశ్చర్యం నటించాడు.

శివప్రకాశ్! రియల్లీ యూ ఆర్ ఎ జీనియస్.

అనుకున్నాడు ఇన్స్పెక్టర్. తన ఆలోచనల్లో ఎక్కడయినా లోపం వుందేమోనని మరోసారి తర్కించుకున్నాడు. అంతా కరెక్టుగా వుందనిపించాక.... సీనయ్య వంక తిరిగి ఒకే ఒక ప్రశ్న అడిగాడు.

“శివప్రకాశ్ స్త్రీలోలుడు కదూ?”

జవాబు చెప్పలేక సీనయ్య తల దించుకున్నాడు. అతడి మౌనం అంగీకారమని తెలుసు అతడికి.

అతడు చిరునవ్వు చిందిస్తూ బయటకు నడిచాడు.

తనని పిలిచినట్లే పిలిచి, మాటామంతీ లేకుండా వెళ్ళిపోతున్న ఇన్స్పెక్టర్ వంక ఆశ్చర్యంగా చూశాడు కోయదొర రామన్న.

జీపు శరవేగంగా అడవివైపు దూసుకుపోయింది.

## 6

జీపుమీద వెళ్తున్న ఇన్స్పెక్టర్‌కు పరుగెడుతూ ఎదురువచ్చింది కాళీ. ఆమెను చూసి జీపును ఆపాడు. ఆయాసంతో వగరుస్తోంది ఆమె.

“మీ కోసమే వస్తుండా దొరా. మీరు బంగళాకాడున్నారని తెలిసి లగెత్తి వత్తున్నా!”

“ఏం జరిగింది కాళీ....?”

"ఈ రోజు పొద్దున్నే ఆఫీసరుబాబు నన్ను కలిసిండు. తన మాట కాదని, తనకు యెదురునిల్చిన, సింగ దేశాయి నాడో తెలిసింది కదా....యికనైనా తనకు లొంగి పొమ్మని నన్ను బెదిరించిండు."

ఆమె వంక చూసి చిన్నగా నవ్వాడతడు.

"భయం లేదులే కాళీ. ఈ రోజుతో శివప్రకాశ్ ఆట కట్టు" అన్నాడతడు జీపును స్టార్టు చేస్తూ.

మాన్ ఈటర్‌ను వెంటాడుతూ శివప్రకాశ్ అడవి లోనికి వెళ్ళాడని తెలిసింది అతనికి.

"నిజమైన మాన్ ఈటర్ వైన నిన్ను వేటాడటానికి నేనూ అడవిలోనికి వస్తున్నాను శివప్రకాశ్."

ఏక్సిలేటర్‌ను కాలుతో బలంగా నొక్కుతూ అను కున్నాడతడు.

అయితే అతడు శివప్రకాశ్ కోసం ఎంతోదూరం వెళ్ళనవసరం లేకుండా పోయింది. దారిలోనే అతనికి ఫారెస్టు జీపు యెదురయింది. అతడు జీపును ఆపి క్రిందకు దిగాడు.

ఒంటినిండా బురదతో సీటుమీద నిస్త్రాణంగా వాలి పోయి వున్నాడు శివప్రకాశ్. అతన్ని ఆ స్థితిలో చూసే సరికి అతనికి మూర్ఛ వచ్చినంత పనయింది.

"వాట్ హాపెండ్ శివప్రకాశ్?" అన్నాడతడు ఆత్రంగా.

'అడవిలో పులిపంజా గుర్తులను అనుసరిస్తూ తను ఊబిలో యెలా చిక్కుకున్నదీ....' లోగొంతుకతో లేని ఓపికను తెచ్చుకుని నెమ్మదిగా చెప్పాడు శివప్రకాశ్.

"మరి ... ఆ ఊబిలో నుండి ఎలా తప్పించుకున్నారు?" ఆశ్చర్యంగా అడిగాడతడు.

ఆ ప్రశ్నకు సమాధానం జీపును డ్రయివ్ చేస్తున్న ఫారెస్టుగార్డు చెప్పాడు.

"పులిగర్జన వినిపించిన దిక్కుగా అడవిలోనికి ఆఫీసరుగారు ఒంటరిగా వెళ్ళారని తెలిసింది నాకు. వెంటనే రైఫిల్ తీసుకొని నేనూ అడవిలోనికి బయలుదేరాను.

అయితే ఆయన జీపుమీద వెళ్ళడంచేత నేను ఆ స్థలం చేరడానికి చాలా సమయం పట్టింది. తీరా నేను అక్కడ చేరుకునేసరికి అక్కడ ఆగివున్న జీపు కనిపించింది ఆఫీసర్ గారు ఎక్కడా కనిపించలేదు. యేం చేయాలో నాకేం తోచలేదు.

అంతలో రెండుసార్లు తుపాకీ పేల్చిన శబ్దం వినిపించింది. కాని పలుకురాయి ఉండటంచేత ఆ ధ్వని అరణ్యం నలుదిక్కుల నుండీ వినిపించింది. ఏ దిక్కుకని పరుగెత్తను?

అంతలో....ఒకచోట ఆకాశంలో ఉవ్వెత్తున పైకి లేచిన పక్షుల సమూహం కన్పించింది. బహుశా శబ్దం ఆ దిక్కునుండే వచ్చి ఉంటుందని అనుకున్నాను నేను.

వెంటనే ఆ దిక్కువంక సూటిగా పరుగెత్తాను. అక్కడ....ఊబిలో గుండెలవరకూ దిగబడిపోయిన ఆఫీసరుగారు కనిపించారు.

ఏం చేయాలో నాకేం తోచలేదు. తాడుకానీ, పొడవైన కర్ర కానీ ఏవీ సమయానికి దగ్గర లేవు. ఎలా? ఎలా ఆయనను రక్షించాలి?

అంతలో సరిగ్గా ఊబిపైన కాస్త క్రిందకు వ్రాలిన చెట్టుకొమ్మ నా దృష్టిని ఆకర్షించింది. మరుక్షణం తాత్సారం చేయకుండా చెట్టుమీదకు ఎగబ్రాకాను. పైనున్న

కొమ్మను గట్టిగా రెండు చేతులతో పట్టుకొని కాళ్ళతో క్రిందనున్న కొమ్మని బలంగా క్రిందకు వంచాను.

ఆయన అప్పటికే భుజాలవరకూ దిగబడి పోయారు. అయితే ఆయన చేసిన తెలివైన పనేమిటంటే రెండు చేతులనూ పైకి ఎత్తి ఉంచడం.

క్రిందకు వాలిన కొమ్మను ఆయన గట్టిగా చేతులతో పట్టుకున్నారు. మరుక్షణం అంతవరకూ ఆ కొమ్మను క్రిందకు అదిమి పెట్టి ఉంచిన నా కాళ్ళను పైకి ఎత్తేశాను.

వెదురు బద్దను బాగా క్రిందకు వంచి, ఒక్కసారి వదిలితే ఎలా స్ప్రింగులా పైకి లేచి వస్తుందో. అలాగే ఆ కొమ్మ కూడా అంతే ఫోర్స్‌తో పైకిలేచింది.

కొమ్మతో పాటు పైకి లేచిన ఆఫీసర్ గారిని చేయి పట్టుకొని లేవదీశాను.”

కళ్ళకు కట్టినట్లు ఆ సన్నివేశాన్ని వర్ణించాడు ఆ గార్డు

వారు చెప్పిందంతా వినేసరికి ఇన్‌స్పెక్టర్‌కు మతి పోయింది

‘పులి పంజా గుర్తులను అనుసరిస్తూ ఊబిలో చిక్కుకున్నా నంటున్నాడు శివప్రకాశ్. అదే నిజమయితే పులి కూడా ఆ ఊబిలో చిక్కుకుని ఉండాలి.’

అతడు సాలోచనగా వారికేసి చూశాడు.

“మరి పులి ...?” అన్నాడతను అనుమానంగా.

“అదే విచిత్రం. ఆ తరువాత ఎంత గాలించినా అక్కడ పులి పంజా గుర్తులు కనిపించలేదు. సరిగ్గా ఆ ఊబి దగ్గరే అదృశ్యమైపోయాయి” అన్నాడు గార్డు.

“మీరు ఊబిని గమనించలేదా శివప్రకాశ్?”

"లేదు ఇన్‌స్పెక్టర్. అది పూర్తిగా లేదు. బురద నేల ఆ పైకి కనిపించకుండా ఎవరో పైన పట్టిని చల్లినట్లుంది. ఆ పైన దట్టంగా ఎండుటాకులు దానిమీద పరిచివున్నాయి."

అతిడిపంక నమ్మలేనట్లు చూశాడు ఇన్‌స్పెక్టర్.

"అంటే ఏ పులి పంజా గుర్తుతో సింగడి హత్యను శివప్రకాశ్ తప్పుదారి మళ్ళించి, ప్రమాదంగా చూపించాడో, అదే పులిపంజా గుర్తుతో శివప్రకాశ్‌నే తప్పుదారి పట్టించి చంపబోయారా? అదే నిజమయితే ఎవరా హంతకుడు?

శివప్రకాశ్ మీద జరిగిన ఈ హత్యా ప్రయత్నానికి కారణం సింగడి హత్యే అయితే.... సింగడి మరణానికి శివప్రకాశ్ మీద పగ తీర్చుకోవడానికి ఎవరు ప్రయత్నిస్తారు?

ఒకే ఒక్కరికి ఆ అవకాశం ఉంది.

అది... కాళీ....!

కాని కాళీ ఇంతకు తెగించిందంటే నమ్మబుద్ధి కావటంలేదు అతడికి. కాని. టేప్ రికార్డర్‌ను ఆపరేట్ చేసి పులి గర్జనను వినిపింపజేసే అవకాశం.. ఆ ఇంటిలో పని చేస్తున్న కాళీ ఒక్కదానికే ఉంది.

ఆలోచనలతో అతనికి తల తిరిగిపోతున్నట్లు అనిపించ సాగింది. 'ఎక్కడికో పోతున్నదీ కేసు' అనుకున్నాడతడు.

జీపును రివర్స్ చేసి వెనక్కు పోనిచ్చాడు. ఈ హత్యల మిస్టరీని ఛేదించాలంటే.... శివప్రకాశ్ పై తనకున్న అనుమానాన్ని బయట పెట్టకూడదనుకున్నాడు.

అపరాధికి యింకో అవకాశం యివ్వాలి తనకేమీ తెలియనట్లు ఊరుకుంటే....హంతకుడే యింకో ప్రయ

త్నం చేస్తాడు. ఆ ప్రయత్నంలోనే హంతకుడిని రెడ్ హాండెడ్‌గా పట్టుకోవాలి. అదీ అతడి ఆలోచన.

## 7

రాత్రి తొలిజాము గడిచింది. అమావాస్య దాటిన తొలిరోజులు కావడంతో చంద్రుడు గ్రుడ్డి కాంతులీనుతున్నాడు. వెన్నెల లేనివేళ వన్నెలు మాకెందు కన్నట్లు చుక్కలు చిన్నబోతున్నాయి.

ఆ మసక చీకటిలో గూడేన్ని దాటి నెమ్మదిగా అడవిలోనికి ప్రవేశించిందొక ఆకారం. ఎండు టాకుల మీద పాదాలు పడినప్పుడల్లా సన్నగా చప్పుడవుతూంది. ఆ చప్పుడులో ఆమె కాలి అందెల మ్రోత కలిసిపోతుంది.

నల్లని కురులను పైకి ఎగదువ్వి కొప్పుగా ముడిచింది ఆమె. ఆ మసక వెలుతురులో సైతం ఆ కొప్పులో ముడిచిన చురకత్తులు చంద్రవంకల్లా మెరుస్తున్నాయి.

ఆమె వడి, వడిగా నడుస్తూంది. ఆమె వెనుకే నల్లని కంబళిని తలనిండా కప్పుకొని వస్తున్నాడు ఇన్‌స్పెక్టర్. తనను ఎవరైనా వెన్నాడుతున్నారేమో నన్న ఆలోచన కూడా లేనట్లుంది ఆమెకు.

నడుస్తున్న ఆమె ఒక చోట ఆగింది. అక్కడ పెద్ద, పెద్ద మద్ది చెట్లు ఉన్నాయి. ఆమె చేతులను ఆడించి గాజులను గల, గల లాడించింది. సమీపంలోనున్న ఒక మద్ది చెట్టు చాటునుండి ఒక పురుషాకారం పైకి వచ్చింది.

తెల్లని పైజామా, లాల్చీ ధరించాడతడు. అతడు శివప్రకాశ్. ఆమె కాళీ.

"వచ్చావా కాళీ....రా!" రెండు చేతులనూ చాపి ఆమెను కౌగిలిలోనికి ఆహ్వానించాడతడు.

"మీరంతగా ఇదౌతుంటే రాకుండా ఉండగలనా

దా రా!" అతడి కౌగిలిలో గువ్వలా ఒదిగిపోతూ అంది ఆమె.

"మరి ఈ తుప్పల్లో ఈ తిప్పలెందుకు కాళీ. హాయిగా మన బంగళాకే పోవచ్చుకదా!" అన్నాడతను ఆమెను కౌగిలిలో నలిపేస్తూ ...

"గుట్టు రట్టయితే పేనంపోదూ." అంది ఆమె.

వారిద్దరినీ ఆ స్థితిలో చూస్తుంటే ఇన్‌స్పెక్టర్‌కు మతి పోసాగింది. ఇది కలా? నిజమా? అన్న అనుమానం పీడించసాగింది అతడిని.

కాళీ బలమైన అవయవాలు తనను మత్తుగా, గత్తుగా తాకుతుంటే అనిర్వచనీయమైన ఆనందంతో ఒళ్ళు మరచి పోయాడు శివప్రకాశ్. అతడి వంక ఓరగా చూసిందామె. మెల్లగా చేతులను పైకి లేపింది.

అలా చేతులు లేపటంలో మరింత స్వేచ్ఛగా తన ఛాతీకి హత్తుకున్న ఆమె గుండెల కఠినత్వం అతడిని వివశుడ్ని చేసింది. ఆమె మెడను తమకంగా పెదవులతో రాస్తూ ఆమెను బల్లిలా కరచుకుపోయాడతడు.

అతడు అలా మైమరచి వున్న క్షణంలో రెండు చేతులనూ కొప్పుమీదకు చేర్చిందామె. రెండు చేతులతో ఛటాలున రెండు చురకత్తులనూ పైకి లాగిందామె.

ఆమె చేయబోతున్న పనేమిటో గ్రహించే సరికి ఇన్‌స్పెక్టర్‌కు మెడమీద చీమలు ప్రాకినట్లయింది.

"కాళీ....ఆగు" అంటూ గట్టిగా అరిచాడు. అతడి గొంతు ఆ నిశ్శబ్ద నిశీధిలో ప్రతిధ్వనించింది.

అతడు మరో క్షణం ఆలస్యం చేసివుంటే ఆమె చేతుల లోని రెండు చురకత్తులూ శివప్రకాశ్ వెన్నులో నుండి దూసుకుపోయి వుండేవి.

ఇన్స్పెక్టర్ కేక వినగానే ఆమె ఒక్క క్షణం బిత్తర పోయింది. చలిక్కి పడ్డ శివప్రకాశ్ విసురుగా ఆమె కౌగిలినుండి విడిపడ్డాడు. ఎదురుగా రెండు చేతులలోనూ రెండు కత్తులను పట్టుకొని అపర కాళికలా నిలబడ్డ కాళీని చూసి నిశ్చేష్టుడై పోయాడు.

“ఏ ... ఏ ఏమిటిది కాళీ” అన్నాడతను తడబడుతున్న గొంతుతో.

“పగ దొరా! పగ! నీకు తెలుసుగా పేనానికి పేనం, రక్తానికి రక్తం బదులు తీసుకొనే జాతి మాది. నా సింగడిని సంపిన నిన్ను ఈ రేతిరి సంపందే వదలను.” అంది శివంగిలా గర్జిస్తూ.

“నేను సింగడ్ని చంపడమేమిటి కాళీ” అన్నాడతడు ఆశ్చర్యంగా.

“కల్లలాడబోకు దొరా. నాకు తెలుసు సింగడ్ని నీవే సంపావు. సీనయ్య తాత సెప్పిండు”

“సీనయ్యా” అతడు నివ్వెరపోయాడు.

అదే సమయంలో ఆ అడవిని వణికిస్తూ భయంకరమైన పులిగర్జన వినిపించింది. ఒక్క క్షణం వాళ్ళిద్దరూ చిగురుటాకుల్లా వణికిపోయారు.

సమీపంలోని పొదలు ఒక్కసారి గల గల లాడాయి. మరోసారి ప్రళయ భీకరంగా వినిపించిన పులి గర్జనకు వారు భయంతో వణికిపోతూ చెరో దిక్కుకు పారిపోయారు.

అది నిజమైన పులిగర్జన కాదనీ, టేప్ రికార్డర్ ద్వారా వినిపిస్తున్న రికార్డెడ్ క్యాసెట్ అని తెలిసిన ఇన్స్పెక్టర్ ముందుకు ఉరికాడు. పారిపోబోతున్న కాళీ చేయిని ఒడిసి పట్టుకున్నాడు. ఆమె అతడివంక నివ్వెర

పోయి చూసింది.

అతడి మెదడు శరవేగంగా ఆలోచించసాగింది. శివ ప్రకాశ్, కాళీ ఇద్దరూ కాకుంటే టేప్ రికార్డర్ వాడే అవకాశం ఎవరికుంది? 'సీనయ్యే తాత నెప్పిండు' అన్న కాళీ మాటలు గుర్తుకు వచ్చాయి.

"అవును సందేహంలేదు సీనయ్యే" అనుకున్నాడతడు.

అంతలో వారికి... శివప్రకాశ్ చావుకేక వినిపించింది. మెరుపులా అటు పరిగెత్తాడతడు. కంఠనాళాలు త్రెగి పోయి రక్తం ధారలు కడుతుంటే....మరణవేదనతో కాళ్ళూ చేతులూ కొట్టుకుంటున్నాడు శివ ప్రకాశ్. అతని కంఠంపై పులి పంజాల గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అతడు యింక ఎంతోసేపు బ్రతకడని అర్థమైపోయింది. సీనయ్యే ఈ హత్య చేశాడన్నది తెలుస్తూంది. కాని ఎందుకు చేసినట్లు?

సింగడ్ని, శివప్రకాశ్‌నూ ఇద్దరనీ హత్యచేసాడంటే వారిద్దరూ కలిసి అతడికి చేసిన ద్రోహమేదో ఉండి ఉంటుంది. ఏమిటా ద్రోహం?

అకస్మాత్తుగా....ఆత్మహత్య చేసుకున్న సీనయ్య కూతురు నీలమ్మ స్మృతిపథంలో మెదిలింది అతడికి.

"యస్. సందేహంలేదు. అదే అయి ఉంటుంది"

అతడు చావు బ్రతుకుల మధ్య కొట్లాడుతున్న శివ ప్రకాశ్ వంక చూస్తూ అడిగాడు.

"నీలమ్మను నీవూ, సింగడూ కలిసి చెరిచారు కదూ?"

"శివప్రకాశ్ ఒక్క క్షణం బాధగా కళ్ళు మూసు కున్నాడు. తరువాత ఔనన్నట్లుగా తలాడించాడు.

ఒక గొప్ప రహస్యాన్ని సాధించానన్న తృప్తితో

ఇన్‌స్పెక్టర్ ఉదయకుమార్ కళ్ళు జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి.

శివప్రకాశ్‌ను చూస్తూ ఉండమని కాళీకి చెప్పి.... అసలు హంతకుడు సీనయ్యను బంధించడానికి బయలుదేరాడతడు.

ముగింపు :

సీనయ్య తన నేరాన్ని ఒప్పుకొని చట్టానికి లొంగిపోయాడు.

"ఆ రోజు రాత్రి....

నేను సంతనుండి వచ్చానేమోనని కనుక్కోవడానికి బంగళాకు వెళ్ళింది నా ఒక్కగా నొక్క కూతురు నీలమ్మ. అప్పుడే విరిసిన మల్లె మొగ్గలాంటి నా నీలమ్మను ఆ రాక్షసులిద్దరు దారుణంగా చెరిచారు.

ఆ అవమానాన్ని భరించలేక కన్నీరు పప్పుతిని ఆత్మహత్య చేసుకొంది నా నీలమ్మ.

ప్రాణానికి ప్రాణం తీయడమే ధర్మమని భావించే జాతి మాది. అందుకే ఆ కామాంధులను వేటాడి చంపాను. ముందు సింగడ్ని చంపి ఆ నేరాన్ని శివప్రకాశ్ మీద వేశాను. మీకు అతడి మీద అనుమానం రావడానికే చెరువు ఒడ్డున అతని బూట్ల ముద్రలను వేశాను.

హంతకుడిగా అతడు ఉరికంబం ఎక్కుతుంటే చూడాలనుకున్నాను. ఇంకో ప్రక్క ఎందుకయినా మంచిదని నా ప్రయత్నాలు నేను చేస్తూనే ఉన్నాను.

ఊబినుండి తప్పించుకున్నాడు. ఈసారి కాళీని ప్రయోగించాను. ఒకవేళ కాళీ నుండి కూడా తప్పించుకోగల్గితే పులి పంజాలు ఉండనే ఉన్నాయి.

ఆ రాత్రి....కాళీ కూడా ఆ పులి గర్జనలను ఆలకిస్తుంది గాబట్టి....శివప్రకాశ్ పులిచేత చంపబడ్డాడని ఆమే ప్రత్యక్షసాక్ష్యం ఇస్తుంది అనుకున్నాను.

కాని....ఇన్ స్పెక్టర్ బాబూ! మీరు చానా తెలివైన వారు. నా ఎత్తుకు పై ఎత్తు వేసి నన్ను చిత్తుచేశారు.

అయినా పర్వాలేదు బాబూ....నా కిప్పుడెంతో తృప్తిగావుంది. ఈ రోజుతో నా నీలమ్మ ఆత్మకు శాంతి లభిస్తుంది."

అన్నాడతడు తన అరచేతులకు బేడీలను బిగిస్తున్న ఇన్ స్పెక్టర్ తో.

—: అయిపోయింది :—

# రావణ ప్రేమ

## ఎమ్.వి.ఎ. సత్యనారాయణ

జాఫ్నా—

సుమారు మూడు సంవత్సరాలుగా జాతుల సమస్య మీద అట్టుడికినట్టు వుడికి పోతోంది. శ్రీలంకలో తమిళుల ఆధిపత్యం తగ్గించాలనీ ఆ దీవినుండి తమిళులను పూర్తిగా తరిమి వేయాలని శ్రీలంక అధికారులు పంతం పట్టారు.

తమ తాత ముత్తాతలనుండి శ్రీలంకలో నివాసం వున్నామనీ, శ్రీలంక జాతీయ జీవన ప్రవంతిలో తమ సంస్కృతి అంతర్లీనమైపోయివుందనీ ఆ దీవిని ఖాళీ చేయవలసి రావడం తమ జాతికి ఆత్మహత్యా సదృశం అనీ తమిళుల వాదం.

తమిళుల స్థావరాలు హెచ్చు భాగం జాఫ్నా పట్టణం చుట్టుప్రక్కల వున్నాయి. శ్రీలంక సైన్యం తమిళ స్థావరాల మీద దాడి చేస్తోంది. తమిళులలో తీవ్రవాద పోరులు సైన్యాన్ని ఎదిరించారు.

శ్రీలంకలో తమిళ పోరాటవాదులకూ, అధికారపక్ష సైన్యానికీ యుద్ధం జరుగుతోంది. తమిళ తీవ్రవాదులు గెరిల్లా పోరాటంలోకి దిగారు.

ఎవరికి అందిన శత్రు పక్షాలను వారు విచక్షణా రహితంగా వూచకోత కోస్తున్నారు.

తమిళ పోరాటవాదులు అడవులలో గెరిల్లా స్థావరాలు నిర్మించుకున్నారు.

సైన్యానికి అగ్ర రాజ్యాలనుండి ఆయుధ సామగ్రి అందుతోంది. అటూ యిటూ వేలాది ప్రాణాలు మట్టిలో యింకిపోయి శ్రీలంక దీవి క్రమంగా స్మశాన సదృశమవుతోంది.

స్థావరాల్లో తమిళ పోరాటవాదులు యుద్ధగర్జనలో తలలు పగలగొట్టుకుంటున్నారు. శ్రీలంక సైన్యం నానాటికీ బలం పుంజుకుంటోంది. సైన్యం ధాటికి తట్టుకోవడమే కాకుండా తమ పోరాట పంథాలో కొత్త మార్గాలు ఎంచుకోవాలి! ఎలా?

'పదండి వీర జవాన్లారా!
పదండి శూర పతాకల్లాగా!
శత్రు మూకలను తరిమి తరిమి
సరిహద్దుల దాకా వురిమి వురిమి
చీల్చి చీల్చి పోగులు పెట్టగ
పదండి వీర జవాన్లారా!
పదండి శూర పతాకల్లాగా!'

కల్నల్ గుడారంలోంచి తలెత్తి చూశాడు. పాట అడవులలో మారు మ్రోగుతోంది అందమైన గొంతు! కోయిలలాగా చెట్ల కొమ్మలలో పాటను ప్రతిధ్వనిస్తోంది.

కల్నల్ తల తిప్పి గెరిల్లా వీరులవైపు సాభిప్రాయంగా చూశాడు.

గెరిల్లా వీరులు శ్రీలంక పటం ముందుంచుకుని తమ మార్గాలు ఎంచుకుంటున్నారు. ఎక్కడ పోలీస్ స్టేషన్లు వున్నాయి? ఎన్ని స్టేషన్లు సైనిక స్థావరాలుగా మారిపోయాయి? ఒక్కొక్క స్టేషన్ లో ఎంతమంది సైనికులు నిఘా వుంటున్నారు? విదేశాలనుండి అందుతోన్న ఆయుధ సహాకారం ఏ మార్గాల్లోంచి సైనికులకు సమకూడుతోంది? అడవి ప్రాంతంలో ఎక్కడ దాడి చేయవచ్చు? ఎలా తప్పించుకోవచ్చును?

ఇవీ వాళ్ళ ముందున్న ప్రశ్నలు!

గెరిల్లాలకు కావలసింది వాటి జవాబులు!

అందమైన గొంతులోంచి వెలువడుతోన్న పాట వాళ్ళను తాత్కాలికంగా దృష్టి మరలింప చేసింది.

"ఎవరా పిల్ల?" అరిచాడు కల్నల్.

గెరిల్లాలకు ఆ ప్రశ్నతో ధైర్యం వచ్చింది. పటం వదలిపెట్టి గెరిల్లాలు ముందుకు కదిలారు. గుడారం గుమ్మం దగ్గర కల్నల్ నిలబడ్డాడు.

దట్టమైన అడవి. ఎండ కిరణాలు నేలమీదకు పడటానికి సతతహరితారణ్యాలు అడ్డు పడుతున్నాయి. దూరంగా చెట్ల వెనుక కొండ. కొండమీదనుండి జలపాతం దూకుతోంది.

జలపాతం హోరు నేపథ్యగీతం పాడుతూంటే అందమైన పాట వాళ్ళలో హుషారు లేపుతోంది. తియ్యటి తేట తమిళంలో వినిపిస్తోంది ఆ పాట!

చెట్లకిందనుండి కాలిబాట!

కాలిబాటలో బంతిపువ్వు రంగు పరికిణీ, ముదురు

ఎరుపురంగులో జాకెట్టూ ధరించిన ఒక ఆకారం ప్రత్యక్షమయింది. హుషారుగా గెంతుకుంటూ, ఉల్లాసంగా పాడుకుంటూ ఎడా పెడా చేతులూపుతూ వస్తోంది ఆమె.

ఎగిరినప్పుడల్లా ఆమె యవ్వనం బరువులు లయబద్ధంగా ఊగుతున్నాయి.

గుడారానికి ఆమె అంతదూరంలో ఆగిపోయింది. కల్నల్‌ని చూచి కళ్ళు చికిలించింది. జుత్తు వెనక్కి దువ్వుకుంది. చామనచాయ మొహం. చెవులకు గానీ ముక్కుకు గానీ కాళ్ళా చేతులకూ గానీ ఎలాంటి ఆభరణాలూ లేవు. అప్పుడే విరబూచిన అడవి మల్లెలాగా వుందామె.

"ఏయ్ పిల్లా! యిటురా!" వేలితో సైగ చేశాడు కల్నల్. ఆమె మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చింది. కల్నల్ గుడారంలోంచి బయటికి వచ్చాడు.

"ఎవరునువ్వు" అడిగాడు కల్నల్.

"తంగం!"

"చూడు తంగం! నువు వయసులో వున్న ఆడపిల్లవి! సైనిక స్థావరాలు వెలిసిన యిలాంటి ప్రాంతాల్లో నీలాంటి ఆడపిల్ల తిరగకూడదు!"

"ఏం ఎందుకు తిరగకూడదు?"

"ఎందుకా?" వెనక్కి తిరిగి చూశాడు కల్నల్. గార్డుల చూపులన్నీ ఆమె యవ్వన శిఖరాలమీదా, నగ్నంగా కనిపించే మెడా, నడుమూ, లోతైన బొడ్డూ, పరికిణీ కింద కనిపించే బలమైన పిక్కలూ, ఎర్రటి తడి పెదవులనూ తడిమిచూస్తున్నాయి.

కల్నల్‌ని చూచి వాళ్ళు బలవంతంగా చూపులు మరల్చుకున్నారు.

"మగవాళ్ళ ఆకలి చూపులు చూశావా?" నవ్వాడు

కల్నల్.

“మీరూ మగవాళ్ళే కదా సార్!” అంది తంగం.

“నిజమేనమ్మా! నాకు నీ వయసు కూతురుంది. పరిస్థితులు సజావుగా వుండి వుంటే కూతురికి యీ పాటికి పెళ్ళి చేసి వుండేవాడినమ్మా! కాని....యిదిగోనమ్మా.... విప్లవమార్గం చేపట్టాను. ఇల్లూ, భార్యా కూతురూ సంసారం—అన్నీ యిక్కడే నమ్మా!”

తంగం కళ్ళు చిలికించి, “నన్ను కూడా మీరు మీ కూతురులాగా చూసుకోవచ్చునండి! అలా చేస్తారా? మీ నిబంధనలు ఒప్పుకుంటాయా?” అంది.

“ఏం చేయాలి, చెప్పమ్మా!”

“మీ రెజిమెంట్‌లో చేర్చుకోండి!”

“నిన్నా?”

“ఏం సార్?”

“ఆడదానివి కదా!”

“ఏం సార్! ఆడది యుద్ధానికి పనికిరాదా?”

“ఉహూఁ!”

“ఎందుకు పనికిరాదు సార్! ఎన్నో తీవ్రవాద వుద్యమాల్లో ఆడవాళ్ళు చేరారు కదా! వాళ్ళవలన ఉద్యమాలు బలపడ్డాయే కాని....నష్టపోయాయా?”

కల్నల్ చిరునవ్వు నవ్వాడు. తంగం ఉద్దేశ్యం మంచిదే! ఆమె వాదం సరియైనదే! శ్రీలంకలో జాతుల పోరాటం పంథా వేరు. లక్ష్యం వేరు. ప్రయోగించే విధానం వేరు. ఆ సంగతి ఆమెకు యెలా చెప్పి ఒప్పించ గలగడం?

“ఈ వుద్యమంలో నువ్వు యేం చేస్తావమ్మా?”

“పాటలు పాడతాను, వచన కవితలు రాస్తాను,

నిప్పుల వర్షం కురిపించి సైనికులను అందులో స్నానం చేయిస్తాను. మన గెరిల్లాలకు యింతకంటె యేలాంటి సహాయం కలిగించాలి?"

కల్నల్ ఈసారి పక పక నవ్వాడు.

"వెళ్ళిరావమ్మా! తాటాకు చప్పుళ్ళకే శ్రీలంక సైన్యం బెదిరిపోదు. ఈ సమయంలో కావలసింది కవితా శక్తి కాదు. కఠోరమైన దీక్ష! రక్తతర్పణం! అసిధారా వ్రతం!" కల్నల్ వెనక్కి తిరిగాడు.

తంగం మోహం చిన్నబోయింది.

గెరిల్లాలు ఆమెవైపు పరిహాసంగా చూశారు తరువాత కల్నల్‌తో సహా గుడారంలోకి వెళ్ళిపోయారు.

తంగం యింకా అక్కడే అడవిమల్లెలాగా నిలబడి పోయి వుంది.

## 2

తంగం ఆలోచనలో పడింది.

తాను తమిళ పోరాటవాదులకు యే రకంగా సహాకరించగలదు? తన కవితలు యీ సమయంలో పోరాట వాదులకు పనికి రావట. అయితే వాళ్ళకు పనికివచ్చే దేమిటి? రక్తతర్పణం!

రక్తం చిందిస్తే మాత్రం ప్రయోజన మేమిటి?

తంగం వెనక్కి తిరిగింది. ఆలోచించుకుంటూ నడుస్తోంది. పోరాటవాదులతో తాను కూడా కలిసి పోరాడాలి. వాళ్ళకు యుద్ధ విద్యలలో తన సహకారం అవసరం కావచ్చునేమో!

చెట్లకింద నుండి నడుస్తోంది తంగం.

ఇంటికి వెళ్ళాలా? తిరిగి వెనక్కి వెళ్ళి కల్నల్‌ని బతిమాలి రెజిమెంట్‌లో చేరాలా? ఆమెలో ఆత్మాభిమానం

వెల్లుబికింది. కన్నెర్లకి వుపయోగపడేలాగా వలిలే మంచిది! తనకు యీ విద్యలు ఎలా అబ్బుతాయి?

తంగం కొండ ఎక్కుతోంది. ఆమె ప్రక్కనుండి జలపాతం వురుకులు పరుగులు వినిపిస్తున్నాయి. చల్లటి తుంపరలు ఆమెమీదకు దూకుతున్నాయి. కొండమీదకు చేరుకుంది తంగం.

ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

స్టెన్ గన్ ఆమెవైపు గురిచూస్తోంది. శ్రీలంక సైనికుడు ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"ఏం పిల్లా! ఎక్కడి నుండి?" అడిగాడు ఆ సైనికుడు.

"ఎందుకు? ఎక్కడి నుండి వస్తుంటే నీ కెందుకు?" అంది తంగం.

సైనికుడు చెయ్యి చాపాడు. స్టెన్ గన్ అలాగే గురి వుంచి ఆమె చెయ్యి అందుకున్నాడు.

"భలేగా వుంది!" అన్నాడు కన్నుగీటి.

తంగం చలించలేదు. ఆమెకు ఈ అడవులలో ఇలాంటి అనుభవాలు కొట్టినపిండే! ఆ సైనికుడి కంట్లో పడకుండానే వుండవలసింది! కనబడ్డాక యిక చేసేదేముంది? ఆడవాసన తగిలి యెంతోకాలమైన సైనికులకు అంతకంటే వుదాత్తమైన ప్రవర్తన వుంటుందని ఆశించదు తంగం.

సైనికుడు ఆమె భుజంచుట్టూ చెయ్యి వేశాడు. ఆత్రంగా గుండెలకు హత్తుకున్నాడు స్టెన్ గన్ని ప్రక్కగా వుంచి ఆమెను నలిపెయ్యబోయాడు.

తంగానికి ఆ అవకాశం చాలును! ఏమయితే అయింది! శీలం పోయేకంటే యేమీ నష్టం కాదు! మోకాలు

ఎత్తింది. గురి చూసుకుంటోంది.

సైనికుడు ఆమె రవిక విప్పుతున్నాడు.

మోకాలిని బలంగా అతడి తొడల మధ్య గుచ్చింది. ఆ దెబ్బ అంత బలంగా అతడి ఆయువుపట్టుమీద తగులుతుందనిగానీ, అతడు అంత గిల గిల లాడతాడనిగానీ తంగం వూహించలేదు.

సైనికుడు గిలగిల లాడి ముందుకు వొంగాడు. తంగం మీద పట్టు సడలింది.

తంగం అంతటితో వూరుకోలేదు. సైనికుడ్ని ముందుకు దొర్లించింది. బలం మొత్తం ప్రయోగించి మరింత ముందుకు నెట్టింది.

సైనికుడు జలపాతంలోకి పడిపోయాడు.

తంగం యిక ఆలస్యం చేయలేదు. స్టెన్‌గన్ అంది పుచ్చుకుంది. చుట్టూ చూసి గన్‌తో ముందుకు నడుస్తోంది.

దూరంగా సైనికుల రభస వినిపిస్తోంది. తంగం అటు గాక రెండో వైపు దారిమళ్ళింది. హుషారుగా ఇటువైపు పరుగెత్తుతోంది.

తంగం యిల్లు చేరేసరికి తల్లీ మామయ్యా దెబ్బలాడుకుంటున్నారు.

“నువ్వు దానికి అతిస్వాతంత్ర్యం యిచ్చావు. అందుకే తంగం నన్ను కాదని తిరుగుతోంది. నీ మాట కూడా లెక్క చేయడం లేదు. ఏమంటావక్కా!” అంటున్నాడు మామయ్య.

“నన్నేం చేయమంటావ్ రా! నువ్వు దాని ముక్కుకు తాడు వేసుకో! పెళ్ళి చేసుకో! మధ్యలో నా అడ్డు యేముంది?” అంటోంది తల్లి.

"సరే....అలా అయితే ఈ రోజే తంగం మెడలు వొంచుతాను అక్కయ్యా! ఎలా పెళ్ళి చేసుకుంటావో చూడు!"

తంగం గుమ్మంలో ఆగిపోయింది. అక్కా తమ్ముళ్ళిద్దరూ ఇంకా యేం మాట్లాడుకుంటారో వినాలనుకుంది. స్టెన్ గన్ ను గోడకి చేరగిల బెట్టింది. నడుముకున్న తూటాల బెల్టు సర్దుకుంది.

"ఇప్పుడు యెక్కడికి వెళ్ళింది?" అడిగాడు మామయ్య.

"ఏవో పిచ్చి కవితలు రాస్తుందిరా తమ్ముడూ! వాటిని పాడి మన గొల్లా వీరులకు వినిపిస్తుందట! దాని పిచ్చి యేమిటో నాకు అర్థం కావడంలేదు."

"అలాగా అక్కయ్యా! ఈ పెళ్ళి అయిపోనివ్వు. దాని వ్యవహారం పూర్తిగా పరిష్కరిస్తాను. ఇక నువ్వు యిలాంటి బాదరబందీలు పెట్టుకోవద్దు!"

తంగం పళ్ళు గిట్టకరచింది. అక్కా తమ్ముళ్ళు తన పాలిట శత్రువులుగా మారిపోతున్నారు. దేశంలో జాతుల పోరాటం ముమ్మరంగా వుంది. శ్రీలంకలో ఇక తమిళు లుండాలా? లేదా దగ్గరలో వున్న మెయిన్ లాండ్ కి ప్రాణాలతో పారిపోవాలో యేదో ఒకటి తేల్చుకోవలసిన సమయం దగ్గరపడింది.

శ్రీలంక సైనికుడు యింతకు ముందే తన శీలంతో ఆడుకోబోయాడు. ఇప్పుడు మామయ్య తన బతుకుతోనే ఆడుకోవాలనుకుంటున్నాడు. కోపంతో స్టెన్ గన్ అందుకుంది. అచ్చంగా సైనికుడు పట్టుకున్నట్టుగా రెండు చేతులతోనూ పట్టుకుంది. స్టెన్ గన్ తో ప్రేల్చుతున్నట్టుగా అభినయిస్తూ ప్రవేశించింది.

అక్కా-తమ్ముళ్ళు నిర్ఘాంతపోయారు.

అక్కయ్య "ఏమిటయ్యా అది!" అంది తమ్ముడిని చూచి.

తమ్ముడు గుటక వేశాడు. తంగం స్టెన్ గన్ ని వూపుతూ అతడిని కోపంగా చూచింది.

"కా....ల్చ....క....!" మామయ్య చేతు లెత్తాడు.

తల్లి వైపు కూడా చేతులెత్తమన్నట్లుగా చూచింది తంగం.

"....ఎత్తే....అక్కయ్యా! అది తుపాకీ! కాల్చి పారేస్తుంది! చేతులెత్తే....ఏమే తంగం! నీకు ఆ తుపాకీ ఎక్కడిదీ?" అన్నాడు మామయ్య.

"నోరుముయ్! యింట్లోంచి బయటికి వెళ్తావా? కాల్చి పారెయ్యమంటావా?' అరచింది తంగం.

"వద్దు....వద్దు."

"ఏం? ఎందుకు కాల్చకూడదు? నిన్ను వదలిపెట్టను! మరల యీ యింట్లో కాలు పెట్టావా—అమ్మనూ నిన్నూ కాల్చి పారేస్తాను! గొళ్లాలతో తలిసిపోతాను!"

మామయ్య వణికిపోయాడు. మెల్లగా బయటికి అడుగులు వేశాడు.

తల్లి నోరావులించి చూస్తోంది.

ఏమిటీ పిల్ల? ఏమిటీ తెగింపు? తుపాకీని ఎలా సంపాదించింది? తుపాకీని పేల్చుతుందా? అసలు తుపాకీని పేల్చడం ఎక్కడ ఎలా నేర్చుకుంది?

తంగం పెరట్లోకి వెళ్ళింది. పెరటి తలుపు మూసింది.

స్టెన్ గన్ ని బలంగా ముద్దు పెట్టుకుంది.

ఏకలవ్యుడిలాగా ఆ యభ్యాసవతి శిక్షణ పొందడం ప్రారంభించింది.

# 3

కల్నల్ సైగ చేశాడు. అతని చేతిలో పెన్‌టార్చ్ వుంది. టార్చ్ వూపి తన అనుచరులకు సైగ చేశాడు. అనుచరులు చెట్లచాటునా పుట్టల చాటునా దాక్కున్నారు.

కల్నల్ తన చేతిలోని పెన్ టార్చ్‌ని వూపాక దూరంగా రైలుకూత వినిపించింది. వచ్చేది గూడ్స్‌రైలు! శ్రీలంక సైనికులకు కావలసిన ఆహార పదార్థాలూ, వస్త్రాలూ, ఆయుధ సామగ్రీ సరఫరా చేసే గూడ్స్ రైలు!

వంతెనకు ఆ చివరా యీ చివరా ఆకుపచ్చదీపాలు వెలుగుతున్నాయి.

చక చక వాగన్లు పట్టాలమీద దొర్లుతూన్నట్టు దూరం నుండి వినిపిస్తోంది.

కల్నల్ తలతిప్పి చూశాడు. ఇద్దరు సైనికులు అత్రుతగా వంగివున్నారు. వాళ్ళ చేతులలో ప్లాస్టిక్ కంట్రోలు పిడులు యిమిడివున్నాయి.

చీకటి! చీకటిలో ఆకుపచ్చ దీపాలు మాత్రమే రేడియం కాంతిపుంజాల్లాగా కనిపిస్తోన్నాయి. చీకటి తెరలమధ్య వెలుగు ముద్దలాగా ఇంజన్ దీపం కనిపించి అంతలోనే మాయమయింది. రైలు వస్తోన్న హోరు మరింత స్పష్టంగా వినిపిస్తోంది.

"వంతెనకు అవతల పచ్చదీపం వుందికదూ! ఆ దీపం యింజన్ చాటుకు వెళ్ళగానే పిడులు నొక్కాలి. తెలిసింది కదా! ఇంజన్ మాత్రమే వంతెనమీదకు ప్రవేశిస్తుంది అప్పటికే వంతెన పేలిపోతుంది వాగనుపట్టాలు తప్పి ప్రక్కల నున్న సిమెంట్ స్తంభాలను గుద్దుకుం

టాయి. పడితే పట్టాలకు అవతల పడతాయి. ప్రతి వాగన్‌లోని ఆహారపదార్థాలూ మనకు ముఖ్యమైనవే! ఆయుధసామగ్రీ ముఖ్యమైనదే!" అన్నాడు కల్నల్.

తమిళ గెరిల్లాలు తలలు వూపి ఆయనకు తెలియాలన్నట్టుగా, "ఎస్ సార్! అలాగే చేస్తాం!" అన్నారు.

గూడ్స్‌రైలు క్రమంగా దగ్గరవుతోంది.

క్రాయ్ నది పాయ ఒకటి చీలి యిటు జాఫ్నావైపు ప్రవహిస్తోంది. చిన్న వంతెన అది! నది పాయమీద నిర్మించారు. వర్షాలు బాగా వున్నా, మూలనదిలో బాగా నీరు యెక్కువగా వున్నా యీ పాయలో నీరుంటుంది. ఏడాదిలో యెక్కువ కాలం పాయ యెండిపోయి వుంటుంది.

ఇంజన్ మెల్లగా వంతెనవైపు దూసుకువస్తోంది. ఆకుపచ్చ దీపానికి పదిహేను ఇరవైగజాల దూరం వుండగానే దానికి వేగం తగ్గింది.

కల్నల్ తెల్లబోయాడు. గూడ్స్‌రైలు ఎందుకు వేగం తగ్గుతోంది?

డ్రయివర్లకు అనుమానం వచ్చిందా?

పైనుండి ప్రత్యేకమైన సూచనలు అందాయా?

లేకపోతే — తాము యిక్కడ కాచుకుని వున్నట్టు సమాచారం అందిందా?

గూడ్స్‌రైలు పూర్తిగా వేగం తగ్గి ఆగిపోయింది. ఆకుపచ్చ దీపానికి అయిదారు గజాలకు అవతలే ఆగిపోయింది.

"ప్రేల్చమా సార్?" అడిగారు గెరిల్లాలు. వాళ్ళ చేతులు యింకా పిడులమీదే బిగుసుకుపోయి వున్నాయి.

"వద్దు...." అన్నాడు కల్నల్.

"సార్, క్షమించండి! ఎందుకు వద్దంటున్నారో—" గెరిల్లాలు మాటలు యింకా ముగియక ముందే ఇంజన్ దీపానికి అడ్డంగా నీడలు కదిలాయి. నీడలు ఆకుపచ్చ దీపంవద్ద నిలబడి మాట్లాడుకుంటున్నాయి.

వాళ్ళు సింహాళీయులు.

వాళ్ళ చేతులలో యంత్రా లున్నాయి. వాళ్ళు యంత్రాల సహాకారంతో వంతెనమీద తణిఖీ మొదలు పెట్టారు.

కల్నల్ నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

సింహాళీయులకు వంతెనకు అమర్చిన తీగలు తగులు తాయి. బాంబులు కనిపిస్తాయి. అవి ప్రేలక ముందే బాంబులను డిఫ్యూజ్ చేస్తారు. తమ ప్రయత్నాన్ని సింహాళీయులు బూడిదలో పోసిన పన్నీరు చేస్తున్నారు.

పథకం ఎందుకు పాడయింది?

ఇపుడు వంతెనను కూల్చి ప్రయోజనం యేమిటి?

కేవలం వంతెన కూలిపోవడమే గాకుండా శ్రీలంక సైనికులకు అందవలసిన సహాయాన్ని తాము అందు కోవాలి. ఇప్పుడు అందుకున్నా లేకపోయినా శ్రీలంక సైనికులకు యిక్కడ తమిళ గెరిల్లాలు కాచుకునివున్నట్టు తెలుస్తుంది. తన పటాలం నాశనం చేయడానికి శ్రీలంక సైనికులు సిద్ధపడిపోతారు.

నాన్సెన్స్! అలా జరగకూడదు!

ఒక్కొక్క గెరిల్లా వందమంది శ్రీలంక సైనికులకు సమాధానం చెప్పాలి. అందుకే ఒక్కొక్క గెరిల్లాను వందమంది పోరాట వీరులుగా చూసుకుంటున్నాడు కల్నల్.

శ్రీలంక సైనికులు కమ్మీలు పట్టుకుని ప్రాకుతున్నారు.

కల్నల్ మెల్లగా వున్నచోటు నుండి ముందుకు వచ్చాడు.

వంతెనమీద మనుషులు నీడల్లాగా కదులుతున్నారు.

కల్నల్ అతడి అనుచరులూ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

వంతెనమీది నీడలు యింజన్ దీపం వెలుతురుకు అడ్డంగా పరుగెత్తాయి. సింహళ భాషలో వాళ్ళలో వాళ్ళు యేవో మాట్లాడుకున్నారు. కన్ను మూసి తెరిచేలోగా గూడ్స్ వెనుక వాగన్లలోంచి సైనికులు దిగారు. చీమలపటాలంలాగా మార్చింగ్ చేసుకుంటూ వంతెన మీదకు వచ్చారు. కొందరు వంతెన కిందకు దిగారు.

గూడ్స్ రైలు బయలుదేరింది. ముందుకు వంతెనమీదకు కాదు. వెనక్కి బయలుదేరింది.

కల్నల్ నిట్టూర్చాడు.

శ్రీలంక సైనికులను బ్లాస్టింగ్ కి బలిచేసి ఆహారపదార్థాలనూ ఆయుధాలనూ జాగ్రత్తపరచుకుంటున్నారన్న మాట!

వంతెనమీద సైనికులు ఎడాపెడా పొజిషన్స్ చూసుకుని నిలబడ్డారు. అంతకుముందే ఇంజన్ దీపాలు మసకబారిపోయి ప్రక్కకు తప్పుకున్నాయి. అందువలన సైనికులు యేం చేస్తున్నారో కల్నల్ కి తెలియలేదు.

వంతెనమీద నుండి తుపాకులు మోగుతున్నాయి.

ఇద్దరు గొల్లాలు ఎగిరిపడ్డారు. ఒకడికి భుజంలోంచీ మరొకడికి తొడలోంచీ తూటాలు దూసుకుపోయాయి.

"బ్లాస్ట్!" అరిచాడు కల్నల్.

గెరిల్లాలు బోర్లగిలపడి మోచేతులమీద నేలకు ఆని చెవులు మూసుకున్నారు.

వెయ్యి ఫిరంగులు ప్రేలినట్టూ, భూమీ ఆకాశం యేకమైపోయినట్టూ, చెవులు దిబ్బెళ్ళు పడేలట్టూ వంతెన పెద్ద పెద్ద శబ్దాలతో ఎగిరిపడింది. సిమెంటపాకాయల గుత్తి ప్రేలి ఒక్కొక్క టపాకాయ తునకలుగా చెల్లాచెదరయినట్టుగా శ్రీలంక సైనికులు గాలిలోకి తేలి పోయారు. చీకట్లో ఒక్కసారిగా వెలుగులు విరజిమ్మి ఆ వెలుగులో సైనికుల కాళ్ళూ, చేతులూ, తలలూ, మొండాలూ విస్తృతంగా ఎగురుతున్నాయి.

ప్రేలవలసిన డైనమెట్లు మొత్తం ప్రేలిపోయాయి.

సగంమంది అనుచరులను విడదీశాడు కల్నల్.

"మీరు ఈ చుట్టుపక్కల ప్రాంతాల్లో పడిన తుపాకులు ప్రోగుచెయ్యండి!" అని మిగతావాళ్ళను తన వెంట రమ్మన్నాడు.

శవాలను దాటుకుంటూ కాలువలో దిగి గెరిల్లాలు రైలుకేసి దొక్కారు. గూడ్స్ రైలు వెనక్కి వెళ్ళిపోయిన దారిన నడుస్తున్నారు. స్లీపర్స్ మీద పరుగు ప్రారంభించాడు కల్నల్. గెరిల్లాలు అతడి వెనుక పరుగెత్తుతూన్నారు.

కనుచూపు మేరలో గూడ్స్ రైలు యింజన్ దీపం కనిపిస్తోంది.

రెట్టించిన ఉత్సాహంతో కల్నల్ అతని అనుచరులూ పరుగెత్తుతున్నారు.

క్రమంగా దీపం దగ్గరవుతోంది.

దీపం దగ్గరయ్యేకొద్దీ గెరిల్లాలు మూడు వరసలుగా విడిపోయారు. గూడ్స్ రైలుకు చెరోప్రక్క చెరోవరసా,

స్లీపర్స్‌మీద ఒక వరసా చొప్పున పరుగులు తీస్తున్నారు.

ఇంజన్ లోంచి తుపాకులు ప్రేలుతున్నాయి.

కల్నల్ ఇంజన్ ప్రక్క వరసలో పరుగెత్తుతున్నాడు. జేబులోంచి చిన్న కొబ్బరికాడలాంటి వస్తువు తీశాడు. నోటితో దాని పిన్ వూడదీశాడు.

గురిచూచి విసిరాడు.

హేండ్ గ్రెనేడ్ యెక్కడ పడుతుందో అతనికి తెలుసు!

సంవత్సరాల తరబడి శిక్షణ పొందిన మనిషి అతడు!

స్వేచ్ఛకోసం, స్వాతంత్ర్యంకోసం అర్పణ అయిపోయిన వ్యక్తి అతడు!

అందుకే యింజన్‌లో ఢాం మ్మంది.

రైలు మరికొన్ని గజాలు వెనక్కి నడిచి ఆగిపోయింది. ఇంజన్ చచ్చిపోయినవాడి మస్తిష్కంలాగా మూగపోయింది.

గెరిల్లాలు మౌనంగా వాళ్లను సమీపించారు.

## 4

కొన్ని వందల ఎకరాల్లో షెడ్స్ కట్టివున్నాయి. షెడ్స్ మధ్య మైదానం తీర్చిదిద్ది వుంది. మైదానంలో తాలింఖానాలున్నాయి, వాలీబాల్ కోర్టులూ, టెన్నిస్ కోర్టులూ వున్నాయి. వాటికి కాస్త ఎడంగా షూటింగ్ టార్గెట్స్ వున్నాయి. తెల్లటి కార్డ్‌బోర్డ్ అట్టనున షుఱ వాటి వెనుక గోడలో గ్రాస్ బెడ్స్ అమర్చివున్నాయి. ఈత కొలనులూ కబాడీ కోర్టులూ సరేసరి!

వందల ఎకరాలచుట్టూ ముళ్ళతీగల కంచె ఏర్పాటు చేసివుంది.

మైదానంలో శ్రీలంక సైనికులు బారులుతీరి నిలబడి వున్నారు.

ఒక రెజిమెంట్ కవాతు చేస్తోంది.

కొంతిమంది రైఫిల్ షూటింగ్ లో తలమునకలుగా వున్నారు.

ఈతకొలనూ, వాలీబాల్ కోర్టూ, చివరికి కబాడీ కోర్టూ సైనికులతో గంభీరంగా కళకళ లాడుతున్నాయి.

సైనికుల మధ్యనుండి అటెండెంట్ హుందాగా నడుస్తోన్నాడు. అతని వెనుక పిల్లిలాగా అడుగులో అడుగు వేసుకుంటూ చుట్టూవున్న సైనికుల విన్యాసాలనూ, క్రీడలనూ చూచుకుంటూ ఒక లావుపాటి ముసలివాడు నడుస్తోన్నాడు.

అటెంకెంట్ ని మాట్లాడించాలన్నట్టు చూస్తున్నాడు ముసలివాడు. కాని అటెండెంట్ నడుస్తోన్న పోతపోసిన కంచువిగ్రహంలాగా సూటిగా వెళ్ళిపోతున్నాడు. ముసలివాడు దగ్గి గొంతు సవరించుకుని మాట్లాడే ప్రయత్నాలన్నీ ఆ విగ్రహం ముందు బూడిదలో పోసిన పన్నీరవుతున్నాయి.

ఇద్దరూ ఒక మారిరి పెంకటి-ట్లో ప్రవేశించారు.

అటెండెట్ ఒక గదిముం దాగాడు.

'బ్రిగేడియర్ శశిధరన్' అన్న నేమ్ బోర్డు తగిలించి వుంది గోడమీద. ముసలివాడిని బయట వుంచి అటెండెంట్ స్వింగ్ డోర్స్ తెరచుకుని లోపలికి వెళ్ళాడు. ఒంగి అభివాదం చేసి అరచేయి చాపి నేలవైపు చూపించాడు.

శశిధరన్ ప్రశ్నార్థకంగా తలెత్తాడు.

"సార్! ఇన్ ఫార్మర్ ...." అన్నాడు అటెండెంట్

శశిధర్ నే మొహం కందగడ్డ లాగా తయారయింది.

ఆ లెంటెంట్ వణికిపోయాడు. మనిషిని ఖతం చేసేటప్పుడు మాత్రమే బ్రిగేడియర్ మొహం అలా మారిపోతుంది. ముసలివానికి మరికొన్ని క్షణాలలో మూడ లేదు కదా!

"ప్రవేశపెట్టు!" అన్నాడు శశిధర్ నే. అలా అంటున్నప్పుడు రాగిరేకుమీద ఇనుప మేకుతో గీచినట్టు గొంతు జీరపోయింది.

ఆ లెంటెంట్ బతుకుజీవుడా అనుకున్నాడు. మరల వొంగి అభివాదం చేసి బయటికి వెళ్ళాడు.

ముసలివాడు దొంగ చూపులు చూసుకుంటూ లోపలికి ప్రవేశించాడు.

బ్రిగేడియర్ కి అభివాదం చేయబోయాడు.

"చాలించు నీ నక్క వినయాలు ముసలోడా!" అరిచాడు శశిధర్ నే.

ముసలివానికి పై ప్రాణాలు పైనే పోయాయి. అయినా గుండె దిటవు చేసుకున్నాడు.

"క్షమించండి సార్! చివరి క్షణంలో పథకం మార్చాడు కల్నల్!" అన్నాడు.

"నాన్సెన్స్! నీకు మేము ఇచ్చిన వాకీటాకీ ఏమైంది? పంది మేసినట్టు తింటున్నావ్ మా దగ్గర! నీవల్ల మా కెంత నష్టమో తెలిసిందా?"

"అవును సార్! కంచెన కాలిపోయింది. సైనికులు చచ్చిపోయారు."

"అంతేనా! అంతేనా నీ మట్టిబుర్రకి తెలిసింది! రెండువందలమంది సైనికులు సీమటపాకాయల్లాగా ప్రేలిపోయారు. రెండువందల తుపాకులు వాళ్ళదగ్గరా— వాగన్లలో నాలుగువేల తుపాకులూ. అయిదారు నెలలకు సరిపడా ఆహారం, వస్త్రాలూ నీ జాతికి సంక్రమించాయి. సమాచారం నువ్వు ఇస్తావని ఎదురుచూశాం నువ్వు మాకు వంతెన దగ్గర బెటాలియన్ సైన్యం కాపలా వుంటోందని చెప్పావు. వంతెనను ప్రేల్చివేయా అనుకున్నట్టు చెప్పావా? లేదు. ఆ విషయమే తెలిసివుంటే గ్రుడ్డిగా రెండువందలమందినీ వంతెనమీద నిలబెడతామా? గూడ్స్ రైలు మొత్తం నీ జాతికి పళ్ళెంలో పెట్టి ఒప్పచెబుతామా? నో....నో...."

"అవును సార్! చాలా నష్టం జరిగింది సార్!"

"ఎవరివల్ల? కేవలం నీ వల్ల!" బ్రిగేడియర్ గొంతు యింటిమీదున్న పెంకులను కదిలిస్తోంది.

"అవును సార్! క్షమించమని అడగడానికి కూడా నోరు రావడం లేదు సార్!"

"నోరు ఎలా వస్తుంది? ఉరితాటితో వ్రేలాడదియ్యమంటావా? బుద్ధభగవానుడు కనిపిస్తాడు. క్షణాల్లో మహానిర్యాణం ప్రాప్తిస్తుంది!"

ముసలివానికి గొంతు తడారిపోయింది. కసాయివాడు ఒక కాలు గొంతుమీద నొక్కిపట్టి రెండు చేతులతో బరువయిన పట్టాకత్తి ఎత్తి గొంతుమీద దింపుతున్నట్టు భ్రమ కలిగింది.

బ్రిగేడియర్ శశివర్ధనే పరమ కర్కోటకుడు. ఈ క్షణంలో పట్టాకత్తో ఉరితాడో తెప్పించి శిక్ష అమలు జరిపినా అనుమానం లేదు. కాళ్ళలో సత్తువ కారిపోయి

నట్టయి అలాగే మోకాళ్ళు పట్టుకుని ముందుకు కూలబడి పోయాడు.

"నీ తప్పుకు ప్రాయశ్చిత్తం ఒక్కటే!" అన్నాడు శశిధర్ జే.

"ఏమిటి సార్?"

"విషం ఇస్తాం! మీ వాళ్ళు ఎత్తుకుపోయిన ఆహారంలో విషం కలపాలి. కల్నల్ తాలూకా బలగం మొత్తం నాశనం కావాలి! గొల్లాల పటాలం ఆహారం తిని కిక్కురుమనకుండా చచ్చిపోవాలి!"

"ఆ బలగంలో నేను కూడా వున్నాను సార్!"

"ఒరేయ్ ఫూల్! నువ్వు విషాహారం తింటావో తినవో అది నీ మీద ఆధారపడి వుంటుందిరా! నువ్వు తినేముందు పటాలంలో అందరూ ఆహారం తిన్నట్టుగా నిర్ధారణ చేసుకోరా!"

"అలాగే సార్! తమరికి కబురు చెప్పాలికదా సార్! నేను తినను సార్!"

"ఊఁ! ఈసారి ఫెయిలయ్యావో నేనే నా చేతులతో చంపుతానురా....!" అని శశిధర్ నే చప్పట్లు కొట్టాడు.

అంతరంగికులు యిద్దరు పరుగెత్తుకుంటూ వచ్చారు.

బ్రిగేడియర్ కి అభివాదం చేసి అర చేతులు భూమికి సమాంతరంగా చాపి నిలబడ్డారు.

"సోడియం సైనేడ్ ఒక కిలో పొట్లం ఈ ముసలివానికి ఇవ్వాలి!" అన్నాడు శశిధర్ నే.

* * *

అరగంట తర్వాత ట్రక్కు అడవి మధ్యలో ఆగింది.

ముసలివాని కళ్ళకుకట్టినగంతలు విప్పాడు డ్రయివర్.

ముసలివాడు కళ్ళు నలుపుకొన్నాడు. డ్రయివర్ అతని చేతికి సంచి అందించాడు.

"ముసలివాడా! నిన్ను ప్రాణాలతో చూడాలను కుంటున్నాను. ఈ గడ్డమీద పెరిగినందుకు కృతజ్ఞత చూపించుకో!" అన్నాడు డ్రయివరు.

ముసలివాడు సంచి భుజానికి తగిలించుకుని నడక పుచ్చుకున్నాడు. ట్రక్కు వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

ముసలివాడు సంచి తడుముకున్నాడు. కొన్ని లక్షల మంది ప్రాణాలు తియ్యగల సోడియం సైనైడ్! ఈ పటాలం తర్వాత మరొకటి—దాని తర్వాత మరొకటి—శ్రీలంకకు బ్రిగేడియర్ తర్వాత హోదాలో తానూ, తన సంతానం అధికారులుగా వుంటారు. ఎవరెలా పోతే తనకేం?

దూరంగా గెరిల్లా కవాతు చప్పుడు వినిపిస్తోంది.

ముసలివాడు చటుక్కున చెట్టెక్కాడు. మూటను కొమ్మల మధ్య వ్రేలాడగట్టాడు. కిందకు దిగి మూటవైపు పరీక్షగా చూశాడు. కొమ్మలలోకి వస్తే తప్ప అక్కడ మూట వున్నట్టు తెలియదు. ముసలివాడు చెట్టుక్రింద నుండి కదిలి వెళ్ళాడు.

పొదల చాటునుండి ఒక ఆకారం అతనినే పరిశీలిస్తోంది. ఆ ఆకారం చేతిలో స్టెన్‌గన్ వుంది. ఆ ఆకారాన్ని ముసలివాడు చూడలేదు. చూచినా యేమంత పట్టించుకునేవాడు కాదు.

## 5

సిధ్ధార్ధ నగరం వదలిపెట్టింది బస్సు.

కండక్టరు ఒకసారి బస్సును పరిశీలనగా చూచి ఛార్ట్

పూర్తిచేశాడు. ప్రయాణీకులంతా జాఫ్నా నగరానికే! మధ్యలో యెవరూ దిగరు. తలుపు లోపలివైపు తాళం పెట్టి తన సీట్లో కూర్చున్నాడు కండక్టర్.

ప్రక్క ప్రయాణీకుడిని సరదాగా కదిపాడు. "సోదరా! అందరూ జాఫ్నాకే బయలుదేరారు. విశేషం యేమిటి సోదరా?"

ప్రయాణీకుడు కోపంగా చూశాడు.

"అది సరే...." కండక్టరు మరింత హుషారుగా చూశాడు. "బస్సులో అందరూ మగవాళ్ళే! ఒక్క ఆడది కూడా లేదు. కళ లేదు సోదరా...." అన్నాడు.

అతడి మాట ఇంకా చివరి అక్షరంలో వుండగానే కండక్టరు నోరు అలాగే తెరచుకుని వుండిపోయింది. అతడి నోట్లో పిస్తోలు గొట్టం ఇరుక్కుపోయి వుంది. పిస్తోలు గొట్టం అంగుడికి తగులుతోంది.

"నువ్వు తమిళుడివి! అవునా?" అడిగాడు ప్రయాణీకుడు.

"కాని....నిన్ను యిక్కడ వుద్యోగం చేసుకోనిస్తున్నాం. మా సింహళ గడ్డమీద నిన్ను బతకనిస్తున్నాం. నీకు విశ్వాసం వుండాలి. అవునా?"

కళ్ళు మరల ఆరాయి. బస్సులో కర్కశమైన నవ్వులు మారుమ్రోగాయి.

"తమిళ గెరిల్లాలు ఎక్కడ వుంటారు? వాళ్ళ స్థావరాలను పట్టుకోవడం యెలా? ఈ విషయాలు సేకరించి మాకు చెప్పు నీ విశ్వాసం నిరూపించుకో!"

'మీరంతా సైనికులా సార్!' అన్నట్టు కళ్ళు మరల ఆరి వెలిగాయి.

"అవును. జాఫ్నా చుట్టుప్రక్కల తమిళుల కొంపలు

లూటీ చేస్తాం. నువ్వన్నావు చూడు అందమైన ఆడ పిల్లలు! వాళ్ళ శీలాలతో బంతులాట ఆడుకుంటాం!"

కండక్టరు గడగడ వణికిపోయాడు. అతని యిల్లూ వాకిలీ జాఫ్నా నగరం శివార్లలో వుంది. బస్సు తన యింటిమీదుగానే వెళ్తుంది. కసాయి మనుషులను తన బస్సులో ఎక్కించుకుని వెళ్తున్నాడా తాను? యెలా? యీ ప్రమాదం తప్పేదెలా?

"ఏం కండక్టరూ! నీ వ్యవహారం చూస్తే తమిళ స్థావరాలు తెలిసినట్టే తోస్తోంది.... చెబుతావా! తూటా నీ కంఠంలో దింపాలా?"

కండక్టరు యేం చెప్పేవాడో కాని....ఏం జరిగిందో కాని....

"ఢాం....ఢాం!... ఢాం....! ....ఢాం! ఢాం... ఢాం...."

బస్సు ఆరు టైర్లూ పిల్లలూదుకునే బుడగల్లాగా పేలిపోయాయి. అంతే! బస్ కర్ కర్ మని చప్పుడు చేస్తూ రోడ్డుమీద నుండి పంటపొలాల్లోకి దూకింది. ప్రయాణీకులూ, కండక్టరూ, డ్రయివరూ కిందకీ మీదకీ కొట్టుకుని గాయాలు తగిలించుకున్నారు.

బస్సు ఆగగానే కండక్టరూ డ్రయివరూ కిటికీలలోంచి దూకేశారు. బస్సుమీద నిప్పుల వర్షం కురుస్తోంది. కండక్టరూ డ్రయివరూ కుంటుకుంటూ దూరంగా పారిపోయారు.

బస్సుమీద గ్రెనేడ్ పడింది.

బ్రహ్మాండమైన విస్ఫోటం! ప్రయాణీకులు మాంస ఖండాలుగా గాలిలో చెల్లాచెదురై పోయారు. బస్సు భగభగ మండుతోంది. నరమాంసం వేగుతోంది. ద్వేషం

జ్వాలలు మానవతను మసిపాలు చేస్తోన్నాయి.

కల్నల్ వికటాట్టహాసం చేస్తూ రోడ్డుమీదికి వచ్చాడు. అంతసేపూ రోడ్డుకి రెండువైపులా దాక్కున్న అతని అనుచర వర్గం ఇవతలకు వచ్చింది. జయజయ ధ్వానాలు చేసుకుంటూ పాకీరం వైపు నడిచారు.

వాళ్ళ కోసమే ముసలివాడు కాచుకూర్చున్నాడని గెరిల్లాలకు తెలియదు. సంతోషంగా ఆహారం పొట్లాలు అందుకున్నారు.

ముసలివాడు సంభ్రమంగా గుడారాల మధ్య తిరుగుతున్నాడు. చెట్లమీద గార్డులు కాపలా వున్నారు. వాళ్ళ చేతుల్లో కూడా ఆహారం పొట్లాలున్నాయి.

గుడారాల మధ్య బారులుతీరి నిలబడి వున్నారు గెరిల్లాలు. విజయోత్సాహంతో పొట్లాలు విప్పారు.

వాళ్ళకు తెలియదు. అదే తమ అందరికీ చివరిముద్ద కావాలని మాత్రమే ముసలివాడు సంభ్రమంగా గుడారాల మధ్య తిరుగుతున్నాడని!

గెరిల్లాలు తింటున్నారు. నవ్వుతూ తుళ్ళుతూ తింటున్నారు.

సోడియం సైనేడ్ తింటున్న ఒక్కడూ నేలకూలడం లేదు. కనీసం కడుపునొప్పితో కూడా గిలగిల లాడటం లేదు.

ముసలివాడు తెల్లమొహం వేశాడు.

తాను మరల మోసపోయాడు. గబగబా తన గుడారంలోకి పరుగెత్తాడు. చెట్టు కొమ్మల మధ్య నుండి తీసుకువచ్చిన మూట విప్పాడు. పోలిథిన్ సంచిలో తెల్లటి పంచదారలాంటి స్ఫటిక పదార్థం వుంది.

ఈ పదార్థమే బ్రిగేడియర్ శశిధర్ నే యిప్పించాడు.

ఈ ప్రకారం సోడియం సైనేడ్ కాదా? రుచి చూడ వచ్చునా?

గొట్టం వంటి వస్తువు అతని డొక్కలో గుచ్చుకొంది.

ముసలివాడు కంగారుగా తలతిప్పి చూశాడు. తంగం! ఆమె చేతిలో స్టెన్ గన్ వుంది.

"ఏం జాతిద్రోహీ! దేనికోసం వెదుక్కుంటున్నావ్?" అంది తంగం.

ముసలివాడికి నోటివెంట మాట రాలేదు. నిలువు గ్రుడ్లేసుకుని చూస్తున్నాడు.

# 6

బ్రిగేడియర్ శశిధర్ నే హుషారుగా బయలుదేరాడు. పాతికమంది మెరికల్లాంటి వీరులను వెంట పెట్టుకుని రెండు ట్రక్కులలో బయలుదేరాడు. ట్రక్కులకు టయోటా కారు దారి చూపిస్తోంది.

టయోటాలో నే శశిధర్ నే కూర్చున్నాడు. శశిధర్ నే ప్రక్కనే ఆయన అంతరంగికుడు కూర్చున్నాడు.

"ముసలివాడు గట్టిపిండం! జాఫ్నా సరిహద్దులలో గెరిల్లాలను మట్టుపెట్టాడు. వానికి మంచి బహుమతి ఇవ్వాలి!" అంటున్నాడు శశిధర్ నే.

ఆ అంతరంగికుడు తల వూపాడు.

టయోటా నగరం పొలిమేరలలో ఆగింది.

ముసలివాడు రోడ్డు ప్రక్కనే నిలబడి చెయి వూపు తూండటమే అందుకు కారణం!

టయోటా వెనుకనే ట్రక్కులు రెండూ ఆగాయి.

ఫ్లాష్ ... ఫ్లాష్ ...

అంతే! ముసలివాడు వెనక్కి విరుచుకుపడిపోయాడు.

ట్రక్కులమీదా టయోటామీదా గ్రెనేడ్ల వర్షం కురిసింది. శశివర్ధనే కారును ముందుకు పోనిచ్చాడు. కారు ముందుభాగం తుక్కు తుక్కయిపోయింది.

అయినా శశివర్ధనే ఆగలేదు.

ట్రక్కులు రెండూ కాంతివంతంగా ముందుకూ న్నాయి.

"బ్రిగేడియర్ తప్పించుకుపోతున్నాడు. టయోటాను ప్రేల్చెయ్యండి!" అరిచాడు కల్నల్.

గెరిల్లాలు టయోటావైపు మిషిన్‌గన్స్, స్టెన్‌గన్స్ ఎక్కుపెట్టారు. మరుక్షణంలో ఆ గన్స్ గర్జిస్తాయనుకుంటే జాతీయ రవాణా బస్సు అడ్డుగా వచ్చింది. బస్సులో అమాయక ప్రయాణీకులు దిగ్భ్రాంతితో చూస్తున్నారు. ట్రక్కులు మండి మసైపోతున్నాయి.

గెరిల్లాలు మారణాయుధాలు దించారు. బస్సును వెళ్ళిపోనిచ్చారు. టయోటా రోడ్డు చివర మాయమై పోతూ కనిపించింది.

గెరిల్లాలు నిట్టూర్చారు.

వెనక్కి తిరిగి స్థావరాలకు వచ్చారు.

తంగం వాళ్ళను నవ్వుతూ చూచింది.

కల్నల్ ఆమె భుజం తట్టి. "ఆహా! నువ్వు యీ రోజు మమ్మల్ని విషాహారం తినకుండా కాపాడావు. అంతే కాదు! మన పోరాటయోధుల రహస్యాలు అమ్ముతూన్న తుచ్ఛుడిని పట్టియిచ్చావు. జాతుల విముక్త పోరాట చరిత్రలో నీకు గొప్ప స్థానం వుంటుందమ్మా!" అన్నాడు.

తంగం మొహం పౌర్ణమి చంద్రుడిలాగా వెలిగింది.

"అయితే కల్నల్ సార్! ఈ గెరిల్లా పోరాట

యోధులతో బాటు నేను కూడా యిక మీతో కలిసి పని చేయవచ్చును! మీకు అభ్యంతరం వుండదు కదా!" అంది.

కల్నల్ మొహం మాడిపోయింది.

ఆ ఔత్సాహితురాలైన ఆడపిల్లకు ఎలా చెప్పడం? గెరిల్లా శిబిరాల్లో ఒక ఆడదాన్ని — అందులోనూ యువ్వనవతిని యిలా చేర్చుకోవడం? దేశవ్యాప్తంగా వున్న విముక్తి పోరాటాలకు తను గెరిల్లా సేన విభిన్నంగా వుంటే అది యెలాంటి పరిణామానికి దారితీస్తుంది?

తంగం నీరసంగా నవ్వింది. వెనక్కి తిరిగి చక చకా వెళ్ళిపోయింది.

కల్నల్, ఆయన అనుచరులూ నిర్ఘాంతపోయి తంగం వైపు చూస్తున్నారు.

## 7

బ్రిగేడియర్ శశివర్ధనే మొహంలో వెలుగు కనిపిస్తోంది.

అమెరికా నుండీ, పాకిస్తాన్ నుండీ తమిళజాతి అణచివేతకు తనకు మద్దతు లభిస్తోంది. ఆయుధ సామగ్రీ, ఆహార పదార్థాలూ దిగుమతి అవుతున్నాయి. అణచివేతకు ఇంకా యేం కావాలో అడగమని కబురు పంపాయి అమెరికా, పాకిస్తాన్లు.

తమ దేశపు ప్రధాని మద్దతు వుండనేవుంది. కావలసిందల్లా అగ్రరాజ్య మద్దతు. అమెరికా అగ్రరాజ్యం క్రిందకు వస్తుంది కదా! ఆ మద్దతు చాలు! తనకేం సహాయం కావాలో స్పష్టంగా అడిగాడు శశివర్ధనే.

అంతే! బాంబర్ విమానాలు పంపించింది అమెరికా.

వాటిని గెరిల్లాలమీద వాడటానికి యీ రోజే

ముహూర్తం.

శశిధర్ నే తన పటాలాలతో బాంబర్ విమానాలతో బయల్దేరాడు. అడవులమీద బాంబర్స్ ఎగురుతున్నాయి. గూఢచారిశాఖ అందించిన సమాచారం ప్రకారంగా భౌగోళిక రేఖలను చూచుకుంటూ అడవులమీద ఎగిరిస్తున్నారు విమానాలు. దట్టంగా పెరిగిన అడవుల మధ్య పొదలు పొడలుగా గుడారాలు కనిపిస్తోన్నాయి.

బాంబర్ విమానాలు నిప్పులముద్దలు విసిరాయి.

మట్టి చెరిగినట్టయి ఉవ్వెత్తున లేచి పడింది. భూమి పగిలిపోయిందా అన్నంత శబ్దంతో బాంబులు నేలను తాకి అన్ని మూలలకు నలభై అయిదు డిగ్రీల కోణంలో భూఖండాలు లేపుతోంది.

గుడారాలు నేలమట్టమయ్యాయి.

అరణ్యభాగం యెవరో శక్తివంతుడు పెద్ద ఆయుధంతో చెక్కి పారేసినట్టయింది. చెట్లు కూకటి వ్రేళ్ళతో తిరగబడ్డాయి.

బాంబర్ విమానాల్లోంచి పారాచ్యూట్ లతో సైన్యం దిగుతున్నారు.

బాంబుల వర్షం ఆగిపోయింది!

"ఒక్క శవం కూడా పైకగరలేదేం?" అడిగాడు శశిధర్ నే.

"అవును సార్! నాకూ అనుమానంగా వుంది!" అన్నాడు అంతరంగికుడు.

* * *

గుహారాలు ఖాళీ చేసి అలసిపోయి వున్నారు గెరిల్లాలు. ఆయుధాలూ ఆహారమూ ఇతర అవసరమైన సామగ్రీ అసలు గుడారాల నుండి మోసుకుపోయారు.

అంతకు ముందురోజే మెయిన్‌లాండ్ రేడియో ఒక వార్తను ప్రసారం చేసింది.

శ్రీలంక ప్రభుత్వానికి అమెరికన్ ప్రభుత్వమూ దానితాబేదార్లూ సహాకరిస్తున్నాయని ఆ వార్త సారాంశం.

గుడారాలు ఖాళీ చేయించే పని అప్పటినుండి ప్రారంభింపచేశాడు కల్నల్. అప్పుడు తాత్కాలికంగా చిరాకు పడినప్పటికీ బాంబర్ విమానాలు మార్గంలో బాంబులు కురిపిస్తోన్నప్పుడు ఆయన చర్య ఎంత సమర్థనీయమో వాళ్ళకు అర్థమైంది.

బాంబులు మాత్రమే కురిపించి విమానాలు తిరిగి శ్రీలంక స్థావరానికి వెళ్ళిపోతాయి అని ఊహించడం మాత్రం తప్పు అవగాహన క్రిందకు వస్తుంది. అలా వచ్చింది కూడా. పారాచ్యూట్స్‌లో దిగిన సైనికులు అడవులలో రేచుకుక్కల్లాగా చొచ్చుకుపోతున్నారు.

గెరిల్లాలు ఎటు తప్పించుకున్నారు? గుడారాల్లో ఒకరు కూడా లేరు. వాళ్ళకి బాంబర్ విమానాలు వస్తున్నట్టు తెలుసా?

పుట్టలూ, గట్లూ, చెట్లూ, చేమలూ వెతుకుతున్నారు సైనికులు.

క్యాయ్ నది మెల్లగా ప్రవహిస్తోంది. నదికి రెండు ప్రక్కలా దట్టమైన అడవులున్నాయి. సైనికులు అడవులలో పడ్డారు. నదిలో తక్కువ లోతు నీళ్ళు వున్నచోట గెరిల్లాలు కనిపించారు.

సైనికుల కళ్ళు మెరిశాయి.

చప్పుడు చేయకుండా అటు కదిలారు.

గెరిల్లాలు నిశ్చింతగా దుస్తులు వుతుక్కుంటున్నారు.

గట్టుమీద ఇద్దరు గెరిల్లాలు అడవుల్లోకి చూస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు సైనికులు చెట్లచాటు నుండి సమీపించడం వాళ్ళిద్దరికీ తెలియదు.

సైనికులు పిన్స్ విసిరే పిస్తోళ్ళు తీశారు. సోడియం సైనేడ్ పూసిన పిన్స్ యిద్దరి గెరిల్లాల శరీరాల్లో దిగబడ్డాయి.

గెరిల్లాలు నిశ్శబ్దంగా పొదలమీదకు వొరిగిపోయారు.

సైనికులు గట్టుమీది పొదలమాటున దాక్కున్నారు. గెరిల్లాలు మొత్తం పాతికమంది వున్నారు. మిగతా వాళ్ళు గట్టుకు అవతల ప్రక్క వుండివుంటారు. సైనికులు పిన్స్ విసిరే పిస్తోళ్ళు గురిచూచుకుంటూ గట్టు దిగుతున్నారు. నదిలో వున్న గెరిల్లాలను నిశ్శబ్దంగా చంపాలి. అలా చంపాలంటే ఇంకా దగ్గర రేంజ్ కి వెళ్ళిరావాలి. అందుకే సైనికులు నీటికి దగ్గరగా వెళ్తున్నారు.

పిన్స్ కుచ్చుకునే రేంజ్ దగ్గరపడింది. ప్లాప్ .... ప్లాప్ .... ప్లాప్ ....

సైనికుల చేతుల్లో పిస్తోళ్ళు గుస గుస లాడుతున్నాయి.

ఒడ్డుకు రాబోతున్నారు ముగ్గురు గెరిల్లాలు. వాళ్ళు ముగ్గురూ తూలిపోయి నీళ్ళలో పడిపోయారు. వాళ్ళ భుజాలమీద పిడిచిన దుస్తులున్నాయి. దుస్తులు నీళ్ళలో పడి బుడగలుగా తేలుతూన్నాయి.

నది మధ్య గెరిల్లాలు తెల్లబోయి చూస్తున్నారు. వాళ్ళు నిరాయుధంగా వున్నారు. సైనికులు గట్టుదిగి దాదాపు నీళ్ళదగ్గరకు వచ్చేశారు. నది రెండో గట్టుకు పారిపోయే వ్యవధి లేదు. సమయస్ఫూర్తిగా చటుక్కున నీళ్ళలో మునిగిపోయారు.

అయినా పిన్స్ వచ్చిపడుతూన్నాయి. ప్రవాహజలం గాకపోతే సోడియం సయినైడ్ వాళ్ళను పొట్టన పెట్టుకునేదే! మునిగి ఈత కొడుతూ అవతలి ఒడ్డుకు వెళ్తున్నారు. సైనికులు కూడా నీళ్ళలో దిగుతున్నారు.

కల్నల్ నిట్టూర్చాడు. పారాట్రూపర్స్ తమని వెంటాడుతారనుకోలేదు. తన తప్పుడు అంచనాకు అయిదుగురు వీరులు మరణించారు. తక్కువలోతు నీటిలో చేపల్లాగా తాము దొరికిపోయారు. అయినా నిరుత్సాహపడకుండా గెరిల్లాలు మునిగి ఈతకొడుతున్నారు.

"ధాం.... ధాం.... ధాం...."

తమ జీవిత కాలం ముగిసిపోయింది. నీళ్ళలోంచి దూసుకువస్తాయి అగ్నిరవ్వలు. వాటినుండి తప్పించుకొని ఎంతో దూరం వెళ్ళలేరు.

కల్నల్ చివరిసారిగా తన జాతిని తలచుకున్నాడు. విశక్షత పేరుతో తన జాతిమీద జరుగుతూన్న దాడిని గుర్తుకు తెచ్చుకొన్నాడు. తాము సింహాళులమీద దాడి చేసినా సింహాళులు తమమీద దాడిచేసినా ఆ రెండు దాడులూ ఒకటేనేమో!

రెండు దాడులూ రెండు రకాలయితే కావచ్చు కాని ఆ రెండు దాడులలోనూ అమాయకులూ అర్భకులూ ఎక్కువమంది నాశనమైపోతారు.

కల్నల్ కళ్ళు తెరచి గట్టువైపు చూశాడు.

ఆశ్చర్యం! సింహాళ సైనికులు నేలమీద పొర్లుతున్నారు. రక్తపుమడుగులో ఈదులాడుతున్నారు. వాళ్ళవైపు ఒక ఆకారం నదివైపు వస్తోంది. ఆకారం చేతిలో మెషిన్ గన్ వుంది. మెడచుట్టూ నడుముచుట్టూ తూటాల పట్టీలున్నాయి. ఆకారం పైనుండి క్రింది వరకూ లోహపు

పట్టీలు ధరించి వుంది.

ఆకారం అక్కడి నుండే కల్నల్‌కి శాల్యూట్ కొట్టింది.

కల్నల్ నీళ్ళలోంచి ఆమెవైపు నడిచాడు. అనుచరులు అతనిని అనుసరించారు.

"నువ్వా? మా ప్రాణాలు కాపాడావమ్మా!" అన్నాడు కల్నల్. గట్టుయెక్కి ఆమె భుజాలు తట్టి నుదురు ముందుకు అదుముకొని బలంగా ముద్దు పెట్టుకున్నాడు.

కల్నల్ అనుచర గెరిల్లాలు ఆమె చుట్టూ చేరి విప్ఫారిత నేత్రాలతో తమ కృతజ్ఞతలు తెలుపుకొన్నారు.

"సార్! ఇప్పటికయినా నన్ను మీతో కలుపుకోండి సార్! ఈ మట్టికోసం ఈ మట్టిమీద మనజాతి మనుగడకోసం మీతో బాటు ఒక పౌరురాలిగా పోరాటం సాగిస్తాను సార్!" అంది తంగం.

కల్నల్ దిగ్భ్రాంతితో చూస్తున్నాడు.

ఈ యువతి కెంత పట్టుదల? ఎంత సాహసం? ఎటువంటి గురి? ఎటువంటి గుండె 'బ్బరం?

అనుచర గెరిల్లాల వైపు ప్రశ్నార్థకంగా చూశాడు కల్నల్. వాళ్ళ కళ్ళలో అతనికి ఆమోదం కనిపించినట్టుంది.

"తప్పకుండానమ్మా! ఇతర పోరాటవర్గాలు కాదన్నా సరే నా సొంత బాధ్యతమీద నిన్ను నా వర్గంలో చేర్చుకుంటానమ్మా!"

తంగం అతని చేతులు పట్టుకుంది.

'నా మాట నిలబెట్టుకుంటాను సార్!' హామీ వుంది ఆ స్పర్శలో.

# 8

బ్రిగేడియర్ శశిధర్ నే కార్యాలయం.

సైనికుల మొహాలు వెలవెలబోతున్నాయి. పెటీ ఆఫీసర్లయితే సరేసరి! గడగడా వణుకుతున్నారు. కల్నల్, మేజర్ పదవులు వున్నవాళ్ళయితే తమకి చావు మూడినట్టే నిశ్చయించుకున్నారు.

శక్తివంతమైన బాంబర్ విమానాలు గాలిలో పోరాడి పోరాడి ఖాళీ అయిపోయాయి. మరల అమెరికావైపూ పాకిస్తాన్ వైపూ నోరావులించి చూచుకోవలసిన పరిస్థితి ఎదురయింది.

అంతే కాదు.

ఉన్న సైన్యంలోకల్లా మెరికల్లాంటి పారాట్రూపర్స్ నాశనమైపోయారు. వాళ్ళ శవాల పార్శిల్ భద్రంగా పంపించారు గెరిల్లాలు.

దానికంటే ప్రమాదకరమైన అంశం!

గెరిల్లాలు సందేశం పంపించారు. శ్రీలంక అధికారుల హిట్ లిస్టు తయారుచేసి పంపించారు. బ్రిగేడియర్ శశిధర్ నే పేరు అగ్రస్థానంలో వుంది.

బ్రిగేడియర్ తన గదిలో పచార్లు చేస్తున్నాడు. బూట్ల శబ్దం అతి భయంకరంగా బయటికి వినిపిస్తోంది. అధికారులకూ, సైనికులకూ బూట్ల చప్పుడు గుండెలమీద తాకుతోంది.

బ్రిగేడియర్ శశిధర్ నే ప్రాణభయంతో వణకడం లేదు. గెరిల్లాల మనోనిబ్బరానికి మండిపోతున్నాడు. అదే సమయంలో తన సైనికుల చేతకానితనానికి చీదరించుకుంటున్నాడు. మేకల మందలాగా లక్షల సంఖ్యలో వున్నారు సైనికులు. లాభం యేమిటి? గెరిల్లాలు అన్ని

మూలల్లోనూ కలసి నూగో కంతు కూడా వుండకేమో!

చిక్కు చిక్కు మంటూ అటెండెంట్ లోపలికి వచ్చాడు

మేజర్లూ, కల్నల్సూ బయట వుండిపోయారు. అటెండెంట్‌ను లోపలికి తోశారు. ఆ సంగతి శశివర్ధనే పసికట్టాడు. అంత టెన్షన్‌లోనూ శశివర్ధనే మంద హాసం చేశాడు

“ఏం యిటు వచ్చావు?....” అన్నట్టు కళ్ళెగరేశాడు.

“సా....ర్ మరండీ సా....సా....ర్!” గుటక వేశాడు అటెండెంట్. “గొరిల్లాల ఆచూకీ అట సార్! ఇస్తానని మరొకడు సార్! వచ్చాడు సార్!” నాలుక తడారిపోయింది అటెండెంట్‌కి.

“వాడెవడు? ఇంతకుముందు వచ్చిన ముసలాడేనా?” అడిగాడు శశివర్ధనే.

“కాదు సార్ .... ఇతనికి ముప్ఫయ్యేళ్ళుంటాయ్ సార్!” అన్నాడు అటెండెంట్.

“పంపించు!”

మరో రెండు నిమిషాలలో ముప్ఫయ్యేళ్ళ యువకుడు లోపలికి వచ్చాడు.

“తంగం మా మరదలు సార్! నన్ను కాదని చెప్పి వెళ్ళిపోయింది సార్. గొరిల్లాలతో చేరిపోయింది సార్!” అన్నాడతడు.

“అయితే యేం చెయ్యమంటావ్?”

“గొరిల్లాలుండే చోటు చూపిస్తాను సార్! తమరు వాళ్ళను పట్టుకుని నా మరదలిని నాకు యిచ్చేస్తే చాలు సార్!”

"తంగం నిన్ను పెళ్ళి చేసుకోనందా?"

"అవును సార్!"

"గెరిల్లాలు ప్రస్తుతం ఎక్కడున్నారు?"

"ట్రింకోమలీ పట్టణానికి యిరవై కిలోమీటర్లలో సార్!"

"ట్రింకోమలీ! అసంభవం!"

"ఏం సార్?"

"అక్కడ బలమైన సైనిక స్థావరాలున్నాయి. గెరిల్లాలకు ఆ సంగతి బాగా తెలుసు. కోరి కోరి మృత్యువుకు ఎదురుగా ఎవరూ పరుగెత్తరు!"

"తంగం వాళ్ళ అమ్మతో చెప్పింది సార్! ట్రింకోమలీని స్వాధీనం చేసుకుని........ఆ సాయుధ సామగ్రితో...."

"ఊఁ! ఆగావేం చెప్పు!"

"హిట్ లిస్టులో వున్నవాళ్ళందరినీ చంపేస్తారట సార్!"

శశిధరన్ అతన్ని తేరిపార చూశాడు. ఈ యువకుడు నిజమే చెబుతున్నాడా? లేక గెరిల్లాల తరఫున తనను బెదిరించడానికి వచ్చాడా?

ఆ మాటే అడిగాడు శశిధరన్.

యువకుడు గడగడ లాడాడు. ఇదేమిటి? శశిధరన్ ఇలా ఎదురుతిరిగాడు?

"లే....లే....దు....సా....సా....ర్...."

"అబద్ధమైతే ఎందుకు వణుకుతావు?"

"నా తంగం కోసమే నేను వచ్చాను సార్! అందమైన పిల్ల సార్! విప్లవకారుల స్నేహం పట్టింది సార్! తంగంను కాపాడాలి సార్!"

"మా వెంట రావాలి నువ్వు. గెరిల్లాలను చూపించాలి! సరేనా?"

"అలాగే సార్! కాని నేను దూరంగా వుంటాను సార్!"

"ఏం?"

"మీ వెంట నన్ను చూస్తే గెరిల్లాలు మొదట నన్నే చంపేస్తారు సార్!"

"పిరికిపందా! యెప్పటికయినా చావు తప్పదు కదా!"

"క్షమించండి సార్! నా తంగం కోసం నేను బతకాలి సార్!

క్షణాల్లో శ్రీలంక సైన్యం సిద్ధమైంది. ట్రింకోమలీ పట్టణాన్ని వైరులెస్‌లో సంప్రదించాడు బ్రిగేడియర్. గెరిల్లాలు ట్రెంకోమలీని పట్టుకోనున్నట్టు వాళ్ళకు కూడా వార్తలందాయట! ఆ విషయం చెప్పబోతూండగానే బ్రిగేడియర్ వాళ్ళకు అదే విషయంమీద ప్రశ్న వేశాడు.

శ్రీలంక సైనికులు ట్రెంకోమలీవైపు బయలుదేరారు.

బ్రిగేడియర్ శశిధరనే నాయకత్వం వహించాడు. టాంకర్స్, హెలికాప్టర్లూ పాల్గొంటూన్న యీ భారీ సైన్యం సన్నాహంలో కాల్బలమే ఒక్కువ పైగా వుంది. సింహాళ జాతీయులే తమ సైన్యం చేసే ఆర్భాటాలు చూచి పడికారు.

• • •

బ్రిగేడియర్ ఖాళీచేసిన సైనిక పావరంలో తక్కువ మంది గార్డ్సు వున్నారు. వైర్‌లెస్‌లో సందేశం వచ్చింది.

అమెరికా అధ్యక్షుడి తరఫున అంతరంగికుడు యిచ్చిన సందేశం అది.

"బాంబర్ విమానాలు నిర్వీర్యమైపోయినట్టు తెలిసింది. అదనంగా విమానాలు కావాలా? అధ్యక్షులవారు అడగమన్నారు!" అన్నాడు అ. అ. అంతరంగికుడు.

అతడికి సమాధానం చెప్పే శక్తి అక్కడున్న ఎవరికీ లేదు.

గార్డ్సు మొహాలు చూసుకున్నారు.

"ట్రింకోమలీ పట్టణానికి బయలుదేరారు సార్! వారితో వైర్‌లెస్‌లో మాట్లాడి చెబుతాను సార్!" అన్నాడు గార్డు.

అ. అ. అంతరంగికుడు మండిపడ్డాడు.

"ఈ విషయం కూడా చెప్పు! మొన్నటి బాంబర్ విమానాల ఖర్చు వెంటనే మాకు జమకట్టవలసి వుంది!"

అవతల లైన్ అకస్మాత్తుగా కట్ అయింది.

గార్డ్సు ఈసారి ఇంకా తెల్లబోయి మరల మొహాలు చూసుకున్నారు.

లైన్ దానంతటది అదే కట్ అయిందా? వైర్‌లెస్ సందేశానికి మధ్యలో మరెవరయినా విఘాతం కలిగించారా? ఏమైనప్పటికీ అమెరికావాళ్ళకి కోపం వచ్చింది. అది చాలు—దేశం ప్రాణంమీదికి వచ్చింది.

వెంటనే వార్తాహరులు బయలుదేరారు.

# 9

గొరిల్లాలు నిజంగానే బయలుదేరారు. చాల దీర్ఘప్రయాణంమీద వున్నారు గొరిల్లాలు. చావో రేవో తేల్చుకోవాలనుకుంటున్నారు గొరిల్లాలు. అయితే వాళ్ళ ప్రయాణం ట్రింకోమలీవైపుగా కాదు.

"కొడితే ఏనుగు కుంభస్థలాన్ని కొట్టాలి! రైళ్ళు పడగొట్టి, వంతెనలు కూల్చివేసి సైనిక స్థావరాలమీద చిన్న చిన్న దాడులు చేసి మనం ఎంతకాలం శ్రీలంక సైనికులతో పోరాడగలం? మీ ఆలోచన చెప్పండి! ఎక్కువ మంది అభిప్రాయాలు ఎటు మొగ్గితే అటుప్రక్క ఆచరణలో దిగుదాం!" అన్నాడు కల్నల్.

"మన శక్తి తక్కువ. సాధించవలసింది యెక్కువ. శ్రీలంకకు అగ్రరాజ్యం మద్దతు వుంది. కాస్త నిదానంగా ఆలోచించండి!" అన్నాడు ఒక గెరిల్లా. అతడు నడివయస్సువాడు.

"ఆలోచించేదేం వుంది? ఎంతకాలం ఇలా బాంబు దాడులకు గురవుతూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకు తిరుగుతాం? రాజధాని నగరాన్ని పట్టుకుందాం! పరిపాలకులను బంధించుదాం! అప్పుడు సైన్యం లొంగిపోతుంది!" అన్నాడు ఒక యువ గెరిల్లా.

"అవును. ఇటునుండి కాకపోతే అటునుండి నరుక్కురావాలి!"

"సైన్యంతో ఎంత కాలమని పోరాడతాం? ఎన్ని మూలల నుండి సైన్యంతో పోరాడినా మనకు లాభించేదేం వుంది? మనం నానాటికీ తగ్గిపోతాం. వాళ్ళు నానాటికీ పెరిగిపోతారు."

"కరెక్ట్ బ్రదర్! అగ్రరాజ్యాల నుండి సైనికులు రవాణా అయినా ఆశ్చర్యంలేదు. ఈ లోగానే మన పని చక్కబెట్టుకోవలసి వుంది!"

గెరిల్లాలలో కలకలం రేగింది. అందరూ తలా ఒక అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు. శిబిరంలో రణగొణ ధ్వనిగా వుంది.

"ఇంతకీ తంగం యెక్కడ?" ఒక యువకుడు గుస గుసలాడాడు.

"ఇంటికి వెళ్ళింది!" అన్నాడు మరొకడు.

"ఎందుకు?"

"నీకు తెలియదా?"

"ఊఁహూఁ!"

"ఆమెకో మామయ్య వున్నాడు. తెలుసా? అతను తంగం అంటే పడిచస్తాడు. తంగం మనతో కలిసిపోవడం అతనికి ఇష్టంలేదు. ఎలా అయినా సరే తంగాన్ని పెళ్ళి చేసుకుని తల్లిని చేసి ఇంటికి కట్టిపడేయాలని అతని వుబలాటం!"

"ఊఁ! అతని కోరిక తీర్చడానికి వెళ్ళిందా?"

"కాదు....ఒక పథకం వేసింది. నీకు ప్రయాణం మధ్యలో చెబుతానులే! ముందు ఆ చర్చ విను. నువ్వు దీర్ఘ యాత్రలో వస్తావా? ఇక్కడిక్కడే వుండి సైనికులతో దాగుడుమూత లాడతావా?"

"కల్నల్ కీ జై! ఇంక్విలాబ్ జిందాబాద్!"

"కాలంబో పోదాం! కూల్చేద్దాం శత్రువును!"

"తుల్ఫ వరిల్లాలి! విశక్షత నశించాలి!"

నినాదాలతో గోల్లాలు కదిలారు. తంగం గురించి మాట్లాడుకుంటూన్న ఇద్దరూ కూడా నినాదాలతో గొంతు కలిపారు. కంచర గాడిదల మీదా, ఎడ్లబండ్ల మీదా ఆహారసామగ్రి తరలి వెళ్తోంది. దొంగిలించిన మిలిటరీ ట్రక్కులలో యుద్ధసామగ్రి భద్రపరచుకున్నారు.

అడవి దారిలో అయిదారు వర్గాలుగా చీలిపోయి ఒకరి వెనుక ఒకరు జైత్రయాత్రలో పాల్గొన్నారు. శ్రీలంక దేశంలో యెక్కడెక్కడ తమిళ విమోచన పోరాట

వాడు ఉన్నారో వాళ్ళందరూ ప్రయాణం మధ్యలో కలుసుకున్నారు. చీమల దండులాగా అడవులలో నడుస్తున్నారు.

గమ్యం వాళ్ళకి తెలుసు! సరిగ్గా నడిస్తే యెంత కాలంలో గమ్యం చేరుకుంటారో తెలుసు! కాని ప్రయాణం సజావుగా జరుగుతుందా? సైన్యం తామూహించినట్టు ట్రింకోమలీలో కేంద్రీకృత మవుతుందా?

గెరిల్లాలలో ప్రతి ఒక్కరి ఆలోచనా యిదే!

పగళ్ళు గడుస్తున్నాయి. రాత్రిళ్ళు పగళ్ళుగా మారుతున్నాయి. వాళ్ళకి రాత్రీ పగలు ఒకటిగానే గడుస్తోంది. అలసటగా తోస్తే ఆగుతున్నారు. టీ కాచుకుంటున్నారు. కంచరగాడిదలమీది ఆహారాన్ని రేషన్ ప్రకారంగా తింటున్నారు.

నాలుగోనాటి రాత్రి అందరికీ గొప్ప అలసటగా వుంది. గుడారాలు వెలుచుకొచ్చాయి. ఆ రాత్రికి 'తుల్ఫ్' (తమిళ యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్) పూర్తి విశ్రాంతి తీసుకోవాలని నిర్ణయించుకుంది.

భోజనాలు ముగిశాయి. తేనీరు సేవించారు.

నడుములు వాల్చాలనుకున్నారు.

అడవిలో గుర్రపుడెక్కల చప్పుడు మారు మ్రోగుతోంది ఎండుపుల్లలూ, ఎండుటాకులూ డెక్కల తాకిడికి పెళ పెళ లాడుతున్నాయి

గార్డ్సు చప్పున యాక్షన్‌లోకి వచ్చారు. తుపాకులు గురిపెట్టి చప్పుడు వస్తోన్నవైపు వెళ్ళారు.

'పదండి వీరజవానల్లారా!
పదండి శూర పతాకల్లారా!
శత్రుమూకలను తరిమి తరిమి

సరిహద్దులు దాటా ఉరిమి ఉరిమి
చీల్చి చీల్చి పోగులు పెట్టగ' ॥పదండి॥

గార్డ్సు తుపాకులు దించారు.

ఆ గొంతు వాళ్ళకు సుపరిచితం! గుర్రపు డెక్కల చప్పుడు నేపథ్య సంగీతంగా వినిపిస్తోన్న ఆ విప్లవగీతం వాళ్ళను వుడుకెత్తించి శత్రువులమీదికి వురిగొలిపే గీతం! వాళ్ళు కూడా గొంతు కలిపారు. గెరిల్లాలు గొంతు కలిపారు. అన్ని దిశలనుండి తమ తమ బెటాలియన్లను తీసుకువచ్చి గెరిల్లా ప్రవాహంలో కలిపేసిన గెరిల్లా సేనాధిపతులు గొంతు కలిపారు.

కాగడాలు ఆమెకు స్వాగతం పలికాయి. కారుచీకటిలో కాంతికిరణంలాగా ఆమె వేగంగా దూసుకు వచ్చింది. సమరోత్సాహం మూర్తీభవించి వున్నారు గెరిల్లాలు. వాళ్ళ మధ్య గుర్రం నుంచి దిగింది. పోరాట యోధులకు తలవాల్చి అభివాదం చేసింది.

"తంగం! ఇంతకాలం యేమైపోయావ్?" అడిగాడు కల్నల్.

"సార్!" తంగం టోపీ తీసింది. "నా మామయ్య సైనిక స్థావరానికి వెళ్ళాడు. ఒక మిలటరీ ట్రక్కువాడిని బతిమిలాడి స్థావరం చేరుకున్నాడు. నేను అతడిని వెంటాడాను. గుర్రంమీద వెంటాడినట్టు అతనికి తెలియదు సార్! బ్రిగేడియర్ శశిధర్ సేత్తో మాట్లాడాడు సార్! వాళ్ళు మన పథకం ప్రకారంగా ట్రింకోమలీ పట్టణానికి బయలుదేరారు. ఆ వార్త నిర్ధారణ చేసుకుని మీ కోసం వచ్చాను. మీ శిబిరం తగలబెట్టారు. అడవిలో గుర్తులు వెదుక్కుంటూ మీ జాడ పట్టేశాను సార్!" అంది తంగం.

కల్నల్ ప్రశంసాపూర్వకంగా చూశాడు. అంతలోనే తిరిగి తన గెరిల్లాలవైపూ సోదర సేనాధిపతులవైపూ గంభీరంగా చూశాడు.

"చూశారా! అడవులలో మన జాడలు అంత స్పష్టంగా దొరుకుతున్నాయన్న మాట! మనం మరింత జాగ్రత్తపడాలి!" అన్నాడు కల్నల్.

"సార్! నాకు అనుమతి ఇవ్వగలరా సార్?" అడిగింది తంగం.

"ఏమిటమ్మా?" అన్నాడు కల్నల్.

"మనవద్ద సోడియం సైనెడ్ వుంది. దానితో నేను ట్రింకోమలీ వెళ్తాను సార్! శత్రువుల ఆహారం విషపూరితం చేస్తాను సార్!"

"చాల ప్రమాదం తంగం! పట్టుబడితే ఆడదానివని కూడా కనికరించరు!"

"ఆ సంగతి నాకు విడిచిపెట్టండి సార్!"

మిగతా సైనాధికారులవైపు సాలోచనగా చూశాడు కల్నల్.

వాళ్ళు ఆమోదపూర్వకంగా తలలు వూపారు.

తంగం ఆ రాత్రే బయలుదేరింది. ఆమె యింకా అక్కడే వుంటే ఆమెకు చాలా సంగతులు తెలిసి వుండేవి.

ఆమెను వెంటాడుతూ శత్రుసైనికులు (శ్రీలంక సైనికులు) నలుగురు వచ్చారనీ, గెరిల్లాల స్థావరాన్ని చూశారనీ, చూచినవాళ్ళు ప్రాణంతో లేరనీ, గెరిల్లాల ఆహారపు నిల్వలను కొంగచాటుగా వాళ్ళు చేరుకోలేకపోయారనీ తెలిసి వుండేవి. తంగం బయలుదేరిన అరగంటలో ఆహారనిల్వలు దగ్ధమయ్యాయి.

# 10

ఖాళీస్థలం. ట్రింకోమలీ పట్టణం వెలుపల వేలాది ఎకరాల ఖాళీస్థలం. పట్టణం చుట్టూ వంద గజాలకు యిద్దరు చొప్పున సైనికులు కాపలా వున్నారు. ఖాళీస్థలంలో మిగతా సైనికులు దినకృత్యాల్లో మునిగిపోయారు. ఖాళీస్థలానికి నాలుగుప్రక్కలా వాచ్ అండ్ వార్డ్ పోస్టులు వెలిశాయి.

కవాతులూ, వంటపనులూ, సైనిక స్థావరాల నుండి వచ్చిన రహస్య సమాచారాలు డీకోడింగులూ, వాళ్ళకు ప్రతిక్షణం యిచ్చే సూచనలూ—మైదానం హడావుడితో నిండిపోయి వుంది.

ఖాళీస్థలంలో గుడారాలు బారులుతీరిన ఏనుగులమందల్లాగా వున్నాయి. గుడారాల మధ్యలో రంగు రంగుల టార్పాలిన్స్‌తో ప్రత్యేకమైన గుడారం వుంది. ప్రత్యేక గుడారం మీదనే బైనాక్యులర్స్ కేంద్రీకరించింది తంగం.

గుడారం బయట మిలటరీ దుస్తులలో వున్న ఇద్దరు యువకులు కాపలా వున్నారు. వాళ్ళతో సివిల్ డ్రస్‌లో వున్న యువకుడొకడు నవ్వుతూ మాట్లాడుతున్నాడు. ఆ యువకుడిని గుర్తుపట్టింది తంగం.

'మామయ్యా!' అంది తనలో తాను. ఒకసారి తాను నిలబడివున్న చెట్టువైపు చూచుకుంది. ఎత్తయిన అశోక వృక్షం. ఆకులు గుబురుగా పెరిగివున్నాయి. అశోక వృక్షాలు ఆ వరుసలో యింకా వున్నాయి. వృక్షాల వరుసకి అవతల విశాలమైన ఊట చెరువు వుంది.

చెరువులోంచి నీళ్ళు తీసుకువెళ్తున్నారు సైనికులు. వాళ్ళు అశోక వృక్షాల క్రింద నుంచే వెళ్ళాలి! చెరువు

ఖాళీ అవుతుందేమో అన్నంత పెద్ద మొత్తాలలో నీళ్ళు మోస్తున్నారు. చెరువు చుట్టూ అయిదుగురు సైనికులు అక్కడొకరూ ఇక్కడొకరూ కాపలా వున్నారు. వాళ్ళు ఇంతలో వెళ్ళేలాగా లేరు.

విషం ఎలా కలపాలి?

గుడారాల వద్దకు తంగం వెళ్ళలేను. సులువుగా గుర్తు దొరికిపోతుంది. యూనిఫారం లేదా! సైనాక్యలర్స్‌తో మరోసారి చూచింది.

మామయ్య గుడారంలోకి వెళ్ళాడు.

సైనికులు అశోకవృక్షాల క్రింద నుండి నీటి గుండికలు నెత్తిపెట్టుకుని వెళ్తున్నారు. చప్పుడు చేయకుండా కిందికి దిగి కొమ్మల మధ్య వీలుచూచుకుని ఆగింది.

తాను తెగించాలి! తప్పదు! పోయేది తన ప్రాణం మాత్రమే! కాని తన ప్రాణం పోయేలోపుగా యెన్ని ప్రాణాలనయినా సరే బలి తీసుకోవాలి! తప్పదు!

* * *

అతనివైపు కోపంగా చూశాడు శశివర్ధనే.

"ఏరీ! ఎక్కడ గెరిల్లాలు? మనం యిక్కడికి వచ్చి అప్పుడే అయిదో రోజు! వాళ్ళు యీ దరిదాపులలో ఎక్కడా వున్నట్టు అలికిడే లేదు. అంతకు ముందు ట్రింకోమలీ నుండి అందిన గెరిల్లా సమాచారం కూడా నకిలీ వ్యక్తులు పంపిందే! చూడబోతే నువ్వు గెరిల్లాల తరఫున సైన్యానికి అపకారం చేయడానికి వచ్చినట్టు నా అనుమానం!" అరిచాడు బ్రిగేడియర్ శశివర్ధనే.

తంగం మామయ్య తల దించుకున్నాడు. ఇలా జరిగిందేమిటి? తనకి స్పష్టంగా వినిపించింది. తంగం గెరిల్లా యూనిట్‌తో కలసి ట్రింకోమలీ పట్టణానికి బయలు

దేరింది. అయితే యింతవరకూ గొల్లాల ఆచూకీ ఎందుకు తెలియలేదు ? శ్రీలంకలో మరో ట్రింకోమలీ వుందా?

ఆ మాటే సంశయంగా పైకి అన్నాడు మామయ్య.

బ్రిగేడియర్ యెగిరి క్రిందపడినంత పని చేశాడు. "ఏమంటున్నావ్ కుక్కలకొడుకా? ట్రింకోమలీ మరొకటి వుందా? ఇండియాలో మరో మద్రాస్ వుందా? వుందనుకో వోకేయ్....మద్రాసు అనగానే నీకు యే మద్రాసు గుర్తొస్తుంది వోకేయ్—సినిమాలు తీసే మద్రాసేనా? అందువల్ల నువ్వు ట్రింకోమలీ అని గనుక విని వుంటే ఇదేరా కుక్కలకొడకా!"

మామయ్య మొహం నల్లగా మాడిపోయింది. తంగం కోసం తాను కక్కుర్తి పడి యింతదూరం వచ్చాడు. యిప్పుడు ఆ కక్కుర్తి కాస్త తన ప్రాణంతీసేలాగా వుంది.

చప్పట్లు కొట్టాడు బ్రిగేడియర్.

మామయ్య స్థిరనిశ్చయానికి వచ్చాడు. తనను మరి కొంతసేపట్లో కాల్చి చంపేస్తారు. తనజాతికి ద్రోహం చేసినా ఫలితం దక్కలేదు. వంగి శశివర్ధనే కాలు పట్టేసుకుంటే? యిక్కడే పిస్తోలుతో కాల్చిపారేస్తాడేమో!....

ఆటెండెంట్ రావడానికి బదులుగా బయట కలకలం వినిపిస్తోంది.

బ్రిగేడియర్ శశివర్ధనే మొహం చిట్లించాడు. చటుక్కున లేచి గుడారం తెర వొత్తిగించి చూశాడు.

సైనికులు బారులు తీరి భోజనాలకు కూర్చునట్టున్నారు. బారులలో వున్నవారంతా వెనక్కి విరుచుకు పడిపోయారు. వంట జరిగేచోట సైనికులు చచ్చిపోయి వున్నారు. నీళ్ళు తీసుకువచ్చే సైనికులు ఎక్కడివాళ్ళక్కడే విరుచుకు పడిపోయారు. గంగాళాలు తిరగబడిపోయి

వున్నాయి. నీళ్ళు పాకినంత మేరా ఒకటే అరా శవాలు ప్రత్యక్షమయ్యాయి. ఆ నీటిలో నే కొంతమంది సైనికులు అటూ యిటూ కంగారుగా పరుగెత్తుతున్నప్పటికీ వాళ్ళకు ఎలాంటి అపకారమూ జరగడం లేదు.

"వాటీజ్ దిస్? ఏమయింది?" అరిచాడు బ్రిగేడియర్.

వాచ్ అండ్ వార్డు సైనికులు పరుగెత్తుకు వచ్చారు. అటెన్షన్‌లో నిలబడ్డారు.

"సార్! చెరువులో విషం కలిసిందేమో సార్!" అన్నాడు ఒకడు.

"చేపలు చచ్చిపోయాయా?" అరిచాడు బ్రిగేడియర్.

విషం కలిసిందేమో అని చెప్పినవాడు బుర్ర గోక్కున్నాడు.

"రాస్కెల్స్! పొండిరా! సన్నాసి! నాలుగు ప్రక్కలా వెతకండి! విషం ఎలా కలిపారో ఎక్కడ కలిపారో కనుక్కోండి! పాతిక వేలమంది సైనికులు పోయార్రా! ఒకరూ యిద్దరూ కాదు! పొండిరా! నా ప్రాణానికి దాపరించారు. అదిగో....లోపల ఒకడున్నాడు కదా! ఇన్‌ఫార్మర్! వాడిని యీ ఖాళీస్థలంలో ఇప్పుడే నా కళ్ళముందే వురితీసి చంపండి! చచ్చేవరకూ వదలకండి ఆ కుక్కని!"

వైర్‌లెస్ సెట్టు బీప్ బీప్ మంది.

బ్రిగేడియర్ శశివర్ధనే అందుకున్నాడు.

"సార్! గెరిల్లాల ఆహారం పూర్తిగా ధ్వంసం చేశాం సార్! ఆకలికి అలమటించి పోతున్నారు సార్! ప్రస్తుతం ఇంద్రజిత్ ఉద్యానవనాల దగ్గర అడవులలో తిరుగుతున్నారు సార్! అతి సులువుగా దొరికిపోతారు సార్!"

బ్రిగేడియర్ శశివర్ధనే విషపు నవ్వు నవ్వాడు.

గెరిల్లాలు దొరికిపోయారు! విమానాల్లో బయల్దేరాలి. అడవులలో వుండేళ్ళను వేటాడినట్టు వేటాడాలి!

తంగం మామయ్య గింజుకుంటున్నాడు. అరుస్తున్నాడు. ఏడుస్తున్నాడు.

అతన్ని ఊరిలోయ్యవైపు యీడ్చుకుంటూ వెళ్తున్నారు.

*    *    *

విమానాలు ఎందుకు బయలుదేరాయో యెక్కడికి బయలుదేరాయో తంగం అర్థం చేసుకుంది. గెరిల్లాల సమాచారం అంది వుంటుంది. విమానాలు వెళ్ళేదిశగా గుర్రాన్ని పరుగెత్తించింది.

# 11

గెరిల్లాల పరిస్థితి యిరకాటంగా తయారయింది. అడవులలో దొరికే కందమూలాలు తిని ఆకూ అలమూ తిని కాలక్షేపం చేస్తున్నారు. మరోప్రక్క వాళ్ళ పాత పాతరాలు పూర్తిగా బాంబు దాడులకు గురయి నాశనమైపోయాయి. ఇంద్రజిత్ వుద్యానవనాలకు దగ్గరలో తలదాచుకుందామంటే విమానాలు యిక్కడ కూడా గిరికీలుకొట్టి నిప్పులవర్షాలు ప్రేల్చుతున్నాయి.

ఆకలికీ, కూటాలకూ గెరిల్లాలో శక్తి నశించిపోవడమే కాదు. సగంమంది బలగం నశించిపోయింది. చచ్చిపోయిన వాళ్ళను త్రవ్వి గోతుల్లో పెట్టడానిక్కూడా వాళ్ళకు శక్తిలేకుండా పోతోంది.

బ్రిగేడియర్ శశిధర్ నే స్వయంగా విమాన దాడులు నిర్వహిస్తున్నాడు. విమానదాడులు ప్రారంభించి రెండో రోజు మగుస్తోంది. చెట్లు విరిగిపోయీ, వేళ్ళతో సహా తిరగబడిపోయీ ప్రకృతి బీభత్సంగా వుంది. అసలే

అడవి. చెట్లు విరిగిపడి దారులన్నీ మూసుకుపోయాయి. బోనులో చిక్కుకుపోయిన సింహాల్లాగా అయిపోయింది. ఆ ప్రాంతాన్ని దాటి వెళ్ళిపోవడానికి లేదు. అక్కడే వుండిపోయి మరీ దయనీయంగా ప్రాణాలు పోగొట్టుకోవడం హితవుగా లేదు. ఆయుధాలు చేతబట్టి పోరాడే వోపిక కూడా లేకుండా పోయింది. ఇలా వుండగా మూడో కోజాకూ విమాన దాడి ప్రారంభమయింది. ట్రెంచిలలో దాక్కున్నారు గెరిల్లాలు.

ఏం జరిగిందో ఏమో మొదటి రౌండ్ యింకా కాల్చకుండానే విమానం తోక భాగం నిప్పంటుకుంది. విమానం దారితప్పిన ప్రయాణీకుడిలాగా గిరికీలు కొట్టింది. ఏటవాలుగా నేలమీదకు దూసుకువస్తోంది. ఈ విమానానికి పట్టిన దుర్గతిని మిగతా విమానాలు చూశాయి. తమని కాసట్టుగా అవి దూరంగా వెళ్ళిపోయి మరల ఆ ప్రాంతానికి రాలేదు.

కొండ విరిగిపడినట్టు శబ్దం విన్నారు గెరిల్లాలు. నేల కొన్ని క్షణాలపాటు కంపించింది. విమానం అంటుకొని మండుతోంది. విమానం యింకా కూలుతుండగానే విమానంలోంచి బ్రిగేడియర్ శశిధర నే దూకేశాడు. చెట్ల కొమ్మలలో పడిపోయాడు. అతడి వొళ్ళంతా చీరుకుపోయింది.

విమానం భగ్గున మండుతోంది. అడవిలో వెచ్చటి సెగలు వీచాయి.

శశిధర నే చుట్టూ గెరిల్లాలు చేరారు. శశిధర నేకి స్పృహపోయింది. గెరిల్లాల మధ్య తంగం ప్రత్యక్షమయింది. ఆమె చేతిలో టెలిస్కోపిక్ రైఫిల్ వుంది. ఆమె మొహంలో మొక్కవోని పట్టుదల వుంది.

"నువ్వేనా కాల్చావ్ తంగం!" అడిగాడు కల్నల్.

"అవును సార్! నేనే దాన్ని కాల్చాను!" అంది తంగం. తర్వాత ఆమె శశివర్ధన్ వద్దకు నడిచింది. అతడిని చూస్తూనే మతిపోయినట్టు నిలబడిపోయింది.

కల్నల్ పిస్తోలెత్తి శశివర్ధన్ కేసి కాల్చి చంపబోయాడు.

"వద్దు సార్! చంపవద్దు!" అంది తంగం.

"ఈ అరాచకానికి యితడే కారకుడమ్మా! జాలి చూపక!" అన్నాడు కల్నల్.

తంగం తల అడ్డంగా తిప్పింది.

"ఇతడు మరల మనకి అపకారం చేయవచ్చును" అన్నాడు కల్నల్.

"ఆ పని జరగకుండా నేను చూసుకుంటాను సార్!" అంది తంగం.

గొరిల్లాలు ఆమెను అభినందనలతో ముంచెత్తారు.

## 12

శశివర్ధన్ కి ఆ రాత్రికి స్పృహ వచ్చింది. అతడు కళ్ళు తెరిచేటప్పటికి రెండు అందమైన కళ్ళు అతడి మొహంలోకి చూస్తూన్నాయి.

"....ఎ....క్క....డు....న్నా....ను...?" అడిగాడు శశివర్ధన్.

"ఇక్కడే....గొరిల్లాల స్థావరంలో" అంది తంగం.

శశివర్ధన్ నీరసంగా నవ్వాడు. తంగం అతడికి బార్లీ పట్టించింది.

"నన్ను యింకా చంపలేదేం?" అడిగాడు శశివర్ధన్.

"ఏం? ఎందుకు చంపాలి?" అంది తంగం.

"శత్రువుమీద ఇంత దయా? ఆశ్చర్యం!" అతడు బాధగా కళ్ళు మూసుకున్నాడు.

"మాట్లాడక!" ఆమె అతనికి తెలియకుండా ఇంజెక్షన్ యిచ్చింది. శశిధర్ నే మగతలోకి జారుకున్నాడు.

• • •

"నామీద నీ కెందుకింత ప్రేమ?"

"ఊఁ!"

"చెప్పు. నీ శత్రువును. నీ కెప్పటికయినా అపకారం చేయవచ్చును."

"నువ్వు నన్ను మర్చిపోయావా?"

"ఎవరు నువ్వు? నా ప్రాణాలు కాపాడిన అమృతమూర్తివి."

"కాదు. నీ చిన్నప్పటి కట్టితంగం. మీ యింటి ప్రక్కగా వుండేవాళ్ళం. మా నాన్న పోస్టుమాన్. మా అమ్మ ఒకసారి మనం ఇద్దరం ఆడుకుంటూంటే నన్ను కొట్టబోయింది. 'సింహాళీ వానితో నీకు ఆట యేమిటే?' అంది. ఆ దెబ్బ నీకు బుగ్గమీద తగిలింది. ఈ మచ్చ నాకు బాగా జ్ఞాపకం! నీ కనుముక్కు తీరూ, యీ బుగ్గన దెబ్బ—వీటివల్లనే నిన్ను గుర్తుపట్టాను."

"కట్టితంగం....!"

"ఊఁ! నీ చిన్నప్పటి కట్టితంగాన్ని!"

"ఇప్పటికీ నా?"

"అవును. ఎప్పటికీనూ....నువ్వే నా ప్రాణం!"

బ్రిగేడియర్ శశిధర్ నే వణికాడు. శత్రుకూటంలో వున్నాననీ, ఒక ఆడ గెరిల్లా తననీ తన రాజకీయ చాకచక్యాన్నీ ప్రేమబంధంతో ఇరికించి ఇక్కడ దిక్కూ మొక్కూ లేని అడవిలో వుంచేస్తుందని కాదు. గెరిల్లా

బారి నుండి తప్పించుకొని తన ప్రజలను కలుసుకోలేకనీ కాదు.

ఒక ఆడపిల్ల — చిన్నతనంలో నే తనతో స్థానాన్ని హృదయంలో పదిలపరచి వుందనీ — ఏళ్ళూ పూళ్ళూ గడిచినా ఆ స్థానాన్ని అలాగే ఖాళీగా వుంచిందనీ తెలిసి అతడు వొణికిపోయాడు.

"ఇంత కాలం.... నువ్వు ... ఇంతమంది మగవాళ్ళతో సహచరిస్తూ కూడా " అడిగాడతడు. తన ప్రశ్నలోని అసమంజసతను ఆలస్యంగా గుర్తించాడు.

తంగం నొచ్చుకోలేదు. నిజమే! మగవాడికి రావాలసిన సందేహమే అది! అతని తలను తన రొమ్ములకు బలంగా అదుముకొంది. వేడిగా కాలుతోన్న ఆమె పెదవులు అతని బుగ్గమీద మచ్చను ముద్దు పెట్టుకున్నాయి.

"ఈ మచ్చ కోసం ఈ కనుముక్కు తీరు కోసం కాచుకున్నాను నేను. నా కన్యత్వాన్ని పదిలంగా దాచుకున్నాను! సందేహమా?"

అతడు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

సైన్యసమూహాలూ జాతుల మధ్య విద్వేషాలూ లేవు అతని మనస్సులో. దేశాలూ మధ్యాహ్నం తొలి వెలుగు. పతకమూ యుద్ధకాలమూ జారిపోతున్నట్టు తెలిసివచ్చిన ఆనందమూ ఉద్వేగమూ వుత్తేజమూ.... వున్నాయి.

• • •

ఇద్దరి మధ్యా అరమరికలు లేవు. రహస్యాలూ లేవు. నా కళ్ళ నా టాకి అతడు ఓస్ అంతేనా అంటుంది ఆమె.

రాత్రో పగలో వాళ్ళకి అనవసరం!

కావలసినంత ఏకాంతం దొరికింది. జలపాతం మనోహరంగా మాటతోంది. గొల్లాలు అక్కడికి చాలా దూరంలో వున్నారు. విప్లవానికి వూపు అందింది. తమిళ పాటలు గొల్లాలతో కలిసిపోయారు.

సరికొత్త వ్యూహారచనలో వుంది విప్లవ పంథా.

అదేమీ వాళ్ళకి తెలియదు.

ఇద్దరి మధ్యా జాతిభేదం లేదు. ఇద్దరూ చిన్నవాటి స్నేహితులు.

బట్టలు లేకుండా కాలవలో స్నానం చేయడం యిద్దరికీ గుర్తుంది. పంటపొలాల్లో చిన్న చిన్న గోచీలతో ఇద్దరూ పరుగులు తీశారు.

ఒకరికి తెలిసిన శరీరమే మరొకరిది!

అయితే అప్పటి చాపల్యం యిప్పటి యువ్వనావేశంగా పరిణామం పొందింది.

ఒకరి పుట్టుమచ్చ లొకరికి తెలుసు. ఒకరి మనసులోని మాట ఒకరికి తెలుసు. ఆ తన్మయత్వం వేరు! ఆ పరిశోధన వేరు! ఆ ఏకాగ్రతే వేరు!

"నన్ను వొదిలి వెళ్ళిపోతావా?" అంటుందామె.

"ఎందుకనుకున్నావు? ఈ అందాన్ని, ఈ అందమైన మనసునూ ఎవరు వొదులుతారు?"

"నీకు పైన్యాన్యత్య పదవి వుంది. ఎప్పటికయినా ఈ లంకకి రావణుడంతటి రాజువవుతావు! నా దేముంది? అడవిపిల్లను! ఇక్కడి పరిచయం మరచిపోతావు. నీ పదవికి పారిపోతావు. అవునా?"

"ఛ....ఛ ..."

"నిజంగా...."

"ఊఁ!"

"నీకు ఎప్పటికీ వెళ్ళిపోవాలనిపించదా?"

"అనిపిస్తే నిన్ను తీసుకుపోతాను!"

"అమ్మో....యిక్కడ మా వాళ్ళని వదిలిపెట్టి రావడమే...."

"ఏం?"

"ఈ మట్టిలో పుట్టాను. ఇక్కడి ప్రజల బాధలతో నాకు పనుంది!"

"నా బాధలో లేదా?"

ఆమె కిలకిల నవ్వుతోంది. తన రొమ్ముల మధ్య అతడి చెక్కిలి దాస్తుంది.

## 13

"నీకు మతిపోయిందా అమ్మా? అతడితో సముద్ర తీరానికి వెళ్తావా?" అడిగాడు కల్నల్.

తండ్రిని చూచినట్టు చూచింది తంగం. "ఏం సార్? ఏమైనా?" అంది.

"బ్రిగేడియర్ శశిధర్ నే బతికే వున్నట్టు శ్రీలంక పరిపాలకులకు తెలిసింది. అతనిని కాపాడుకోవడం కోసం గస్తీ నౌకలు బయలుదేరాయి. అతడిని తమ కందించమని, సంధి బేరానికి రమ్మని పరిపాలకులు కబురు పంపారు.

"సంధి బేరమా? జాతుల మధ్య వివక్షత పోయినట్టేనా?"

"ఒట్టిమాట తల్లీ!"

"అమాయకుల మీద యింతా దాడిచేసి వాళ్ళు యేం బావుకుందామని?"

"అధికారం నల్లమందు గుళిక తల్లీ! ఆ గుళికను అల

వాటుపడినవాడు యిక గుళిక మ్రింగకుండా ఆగలేదు తల్లీ!"

"సార్ నాదో అనుమానం! సముద్రంలో గస్తీ నౌకలు తిరిగితే మాత్రం యేం లాభం? శశివర్ధనేను ఎలా కాపాడుకుంటాయి?"

"నా అనుమానం నిజమైతే ఒక అగ్రరాజ్యం అతనిని ఎత్తుకుపోతుంది."

"ఎత్తుకుపోతుందా? ఎందుకు సార్?"

కల్నల్ నవ్వి, "ప్రేమ మైకంలో నీ మస్తిష్కం మొద్దుబారిపోయింది. శశివర్ధనేకి అటు శ్రీలంక సైనిక రహస్యాలూ, ఇటు తుల్ఫ నాయకుల — గెరిల్లాల పూర్తి వివరాలూ తెలుసు! శ్రీలంకను అగ్రరాజ్యం తన రాజ్యానికో వలసరాష్ట్రం చేసుకుంటుంది!"

"అఁ! అన్యాయఁ!"

"కలిసే మనం మెయిన్‌లాండ్ ఇండియాలో కలుస్తాం! అది మనకి ఉపకారం! అంతే కాని.... యెక్కడో వున్న అగ్రరాజ్యానికి మనమీద పెత్తనం యేమిటి?"

"ఇలా సైనిక జోక్యం మరి యెందుకు చేసినట్టు? వూరకనే ఉపకార మనుకుంటున్నావా? వియత్నాం, లిబియా యిలాంటి బడుగుదేశాలను కబళించాలని చూచే అగ్ర రాజ్యాలు శ్రీలంకను విడిచిపెడతాయా? అందుకే శశివర్ధనేను వాళ్ళ బారిన పడనివ్వకూడదు తల్లీ!"

తంగం అలాగే చూస్తోంది. ఆ చూపులో ఎలాంటి నిశ్చయమూ కనిపించలేదు.

  

సముద్ర కెరటాలు ఉవ్వెత్తున పడుతున్నాయి. దిగంతాలవైపు సీగల్ పక్షులు ఎగురుతున్నాయి. పక్షులకు దిగువగా నీటిమీద నల్లటి మచ్చ కనిపించింది.

శశిధర్ జీ ఆ మచ్చనే చూస్తున్నాడు. బైనాక్యులర్స్‌లో స్పష్టంగా కనిపిస్తోంది. మచ్చ కాదది. సెవెన్త్ ఫ్లీట్‌లోని ఒక ఓడ! ఓడమీద హెలికాప్టర్లూ, విమానాలూ లాండ్ అయివున్నాయి. గాలిలోకి హెలికాప్టర్ లేచింది.

శశిధర్ జీ నవ్వుకున్నాడు. తన ప్రయత్నం ఫలించింది. తీరం వెంబడే సరుగుడు చెట్లు వున్నాయి. చెట్లకు గుడ్డలు ఆరబెట్టాడు. అవి సంకేతాలుగా పనిచేసి సెవెన్త్ ఫ్లీట్ షిప్‌ను ఆకర్షించాయి.

శశిధర్ జీ ఉలిక్కిపడ్డాడు. తంగం చెట్టుచాటు నుండి అతనివైపు వస్తోంది. మోకాళ్ళు దాటని గౌను వేసుకుంది ఆమె. ఎర్రటి గౌనులో ఆమె మరింత అందంగా మెరుస్తోంది ఆమె చేతిలో కూడా బైనాక్యులర్స్ వుంది.

"శశీ! వెళ్ళిపోతావా?" అందామె.

"క్షమించు తంగం! నన్ను వాళ్ళదేశం తీసుకుపోతారు! శ్రీలంకలో వుండి ఇక్కడ ఎంతో జననష్టానికి కారణమయ్యాను! ఈ స్మృతుల నుండి నేను దూరంగా పారిపోవాలి తంగం!" అన్నాడు శశిధర్ జీ.

"నన్ను తీసుకువెళ్తానన్నావు!"

"ఇప్పుడు కూడా కాదనడంలేదు. నా వెంటే నువ్వూనూ...."

"కాని ఆ దేశంలో మనం బానిసలం! మన నుండి రహస్యాలను బెదిరించి లాక్కుంటారు. వాళ్ళకి కావల

సిన సమాచారం అందాక మనల్ని పిట్టల్ని కాల్చినట్టు కాల్చి చంపుతారు!”

హెలికాప్టర్ తీరాన్ని సమీపిస్తోంది.

శశిధర్ నే చెయ్యి వూపాడు.

“పద తంగం! అతనితో మాట్లాడతాను....మనం ఇద్దరమూ ...”

హెలికాప్టర్ దిగుతోంది.

తంగం నిశ్చయించుకుంది. అయిపోయింది. శ్రీలంక భవితవ్యం ఇంక కొన్ని క్షణాల్లో ముగుస్తోంది.

తంగం అతని జుత్తులో వేళ్ళు జొనిపింది. బలంగా ముందుకు వంచింది.

హైవాక్యలర్స్‌తో బలంగా మొత్తింది. హైవాక్యలర్స్ అతడి చిన్న మెదడుమీద తగులుతుందని గానీ, ఆ దెబ్బకే అతడు తొర్లగిలి పడిపోతాడని కానీ, పడిన వాడు ఇక లేవడని కాని తంగం వూహించలేదు.

అతని ప్రయాణాన్ని ఆపాలి! అంతవరకే!

అతని ప్రయత్నానికి అడ్డుపడాలి! అంతే!

హెలికాప్టర్ గాలిలో గిరికీలు కొడుతోంది.

“శశీ! శశీ!” అతడిని వెల్లకిలా తిప్పింది

శశి కళ్ళు పగిలిన పత్తికాయల్లాగా తెరుచుకుని వున్నాయి.

“శశీ!” అరచిందామె. హైవాక్యలర్స్‌ను పిచ్చిగా గాల్లోకి విసిరింది.

‘భళ్’ అంది అద్దం.

తంగం తలెత్తింది.

హెలికాప్టర్ తోకముడిచి నీటిమీదకు పారిపోయింది.

భగ్గున మండిపోతోంది.

తంగానికి తెలియదు. తన ప్రియుడిని బలిగొన్న సైనాధ్యులక్సే ఆ మంటకు కూడా కాగటం అని!

“ప....ద....ం....డి....వీర జవాన్లారా!
ప ద ం డి శూరపుత్రుల్లారా....
పదండి....పదండి... పదండి... ”

కలుపుతూ గేయం పాడుతోంది కట్టికంఠం పిచ్చి పట్టినదానిలా....

—:అ యి పో యి ం ది:—

సీరియల్

వి.యస్.రావ్




(గత సంచిక తరువాయి)

కోర్టు గుమాస్తా అతని చేత ప్రమాణం చేయించాడు.

"డాక్టర్, గీత శవాన్ని, నర్మద శవాన్నీ మీరు పరీక్షించారా?" ప్రాసిక్యూటర్ ఉత్సాహంగా ప్రశ్నించాడు.

"పరీక్షించాను. ఆ తరవాత పోస్టుమార్టమ్ కూడా చేశాను."

"మొదట గీత గురించి మాట్లాడుదాం, డాక్టర్, గీత యెలాంటి స్థితిలో మరణించింది?"

"మిస్ గీత కర్కశంగా, పాశవికంగా రేప్ చేయబడింది. ఊపిరి ఆడని కారణంగా ఆమె మరణించింది."

"డాక్టర్, మూడో తారీఖు రాత్రి రేప్ చేయబడక ముందు ఆమె శరీర స్థితి ఎలా వుండివుంటుంది? ఐ మీన్ రేప్ కిముందు ఆమెకి లైంగికానుభవం వుండి వుంటుందా?"

ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

"అప్పటిదాకా ఆమె కన్యగానే వుందా, అని మీరు అడుగుతున్నారు. నిస్సందేహంగా ఆమె కన్యగానే వుంది. మూడో తారీఖు రాత్రిదాకా ఆమె అనాఘ్రాత పుష్పం అని ఖచ్చితంగా చెప్పొచ్చు. మానభంగం జరిగినప్పుడే ఆమె కన్నెపొర ఛేదించబడింది" డా॥ సంజీవరావు నిష్కర్షగా అన్నాడు.

ప్రాసిక్యూటర్ గజానవరావు ఒకసారి సాభిప్రాయంగా జడ్జిని, జ్యూరీ సభ్యుల్ని చూసి, సాక్షివైపు తిరిగాడు. "డాక్టర్ గీత మరణం ఎప్పుడు సంభవించి వుంటుందని మీ రిపోర్టు చెప్తోంది?"

"రిగర్ మార్టిస్‌ని బట్టి పన్నెండు గంటల ప్రాంతంలో మరణం సంభవించి వుంటుందని చెప్పొచ్చు."

"డాక్టర్, జరిగిందేదో ఆమె అంగీకారంతో జరగలేదనీ బలాత్కారంగా జరిగిందనీ చెప్పడానికి మీకు యేమైనా ఆధారాలున్నాయా?" ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

"చాలా వున్నాయి. ఆమె శరీరంమీద రక్తంకారేలా యెన్నో గాట్లు ఏర్పడ్డాయి. గాట్లూ, రక్కులే కాకుండా ఆమె చెంపమీదా, మెడమీదా దెబ్బలు తగిలిన గుర్తులున్నాయి. ఆమె ప్రతిఘటించిన లక్షణాలు కనిపించాయి. తనమీద రాక్షసంగా అఘాయిత్యం చేసిన వ్యక్తిని ఆమె పొడుగాటి గోళ్ళతో రక్కింది. గోళ్ళ సందుల్లో చిన్న చిన్న చర్మం ముక్కలు—రక్తంతో తడిసినవి ఇరుక్కున్నాయి...."

"జస్టే మోమెంట్ డాక్టర్. ఆమె గోళ్ళ సందుల్లోని రక్తం ఆమెది కదా?"

"కాదు. ఆమె రక్తం గ్రూపు వేరు. గోళ్ళ సందులోని రక్తం గ్రూపు వేరు ..."

"అది ఎవరి రక్తమో కనుక్కున్నారా?" ప్రాసిక్యూటర్ ఉద్వేగంగా అడిగాడు.

"ఆ. అది కరుణాకర్ రక్తం అని తేలింది."

"డాక్టర్, కరుణాకర్‌ని మీరు పరీక్షించారా?"

"పరీక్షించాను."

"మీ పరీక్ష ఏం తెలియజేసింది, డాక్టర్?"

"అతని ముఖంమీద గోళ్ళతో యేర్పడ్డ గీతలున్నాయి. అతను అంతకు క్రితం లైంగిక సంపర్కం పొందినట్టు తెలిసింది. వీర్యస్ఖలనం జరిగిన ఆనవాళ్ళు కనిపించాయి."

కరుణాకర్ రెప్పవేయకుండా, ఆశ్చర్యంతో డాక్టర్ని చూశాడు. డాక్టర్ సంజీవరావు ఎందుకు అబద్ధమాడుతున్నాడు? తను ఆయనకి శత్రువు కాదు! తనని ఉరితీయడానికి తాడు పేనడంలో డాక్టర్ సంజీవరావు కూడా పూర్తిగా సహకరిస్తున్నాడు! ఎందుకు? ఈ కుట్ర యెందుకు సాగుతోంది? ఎవరు సాగిస్తున్నారు? ప్రాసిక్యూటర్ కంఠం అతని ఆలోచనల్ని తెంచేసింది.

"థాంక్యూ డాక్టర్! ఇప్పుడు నర్మద విషయం తీసుకుందాం. నర్మద మరణానికి కారణం యేమిటి?"

"విషప్రయోగం. పొటాషియం సైనైడ్! ఆమె తాగిన హార్లిక్స్‌లో పొటాషియం సైనైడ్ మోతాదు మించి వుంది...."

"డాక్టర్, ఆమె తాగలేదు; తాగించబడింది!" ప్రాసిక్యూటర్ నవ్వుతూ అన్నాడు. డాక్టర్ నవ్వుతూ బట్టతలని ఊగించాడు.

"డాక్టర్, ఆమె గర్భవతి అని విన్నాను...."

"యస్. ఆరో నెల. ఎంతో బాధపడుతూ ఆమె శవాన్ని పోస్టుమార్టమ్ చేశాను. హారిబుల్!" డా॥ సంజీవరావు ఉద్రేకంతో అన్నాడు.

"మానవజాతికి మేలుచేసే మనలాంటి వాళ్ళకి అలాంటివి హారిబుల్‌గానే అనిపిస్తాయి. నరరూప రాక్షసులకి అలా అనిపించదు, డాక్టర్!" ప్రాసిక్యూటర్ గంభీరంగా అన్నాడు. డాక్టర్ బుర్ర ఆడించాడు.

"మిస్టర్ ప్రాసిక్యూటర్ అధిక ప్రసంగం వద్దు! ప్రొసీడ్ విత్ ది కేస్!" జడ్జి గోస్వామి తీక్షణంగా అన్నాడు.

"సారీ మిస్టర్ జస్టిస్. డాక్టర్‌గారి మాటల్తో కడుపు తరుక్కుపోయి "

"ప్రొసీడ్ విత్ ది కేస్!" జడ్జి గోస్వామి హెచ్చరించాడు.

ప్రాసిక్యూటర్ సాక్షివైపు తిరిగాడు. "డాక్టర్, నర్మద మరణించిన సమయాన్ని నిర్ధారించారా?"

"ఆ. పదకొండూ, పదకొండూ పదిహేను మధ్య ఆమె మరణించింది."

"థాంక్యూ డాక్టర్. అంతే!?" ప్రాసిక్యూటర్ గజాననరావు కరుణాకర్ వైపు తిరిగాడు. "క్రాస్ ఎగ్జామిన్!" అన్నాడు నిర్లక్ష్యంగా.

కరుణాకర్ మాట్లాడకుండా అతన్ని చూశాడు. ఎన్నో ట్రయల్స్‌లో తనచేత భంగపడి తనకు పోటీగా మారిన గజాననరావు, కేసు వోటమిని వ్యక్తిగత పరాజయంగా భావించే గజాననరావు ఇప్పుడు ఇనుమడించిన ఉత్సాహంతో తనమీద కసి తీర్చుకుంటున్నాడు. తను

క్రాస్ ఎగ్జామిన్ చేస్తే తనని తుపాతునకలు చేసే అవకాశం అతనికి బాగా లభిస్తుంది! కరుణాకర్ నిస్సహాయంగా నిట్టూర్చాడు.

"ప్రశ్నలు లేవు...." అన్నాడు నిర్లక్ష్యంగా.

"మిస్టర్ రమాకాంత్!" ప్రాసిక్యూటర్ గజానన రావు గంభీరంగా పిలిచాడు.

పాంటూ షర్టూ వేసుకున్న సన్నటి వ్యక్తి బోనెక్కి ప్రమాణం చేశాడు,

"మిస్టర్ రమాకాంత్, మీ ఉద్యోగం ఏమిటి?" ప్రాసిక్యూటర్ కాలం వృధా చేయకుండా రంగంలోకి దూకాడు.

"ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్టుగా ఉద్యోగం చేస్తున్నానండి" రమాకాంత్ కంఠం బొంగురుగా ధ్వనించింది.

"ఈ మాసం మూడో తేదీ రాత్రి, నాలుగో తేదీ ఉదయం మీరు యెక్కడెక్కడ వేలిముద్రలు తీశారా?"

"మూడు రాత్రి పార్కురోడ్డులోని ఇంట్లో, నాలుగు ఉదయం కరుణాకర్ గారింట్లో వేలిముద్రలు తీశానండి."

"పార్కు రోడ్డులోని ఇంట్లో యెవరెవరి వేలిముద్రలు దొరికాయో చెప్పండి."

"గది తలుపుమీదా, మంచం అంచులమీదా, తలగడ మీదా రెండు రకాల వేలిముద్రలు దొరికాయండి."

"అవి ఎవరి వేలిముద్రలో తెలుసుకున్నారా?"

"తలుపులమీద కరుణాకర్ గారి వేలిముద్రలూ, మంచంమీదా, తలగడమీదా కరుణాకర్, గీతల వేలిముద్రలూ దొరికాయండి. వాళ్ళిద్దరి వేలిముద్రలూ తీసుకుని, గదిలో దొరికిన వాటితో పోల్చిచూశాను."

"గుడ్, కరుణాకర్ ఇంట్లో, పడగ్గదిలోకి వెళ్దాం:

అక్కడ యెవరి వేలిముద్రలు దొరికాయి?"

"కరుణాకర్ గారి వేలిముద్రలూ, హత్య చేయబడిన నర్మద వేలిముద్రలూ దొరికాయి ..."

"మిస్టర్ రమాకాంత్, నర్మద హత్య చేయబడిందని మీకెలా తెలుసు?" ప్రాసిక్యూటర్ తెలివిగా ప్రశ్నించాడు.

"హత్య జరిగినట్టు అనుమానంగా వుందన్నారు, ఇన్స్పెక్టర్. విషప్రయోగం వల్ల ఆమె మరణించిందని డాక్టరన్నారు. మంచం పక్కనే టీపాయ్ మీదున్న లోటాలో హార్లిక్స్. విషం కలపబడ్డాయనికూడా డాక్టరన్నారు. ఆ లోటామీద కరుణాకర్ గారి వేలిముద్రలున్నాయి. అంచేత ఆమె హత్య చేయబడిందనుకున్నా ...."

ప్రాసిక్యూటర్ చిరునవ్వుతో చూశాడు. "యూ ఆర్ రైట్! ఆ లోటామీద హత్య చేయబడిన నర్మద వేలిముద్రలు లేవా?"

"బొత్తిగా లేవండి."

"మిస్టర్ రమాకాంత్, వేలిముద్రలకోసం ఇంకా యెక్కడేనా వెతికారా?"

"సహజంగా, హార్లిక్స్ బాటిల్, పంచదార డబ్బా, పాలుపోసిన ఫ్లాస్కూ, డైనింగ్ టేబుల్ మీద పడున్న స్టీలు చెంచా—వీటన్నిటినీ వేలిముద్రలకోసం పరీక్షించాము. అన్నింటిమీదా ఫ్రెష్ గా వున్న కరుణాకర్ గారి వేలిముద్రలు పుష్కలంగా లభించాయి."

"మీరు పోల్చిచూడలేని, కొత్త వేలిముద్రలు—వాడ్రైవర్ వికావు డా మరెవరివేనా—ఆ ఇంట్లో దొరికాయా?"

రమాకాంత్ తల అడ్డంగా ఆడించాడు. "ఇంట్లో

భార్యాభర్తల వేలిముద్రలు తప్ప మరెవ్వరివీ దొరకలేదండీ. తలుపుమీద మాత్రం ఒక కుడిచేతి అయిదు వేళ్ళముద్రలు దొరికాయి. అవి పాలవాడివని తేలిందండీ."

గోడగడియారం గంటలు కొట్టసాగింది.

జడ్జి గోస్వామి కేసుని ఆ మరునాటికి వాయిదా వేశాడు. ముద్దాయి కరుణాకర్‌ని రిమాండ్‌లో వుంచమన్నాడు. కేసు గురించి చర్చించుకోకూడదనీ, నిర్ణయాలు తీసుకోకూడదనీ జ్యూరీ సభ్యుల్ని హెచ్చరించాడు. తన చేతిని పట్టుకున్న పోలీసుని కరుణాకర్ ఎర్రటి కళ్ళతో చూశాడు.

* * *

కటకటాలకి అటువైపు ఎదురుగా నిలబడ్డ వ్యక్తిని కరుణాకర్ దీనంగా చూశాడు. "మాస్టారూ...."

పంచా లాల్చీలో బక్కపల్చగా, పొడుగ్గా వున్న అన్నారావు కరుణాకర్‌ని సానుభూతితో చూశాడు. అతనిలో భుగభుగ మండుతున్న బడాగ్ని ఎర్రటి కాంతి ఎర్రటి కళ్ళల్లో ప్రతిఫలిస్తున్నట్టుంది. చెదిరిపోయిన క్రాపుతో, అరంగుళం పొడవు పెరిగిన గడ్డంతో, మాసిపోయిన దుస్తుల్లో ఉన్న కరుణాకర్ తనకి గతంలో పరిచయం ఉన్న కరుణాకర్ కాడనిపిస్తోందతనికి. అన్నారావు మెల్లిగా నిట్టూర్పు విడిచాడు.

"కరుణాకర్, నువ్విలా చేస్తావని నేను అనుకోలేదు...."

"మాస్టారూ.."

"కేసుని గాలికి వదిలేసి, చేతకానివాడిలా తప్పు చేసిన వాడిలా బొమ్మలా నిలబడతావని నేను ఊహించలేదు కరుణాకర్!" అన్నారావు దళసరి కళ్ళద్దాలగుండా

చూస్తూ అన్నాడు.

అతని కంఠంలో వ్యథ గంటలా ధ్వనించింది.

"మాస్టారూ!"

"నువ్వు నిరపరాధివని నాకు తెలుసు కరుణా కర్ ...." అడ్వొకేట్ అన్నారావు నీరసంగా నవ్వుతూ అన్నాడు.

ఎర్రటి కళ్ళు తడిగా మెరిశాయి. "మాస్టారూ.... థాంక్స్ .... మాస్టారూ....!" కరుణాకర్ కంఠం వణికింది.

అన్నారావు అతన్ని తీక్షణంగా చూశాడు. "కరుణా కర్, యివాళ కోర్టులో నేనూ ఉన్నాను. నువ్వు నీ విశ్వ రూపాన్ని చూపిస్తావనుకున్నాను...."

"మాస్టారూ...."

తెల్లటి గుబురు కనుబొమల కిందినుంచీ అన్నారావు కళ్ళు అతన్ని తదేకంగా చూశాయి. "ప్రాసిక్యూటర్ ఇంట్రొడ్యూస్ చేసిన ప్రతి సాక్షినీ నువ్వు క్రాస్ ఎగ్జామిన్ చేసివుండొచ్చు. ఎన్నో సందర్భాల్లో, అబ్జెక్ట్ చేసివుండొచ్చు. నీ వాక్చాతుర్యాన్ని, నీ ధర్మాన్ని నువ్వు ఎందుకు విస్మరించావ్ కరుణాకర్."

కరుణాకర్ కళ్ళు పెద్దగా చేస్తూ చూశాడు. వృద్ధుడైన అన్నారావు నుదురు నాగేటి చాళ్ళున్న నేలలా ఉంది.

"నా దగ్గర అసిస్టెంటుగా పనిచేసి, చట్టాన్ని అర్థం చేసుకున్న నువ్వు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తావనుకో లేదయ్యా!" అన్నారావు కంఠం గాద్గదికంగా ధ్వనించింది.

కరుణాకర్ బరువుగా నిట్టూర్చాడు. "మాస్టారూ,

ఈ కేసుని మీ శిష్యుడు జయించలేడు! నన్ను సర్వనాశనం చేయడానికి ఏదో నాటకం సాగుతోంది. సాక్ష్యాలన్నీ నీట్ గా కల్పించి పెట్టబడి, చక్కగా ఇస్త్రీ చేయబడ్డాయి...."

"కరుణాకర్!"

"మాస్టారూ, మీతో నిజం చెప్తాను. కేసుమీద నా ధ్యాస లేదు. జీవితంమీద ఆశ లేదు. నా ఆశలూ ఆశయాలూ, కోరికలూ, పట్టుదలా, పగా, ప్రతీకార వాంఛా, అన్యాయాన్ని ఎదిరించాలన్న ధ్యేయం, నా నిజాయితీని నిరూపించుకోవాలన్న ఆవేశం—అన్నీ నాలోంచి వెళ్ళిపోయాయి మాస్టారూ. నాలోని అన్నింటినీ, నా సర్వస్వాన్నీ నా సర్వస్వం అయిన నర్మద తనతో తీసుకెళ్ళిపోయింది మాస్టారూ!"

కరుణాకర్ చేతులు కటకటాల్ని బిగించి పట్టుకున్నాయి. అశ్రువులు అతని గడ్డాన్ని తడుపుతున్నాయి. అన్నారావు కదిలిపోయాడు.

"బాబూ!" అన్నారావు గుస గుసగా అన్నాడు. అప్రయత్నంగా అతని చేతులు కటకటాల్ని నొక్కుతున్న కరుణాకర్ వేళ్ళని వాత్సల్యంతో స్పృశించాయి.

"కరుణాకర్, నీలో మండుతోన్న కార్చిచ్చు వేడి నా హృదయాన్ని తాకుతోంది.. నీ బాధని నేను అర్థం చేసుకోగలను. కానీ. నిరపరాధిని అపరాధిగా చిత్రించి శిక్షించే ప్రయత్నాన్ని అడ్డుకోడం మన ధర్మం!"

"మాస్టారూ, నాకు తెలుసు—మనం అడ్డుకోలేం! అన్ని కళ్ళూ నన్నే హంతకుడిగా చూస్తున్నాయి. అన్ని

కళ్ళూ నన్నే అపరాధిగా చూపుతున్నాయి. అన్ని నోళ్ళూ నన్నే నిందిస్తున్నాయి. అన్ని నోళ్ళని మనం మూయలేం!" కరుణాకర్ దీనంగా అన్నాడు.

"ప్రయత్నం చేయకుండా ఫలితాన్ని ఆశించలేం. నీ కేసుని నేను టేకప్ చేస్తాను కరుణాకర్! జరిగిందంతా, జరుగుతోందంతా గూడుపుఠాణీ అని నిరూపించే ప్రయత్నం చేస్తాను!" అన్నారావు కంఠంలో ఉద్రేకం వణికింది.

కరుణాకర్ అతన్ని జాలిగా చూశాడు. "కోర్టుకి చెవులు మాత్రమే ఉన్నాయి, మాస్టారూ. దానికి కళ్ళుంటే గానీ మీరు ఈ కేసు గెలవలేరు! నిజం చెప్తున్నందుకు క్షమించండి...."

"కరుణాకర్, సందేహానికి యేమాత్రం అవకాశం లేకుండా, ఖచ్చితంగా అపరాధివని నిరూపించబడేదాకా నువ్వు నిరపరాధివన్న సంగతి మరచిపోతున్నావ్!" అన్నారావు గంభీరంగా అన్నాడు.

కరుణాకర్ అతన్ని సానుభూతితో చూశాడు. "మాస్టారూ, ఎంతోకాలంగా సంపాయించుకున్న మంచి పేరుని, ప్రఖ్యాతిని నా కేసు మూలంగా మీరు పోగొట్టుకుంటారు. చచ్చిన పాముని మీరు బ్రతికించలేరు. ఇప్పుడున్న కోరిక ఒక్కటే మాస్టారూ. ఏదో లోకంలో ఉన్న నర్మదను కల్సుకుని, నేను స్వహస్తంతో ప్రేమగా తాగించిన హార్లిక్స్‌లో విషం ఉన్న సంగతి నాకు తెలీదని, ఆమె పాదాలమీద వాలి ఆమెకి చెప్పుకోవాలి, మాస్టారూ....!" కరుణాకర్ కంఠం బొంగురుగా మారింది.

అన్నారావు అతన్ని చెమ్మగిల్లిన కళ్ళతో చూశాడు.

"పంచభూతాలన్నీ ఏకకంఠంతో చెప్పినా. నువ్వు విషం కలిపావన్నా, విషం కలపబడినట్లు నీకు తెలుసన్నా నర్మద నమ్మదు నాయనా! నువ్వు నిరపరాధివని అమ్మాయి ఆత్మకు తెలుసు! ఆ సత్యాన్ని మనం లోకానికి తెలియజేయాలి!" అన్నాడతను ఆవేశంతో.

కరుణాకర్ కంగారుగా చూశాడు. "వద్దు! వద్దు మాస్టారూ! ఇందులో మీరు తలదూర్చకండి! దయచేసి మరిచిపొండి!"

అన్నారావు అతన్ని చిరునవ్వుతో చూశాడు. "కరుణాకర్, నువ్వు భయపడుతున్నావ్!"

కరుణాకర్ తడిసిన ముఖాన్ని రెండు చేతుల్తో తుడుచుకున్నాడు. "నా గురించి నేను భయపడ్డంలేదు. నాలోని భయాన్ని కూడా నర్మద తీసికెళ్ళిపోయింది. ఎవడో కర్కోటకుడు నా కోసం మంటు వేస్తున్నాడు. ఆ మంటల్లో మీరు చిక్కుకోకండి మాస్టారూ!"

"కరుణాకర్, ఇంత దారుణంగా నీమీద పగ తీర్చుకునే వ్యక్తి యెవరు? నీ మూలంగా కేసు వోడిపోయిన వ్యక్తి. ఇంతలా హింసాకాండ సాగించే వ్యక్తి ఎవడున్నాడు?" అన్నారావు ప్రశ్నించాడు.

"ఎవ్వరూ లేరు. ఎవ్వర్నీ నేను మోసం చేయలేదు" కరుణాకర్ నీరసంగా అన్నాడు. అన్నారావు తలాడించాడు.

"మాస్టారూ! నా కోరిక తీర్చండి. ఇంటికెళ్ళి విశ్రాంతి తీసుకోండి!" కరుణాకర్ బలహీనంగా, దయనీయంగా అన్నాడు.

అన్నారావు అతన్ని తీక్షణంగా చూశాడు. "నువ్వు అమాయకుడివని చాటిచెప్పేదాకా నేను విశ్రాంతి తీసు

కాను! కరుణాకర్, నిన్ను యింతవరకూ గురుదక్షిణ అడగలేదు. నీ తరఫున వాదించనివ్వు. అదే నాకు దక్షిణ!"

"మాస్టారూ.... వద్దు...."

"నన్ను ఎవ్వరూ ఆపలేరు; కరుణాకర్. రేపు కోర్టులో ఆ సత్యాన్ని నువ్వు చూస్తావు. ప్రాసిక్యూటర్ గజాననరావూ చూస్తాడు! వస్తాను. రేపు కోర్టులో కల్సుకుందాం!"

"మాస్టారూ...." తలని కటకటాలకి ఆన్చి బలహీనంగా అరిచాడు కరుణాకర్. అన్నారావు తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు.

*　　*　　*

వాన్ తలుపులు చప్పుడుచేస్తూ మూసుకున్నాయి. చక్రాలు కదిలాయి.

తలని వెనక్కి ఆన్చి కళ్ళు మూసుకుని, కరుణాకర్ శిలావిగ్రహంలా కూచున్నాడు.

అతనికి అన్నారావు మాటలు గుర్తొస్తున్నాయి. తను జయించాలని ఆయన పట్టుదలతో వున్నాడు. కానీ, ఆయనకి తెలీదు.

తను యెప్పుడో పూర్తిగా వోడిపోయాడు! జీవితంలో శాశ్వతంగా ఓడిపోయిన వ్యక్తి కోర్టులో తాత్కాలికంగా గెలిస్తే వొరిగేదేముంది? కళ్ళుపోయిన వ్యక్తిముందు వెలిగించబడే దీపంలాంటిది ఆ గెలుపు!

"మిస్టర్ కరుణాకర్...."

కరుణాకర్ మెల్లిగా కళ్ళుతెరిచి, తనని పిలిచిన సాయుధ పోలీసువైపు చూశాడు. తనవైపు అదోలా చూస్తున్నాడతను.

"నిన్న మిమ్మల్ని సెల్‌లో పలకరించిన వ్యక్తి అడ్వొకేట్ అన్నారావుగారా?"

"ఆ."

"....రాత్రి పదిగంటలప్పుడు ఆయన కారు యాక్సిడెంట్‌కి గురయ్యింది....ఆయన అక్కడికక్కడే మరణించారు."

"వాట్?" కరుణాకర్ బొంగురుగా అరిచాడు. నమ్మలేనట్టు చూస్తూ నిటారుగా కూచున్నాడు. వాన్ మలుపు తిరిగింది. తూలిపడబోయిన కరుణాకర్ని పోలీసు పట్టుకుని ఆపాడు.

"నో!" అసంకల్పితంగా అరిచాడు కరుణాకర్. అతని శరీరం గజగజ వణకడం ప్రారంభించింది. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"ఎక్కడికో వెళ్ళి ఆయన తిరిగొస్తున్నారు. పార్కు రోడ్డునీ, బోస్ రోడ్డునీ కలిపే సందు దాటి మెయిన్ రోడ్డులోకి తిరిగారు. జోరుగా వస్తున్న లారీ కార్ని కొట్టేసి, వెళ్ళిపోయింది. కారు ముందుభాగం పచ్చడైంది. స్టీరింగ్ వెనకున్న ఆయన నుజ్జు నుజ్జయిపోయారట."

చెమ్మగిల్లుతూ, మండుతున్న కళ్ళని కరుణాకర్ పోలీసు వైపు తిప్పాడు. పోలీసు మొహం సాదాగా వుంది. "లారీ.. ఆ లారీ ....ఎవరిది?" వణికే కంఠంలో ప్రశ్నించాడతను.

పోలీసు నాలుక చప్పరించాడు. "నంబరు యెవరూ చూడలేదు. పొడుగాటి గెడ్డం వున్న సర్దార్జీ యెవడో లారీని నడుపుతున్నట్టు ఎవరో సైకిల్‌వాలా అన్నాడు. గెడ్డంవాలా ఎవడో తెలీలేదు. ఈపాటికతను ఆంధ్రా

బార్డర్, మహారాష్ట్ర బార్డర్ దాటి వెళ్ళిపోయి వుంటాడు?"

కరుణాకర్ శరీరం ఒక్కసారిగా చల్లబడిపోయింది. హిట్ అండ్ రన్! అడ్వొకేట్ అన్నారావు మాటలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి. తలని వెనక్కి వాల్చాడతను. వాన్ కోర్టు ఆవరణలో ఆగింది.

• • •

అతను పేవ్ మెంట్ మీద ఠీవిగా నడుస్తున్నాడు. తళతళ లాడుతున్న పాయింటెడ్—హైహీల్డు—షూస్ గర్వంగా చప్పుడు చేస్తున్నాయి. అతను ధరించిన వైట్ పాంట్, వైట్ ఫుల్ నెక్ స్వెట్టర్ డిటర్జెంట్ సోప్ అడ్వర్ టైజ్ మెంట్ లోలా ధగధగ మెరుస్తున్నాయి. ఎడం చేతికి వదులుగా వున్న గోల్డు చెయిన్. చెయిన్ కి మధ్యలో దీర్ఘ చతురస్రాకారంలో వున్న ప్లేట్ మీద గోపురం, మసీదు శిఖరం, సిలువా ఒకదానిమీదొకటి సూపర్ ఇంపోజ్ చేయబడ్డాయి. మూడుమతాల సంగమంలా వున్న ఆ గుర్తులచుట్టూ పెనవేసుకున్న పాముల ఆకారాలు బోర్డర్ లా వున్నాయి. తలమీద తెల్లటి బొచ్చుటోపీ.

అతను ఆగి, పక్కనే వున్న కోయా రెస్టారెంట్ లోకి జొరబడ్డాడు. అడ్డొచ్చిన వాళ్ళని నిర్లక్ష్యంగా తోసుకుంటూ, గోడవారగా వున్న కుర్చీలో చతికిలబడ్డాడు.

స్ట్రాంగ్ టీ ఆర్డరిచ్చి పేపర్ పట్రమ్మన్నాడు సర్వర్ని.

ఆటుపక్క టేబుల్ మీద పడున్న పేపర్ని అందించి, సర్వర్ వెళ్ళిపోయాడు.

కళ్ళని పూర్తిగా కప్పివున నల్లద్దాల్ని తీసి టేబుల్ మీద

పరేసి, అతను పేపర్ని తిరగేయడం ప్రారంభించాడు. అతని కళ్ళు ఆత్రంగా దేనికోసమో వెతుకుతున్నాయి. సర్వర్ టీ కప్పుని పెట్టాడు.

టీ తాగుతూ, పేపర్లో తన అన్వేషణ సాగిస్తూ ఉండిపోయాడతను. అతని కళ్ళు మెరిశాయి. ఆరో పేజీలో క్రింది భాగంలో ప్రచురించబడిన వార్త అతని దృష్టిని లాగిపట్టింది. ఒక్క గుక్కలో టీ తాగేసి, గబగబా చదవసాగేడతను.

'రోడ్డు ప్రమాదంలో అడ్వోకేట్ మరణం' అన్న శీర్షిక కింద రెండు చిన్న పేరాల్లో ఆ వార్త అచ్చయ్యింది. యాభై అయిదేళ్ళ లాయర్ అన్నారావు నడుపుతున్న కార్ని గత రాత్రి పదిగంటల ప్రాంతంలో లారీ ఢీకొంది. కారు ముందుభాగం లోపలికి చొచ్చుకుపోయి, అన్నారావు అక్కడికక్కడే మరణించాడు. లారీ ఆగకుండా వెళ్ళిపోయింది.

లారీని సర్దార్జీ నడుపుతున్నట్టు పోలీసులు కనిపెట్టారు. లారీ నంబర్ని చూసిన వాళ్ళు లేరు. యాక్సిడెంట్ చేసి పరారైన డ్రైవర్ కోసం పోలీసులు వెతుకుతున్నారు. కేసు నమోదయింది — వార్తని రెండుసార్లు చదివి పేపర్ని గిరాటేశాడతను.

అప్యాయంగా, నున్నగా గీసుకున్న గడ్డాన్ని, మీసాలులేని పై పెదవినీ వేళ్ళతో తడువుకున్నాడతను. తలపాగా, గడ్డం వున్న సిక్కు డ్రైవర్ కోసం పోలీసులు వెతకడం యెప్పుడో మానేసి వుంటారు! నిన్న రాత్రి తను తగిలించుకున్న గడ్డమూ, మీసాలూ తలపాగా గుడ్డతోపాటు కాలి బూడిదయ్యాయి.

తనకి అప్పజెప్పిన పని జయప్రదంగా పూర్తిచేసి

నంగుడు బాస్ రూంలో సంతోషిస్తాడు. తనకి యే పనీ చేతకాదంటూ ఎగతాళిచేసే ఆ గున్నపోతులు-సౌతరాజా జాకీ — ఇద్దరికీ ఏదో సుంగ! ఆ ముసలాయన్ని ఎందుకు పచ్చడిచేసాడో బాస్ తనకి చెప్పలేదు. ఆవేశంలో పిచ్చి వేషాలేసే వాళ్ళకి హెచ్చరికగా వుంటుందని మాత్రం అన్నాడు!

బాబ్జీ నవ్వుతూ సిగరెట్ వెలిగించాడు కళ్ళద్దాల్ని తగిలించుకుంటూ నిలబడ్డాడు సాసర్లో సర్వర్ పెట్టిన బిల్ ని అందుకుని వుండగా చేస్తూ కదిలాడు. కాగితం వుండని నోట్లో వేసుకుని నములూ కౌంటర్ వైపు చూడకుండా, తీవిగా ఇవతలికి నడిచాడు.

పక్కనే వున్న కిళ్ళీకొట్టులో మీఠాపాన్ కట్టించుకుని. నోట్లో పోసుకున్నాడు.

టైం చూసుకున్నాడు. ఎడిచేతికి అతుక్కున్న ఎలక్ట్రానిక్ వాచ్ పదికావస్తోందని చెప్తోంది.

తటాలున అతనికి బాస్ కేటాయించిన డ్యూటీ గుర్తు వచ్చింది. కొంచెం ముందుకు నడిచి, జీబ్రా చారలమీద రోడ్డు దాటాడు

తన డ్యూటీ నిర్వర్తించడానికి, కోర్టువైపు జోరుగా అడుగులేశాడు.

  

“మిస్టర్ గోవర్ధనరావ్. మీ వృత్తి?” పబ్లిక్ ప్రాసిక్యూటర్ గజాననరావు బిగ్గరగా ప్రశ్నించాడు.

“పోలీసు లాబొరేటరీ టెక్నిషియన్ గా పని చేస్తున్నా”

“ఈ నెల నాలుగో తారీఖున ఇన్స్పెక్టర్ సుధాకర్ మీకు యేదైనా పని అప్పగించారా?”

"ఒక స్టెయిన్ లెస్ స్టీలు లోటా యిచ్చి, లోటాలో కొద్దిగా మిగిలివున్న ద్రవాన్ని అనలైజ్ చేయమన్నారు."

"చేశారా?"

"చేశాను."

"మీ అనాలిసిస్ రిపోర్ట్ సారాంశం ఏమిటి?" ప్రాసిక్యూటర్ గజాననరావు ప్రశ్నించాడు.

"పాలూ, పోరిడ్జ్, పంచదార, పొటాషియం సైనైడ్ల మిశ్రమం ఆ ద్రవంలో వుందండి."

గజాననరావు కోర్టు గుమాస్తా దగ్గరగా నడిచాడు. పీపుల్స్ ఎగ్జిబిట్-6 గా గుర్తించబడిన లోటావున్న సెలిఫోన్ కవర్ని తీసుకుని, సాక్షి దగ్గరగా నడిచాడు.

"మిస్టర్ గోవర్ధనరావ్, అనలైజ్ చేయడానికి మీకు ఇవ్వబడిన లోటా ఇదేనా?"

"అదే. దానిమీద ఎన్గ్రేవర్ తో ప్లస్ మార్క్ వేశాను," అన్నాడు గోవర్ధనరావు.

"అంతే!" అంటూ గజాననరావు కరుణాకర్ వైపు తిరిగాడు.

"యూ మే క్రాస్ ఎగ్జామిన్!"

కరుణాకర్ సాక్షి, గోవర్ధనరావుని క్షణకాలం చూశాడు. అతనికి అన్నారావు మాటలు గుర్తొస్తున్నాయి. 'ప్రతి సాక్షినీ నువ్వు క్రాస్ ఎగ్జామిన్ చేసి వుండొచ్చు!' కరుణాకర్ తన దృష్టిని ప్రాసిక్యూటర్ వేపు మళ్ళించాడు.

"నో క్వెశ్చన్స్...."

గజాననరావు వెనక్కి తిరిగాడు. "ప్రాసిక్యూషన్ తరఫున తరవాతి సాక్షి కృష్ణంరాజును బోను ఎక్కమని

కోరుతున్నా!" అన్నాడతను నాలుగురోడ్ల కూడలిలో దండోరా వేస్తున్నట్టు.

ఖాకీ యూనిఫామ్‌లో వున్న కృష్ణంరాజు బోను ఎక్కాడు. కోర్టు గుమాస్తా అతనిచేత ప్రమాణం చేయించాడు.

"కృష్ణంరాజూ, నీ వృత్తి ఏమిటి?" ప్రాసిక్యూటర్ గజాననరావు ప్రశ్నించాడు.

పెదాలమీదికి జారిన బుర్రమీసాల్ని ఒకసారి వేళ్ళతో సర్దుకుని కృష్టంరాజు అతన్ని చిరునవ్వుతో చూశాడు. "టాక్సీ డ్రైవర్నండి. టాక్సీ ఓనర్ కూడా నేనే!" అన్నాడతను సగర్వంగా.

"కృష్ణంరాజూ, అదుగో—అక్కడున్న వ్యక్తి, కరుణాకర్‌ని ఎప్పుడేనా చూశావా?"

"చూశానండి."

"ఎప్పుడు?"

"మూడో తేదీ రాత్రి."

"ఎక్కడ?"

"రైల్వేస్టేషన్ ముందు టాక్సీ ఆపుకుని వున్నానండి. ఆయన అనుమానిస్తూ నా దగ్గరగా వచ్చారు. అటూ, ఇటూ చూసి తగ్గు స్వరంలో గిరాకీవుంది వస్తావాని అడిగారండి. వస్తాన్నాను. ఆయన ఒక అడ్రసిచ్చారు. ఆ ఇంటికెళ్ళి, గీత అనే ఆమెని పార్కురోడ్డులోని 114 నంబరు ఇంటికి తీసుకురమ్మన్నారండి ..."

"వెళ్ళావా?" ప్రాసిక్యూటర్ అడ్డొస్తూ అడిగాడు.

"అప్పుడే వెళ్ళలేదండి. రాత్రి తొమ్మిది గంటలు కావస్తోందండీ, అప్పుడు. ఎవరో మగాడు, ఎవరో ఆడదాన్ని ఏదో ఇంటినుంచీ మరేదో ఇంటికి తీసుకు

గొచ్చారు. టాక్సీలో ఎక్కారు. స్టార్టు చేసి పోనిచ్చాను. పార్కు రోడ్డులోకి తిరిగాక, ఎక్కడికి అని అడిగారండి. కార్ని ఆపి, కళ్యాన్సన అడ్రసు చెప్పారండి. కాసేపు ఆమె తటపటాయించి, చివరికి తీసుకెళ్ళమన్నారండి. తీసుకెళ్లాను. ఆ ఇంటి గేటుముందు ఆయన నించున్నారండి. నాకు పాతిక రూపాయలిచ్చారు; పాతిక అడ్వాన్సుగా ముందే ఇచ్చారులెండి." కృష్ణంరాజు ముగించాడు.

"కృష్ణంరాజూ, ఆ ఇంటి ముందు దిగేటప్పుడు గీత ఎలా ప్రవర్తించింది? సందేహం, భయం-ఇలాంటి భావాలేమైనా నీకు కనిపించాయా?"

"అక్కడ చీకటిగా వుందండి. ఆమె భావాలు నాకు కనిపించలేదు. కానీ అక్కడికెందుకు రమ్మన్నారంటూ కరుణాకర్ గార్ని అడిగింది. ఇంటికి వెళ్ళి మాట్లాడుకుందాం అంది. ఆయన మరేం భయంలేదు అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నారండి."

"తరవాత?"

"నా దారిన నేను వెళ్ళిపోయానండి. పొద్దుట పేపర్లో ఆమె ఫోటో చూసి, హడలిపోయానండి. కరుణాకర్ గారి మాట ప్రకారం ఆమెను నా టాక్సీలో పార్కు రోడ్డు బంగళా ముందు దింపానని తెలియజేశానండి...."

"కృష్ణంరాజూ, పొద్దుట పోలీసులు ఆమె శవాన్ని నీకు చూపించారా?" ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

"చూపించారండి. ఆమే అండి."

"అంతే," అంటూ గజాననరావు కరుణాకర్ వైపు తిరిగాడు.

"క్రాస్ ఎగ్జామినేషన్ లేదా?" అన్నాడు చులకనగా.

(ఇంకా వుంది)

